# చతుర

సంపుటి-4 డిసెంబర్ 1981 సంచిక-11

## ఈ నెల సమగ్ర నవల

"మాది నెల్లూరు జిల్లా. సినిమా మోజుతో ఇక్కడికి వచ్చాను. ఓ సంవత్సరం పాటు నానా బాధలూపడి వేషాల కోసం ప్రయత్నించాను. అయితే అందరూ నాతో ఆడుకొన్నారు. ఇంకా చెప్పాలంటే నన్ను వాడుకొన్నారు తప్పా వేషాలియ్యలే"దంటూ ఆమె ఆ అపరిచిత వ్యక్తికి తన ఘోషనంతా వెళ్లబోసుకుందెందుకని? తనని చేరదీస్తాడనా? లేక నటీమణిని చేసి ఉద్ధరిస్తాడనా? లక్షలాది జనం వినోదించే సినీ-

## మాయా లోకం

ఎటువంటి విచిత్ర సీమ? ఆ వ్యామోహం ఎందరెందర్ని ఎలా బలిగొంది? మరెందర్ని అందల మెక్కించింది? వెండితెర మనుషుల మానసిక వేదనను సరికొత్త పంథాలో మలచిన—

## మోహన్

నవల 'మాయాలోకం' ఈ నెల 'చతుర' సమగ్ర నవల. సినీ మాయామేయ జగత్తును మరొక కోణం నుండి దర్శించిన తాజా నవల.

ముఖచిత్రం : సమీర్
రెండవ కవరు : అంబర్ ప్యాలెస్
మూడవ కవరు : సికింద్రా - ఆగ్రా
ఫొటోలు : సూరజ్ యస్. శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.


చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# విశ్వాసం

విశ్వాసంలో గుర్రాలు శునకాల్ని మించిపోయిన సంఘటన ఒకటి ఆమధ్య రష్యాలో జరిగింది. ఓఖద్ అబ్మ్రోదోవ్ అనే అతను కలప అడవుల్లోంచి గుర్రం మీద వెళ్తుంటే ఓ ఎలుగుబంటి కొండ రాయి వెనకనుంచి అతని మీదకి దూకబోయింది. హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనతో అతని గుర్రం ఉలిక్కిపడి వెనక కాళ్ళమీద లేచి నిలబడింది. ఎలుగుబంటి మీదకి దూకడంతో జడుసుకున్న పెద్ద మనిషి జారి కింద పడ్డాడు. ఎలుగుబంటి దొరికిన అవకాశం వదులుకోకుండా అతన్ని నొక్కిపట్టివుంచి చంపడానికి ప్రయత్నించడం చూసిన గుర్రం క్షణం ఆలస్యం చేయకుండా ఒక అడుగు వెనక్కి వెళ్లి ఒక్క దూకులో ముందుకు వచ్చి ముందు కాళ్ళ గిట్టలతో ఎలుగుబంటి మొహంమీద ఈడ్చి ఓ తాపు తన్నింది. దెబ్బకి తారెత్తిన ఆ భల్లూకం వెనక్కి తిరిగి చూడకుండా కాళ్ళకి బుద్ధిచెప్పింది. తనని ప్రాణాపాయం నుండి తప్పించిన గుర్రానికి థాంక్స్ చెప్ప దానికి అశ్వభాష రానందుకు తెగ బాధ పడిపోతూ మెచ్చుకోలుగా దానివీపు తట్టి ఎక్కి మెల్లిగా ఇంటి దోవ పట్టాడు ఆ మానవుడు.

# మూడో ముద్రణ

వరద బాధితుల సహాయార్థం నుంచి దానికీ దీనికీ సవాలక్ష కారణాలు చూపి చందాలు వసూలుచేసి వాటిని గుట





# ప్రపంచం

కాయ స్వాహా చేసే పెద్ద మనుషులు కోకొల్లలు. చందాలు వసూలు చేసే వారిలో అందరూ ఇలాంటివారే వుంటారని కాదు. కొందరు మహానుభావులు కూడా వుంటారు. అలాంటివారిలో జపాన్ బౌద్ధ సన్యాసి తెత్స్యోజెన్ కూడా ఒకడు. ఇదివరలో బౌద్ధ సూత్ర గ్రంథాలన్నీ చైనా భాషలోనే ప్రచురించబడుతుండేవి. అందుకని తెత్స్యోజెన్ ఈ సూత్ర గ్రంథాలను జపాన్ భాషలోకి అనువదించి అచ్చు వేయించాలని నిర్ణయించుకున్నాడు. దీనికి పెద్దమొత్తంలో డబ్బు అవసరం గనక ప్రజల దగ్గర చందాలు వసూలుచేసి పని పూర్తి చేయాలనుకున్నాడు. అనుకున్న ప్రకారం కావలసినంత డబ్బు వసూలయింది. కాని ఇంతలో యూజి నదికి వరదలొచ్చి చుట్టుపక్కల గ్రామాలెన్నో నాశనమయ్యాయి. బౌద్ధ సూత్రగ్రంథాల ప్రచురణకన్నా దెబ్బతిన్న ప్రజలకి చేయూతనివ్వడం అత్యవసర ధర్మంగా భావించిన తెత్స్యోజెన్ తాను పోగుచేసిన డబ్బునంతా వరద బాధితుల పునరావాసానికి ఖర్చు చేశాడు. తర్వాత మళ్ళీ కొన్నాళ్ళకి సూత్ర గ్రంథాల ప్రచురణార్థం చందాలు వసూలు చేయడం ప్రారంభించాడు. అది పూర్తయ్యేసరికి దేశంలో మశూచి వ్యాపించింది. అతను మళ్ళీ ఆ సొమ్మును ప్రజోపయోగానికి ఖర్చు పెట్టేశాడు. తర్వాత పట్టువదలని విక్రమార్కుడిలా తిరిగి ఇరవై సంవత్సరాలు కష్టపడి చందాలు వసూలుచేసి చిట్టచివరికి ఎలాగైతేనేం జపాన్ భాషలో బౌద్ధ సూత్ర గ్రంథాలను ప్రచురించాడు. ముచ్చటగా మూడోసారి అతని చిరకాల కోరిక నెరవేరింది. ఇప్పుడు జపాన్ దేశీయులు ఈ గ్రంథాల్ని 'మూడవ ముద్రణ' అనే అంటారు. మొదటి రెండు ముద్రణలు అదృశ్యంగాను, సుందరంగానూ వుంటాయని వారు వారి పిల్లలకు చెబుతుంటారు.



# కుదిరిన రోగం

'ఆవతల కొంపలంటుకుపోతున్నాయి మహాప్రభో' అన్నాగాని 'ముందు ఫైళ్ళు చూడండి, తర్వాత నిదానంగా కొంపల సంగతి చూసుకోవచ్చు. అయినా కొంపలార్పడానికి ఫైర్ సర్వీసు వాళ్ళుండగా మీకెందుకా శ్రమ' అనే ఆఫీసర్లు, యాజమాన్యం వారే ఎక్కువ మనదేశంలో.

కానీ ఇంగ్లండులోని ఓ వాణిజ్య సంస్థ ఇందుకు పూర్తిగా విరుద్ధం. ఈ సంస్థలో మొత్తం 2లక్షల 40 వేల మంది పనిచేస్తున్నారు. వీరంతా ఎంతో సమర్థవంతులైన పనివారేగాక సంస్థకు ఎన్నో సార్లు ఎన్నో లాభాలు గడించి పెట్టారు కూడా. కాకపోతే శ్రమశక్తి తక్కువయ్యో, బద్ధకం ఎక్కువయ్యో లేక నిజంగానే ఆరోగ్యం బాగులేకోగాని జలుబు, ఫ్లూజ్వరం అంటూ తరచూ రోజుల తరబడి శలవులు పెట్టే వారి సంఖ్య ఎక్కువైపోయింది. ఫ్యాక్టరీ యాజమాన్యంవారు అర్ధరాత్రి ఓ అత్యవసర సమావేశాన్ని ఏర్పాటు చేసుకుని అప్పటికప్పుడే ఓ నిర్ణయానికి వచ్చేశారు.

ఆ మర్నాటినుంచీ ప్రతి ఉద్యోగి ఆరోగ్యాభివృద్ధికిగాను ఉచితంగా రెండు మాత్రలు ఇవ్వడం ప్రారంభించారు. ఇలాచేయడంవల్ల దాదాపు 11 కోట్లు మందులకే ఖర్చవుతోంది. కానీ జలుబూ, జ్వరమంటూ సిబ్బంది గైరుహాజరు వల్ల వచ్చే 45 కోట్ల రూపాయల నష్టంతో పోల్చి చూస్తే అదేమంత లెక్కలోకి రావంటున్నారు యాజమాన్యంవారు. 'ఇదెక్కడి గొడవండీ బాబూ! జలుబూ, జ్వరం మాటెలావున్నా ముందు రోజూ మాత్రలు మింగలేక ఛస్తున్నాం' అని వాపోతున్నారు సిబ్బంది.



# మారాం చేసేవారిని కూడా మైమరిపించే ప్రియ






'ప్రియ' ఆకర్షణలో పడనివారు లేరు. మూత తీసి తియ్యడంతోనే ఎన్నెన్నో రుచులూరిస్తుంది 'ప్రియ'. ఆకలి లేదని మారాం చేసే పిల్లలు కూడా 'ప్రియ' పచ్చళ్లు ఉంటే అపూర్వంగా తింటారు.

వెల్లుల్లి తోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

• మామిడికాయ • నిమ్మకాయ • టొమాటో • అల్లం • గోంగూర • ఉసిరికాయ • చింతకాయ • పండు మిరపకాయ • వంకాయ

తీపిరకాలు : • మామిడికాయ • అల్లం

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004.

# హైజాకింగ్

విమానాన్ని హైజాక్ చేసి ఎంటబ్బీ, ఉగాండాలో ఉంచినపుడు, ఇజ్రాలీ కమాండోలు మెరుపుదాడి చేసి బంధితులందరినీ విడుదలచేసి తీసుకుపోయారు క్షణాల మీద. ఆమధ్య విమానాల హైజాకింగ్ జరగని రోజంటూ లేకుండా పోయింది. అందుకని అన్ని దేశాలవారూ ఇప్పుడు చాలా జాగ్రత్తలు తీసుకొంటున్నారు విమానాశ్రయాల విషయంలో. పారిస్‌లోని ఇంటర్‌పోల్ ప్రధాన కార్యాలయానికి ప్రతిరోజు ఉదయం ఒక రహస్య సంకేత పదం అందుతుంది.



ఇది అరనిమిషంలో టెలిప్రింటర్ ద్వారా ఉన్నతాధికారులందరికీ అందిన వెంటనే నాశనం చేయబడుతుంది. అమెరికాలోని సెంట్రల్ ఇంటెలిజెన్స్ ఏజెన్సీ ప్రధాన కార్యాలయంలోని ఒక కంప్యూటర్‌చే ప్రతిరోజూ ఎంపిక చేయబడే ఈ రహస్య సంకేతపదం టెర్రరిస్టులు రూపొందించిన ప్రధాన దాడుల గురించి అనుమానం రాగానే ప్రమాద సూచన అందిస్తుంది. ప్రమాదసూచననిచ్చే సంకేత పదాన్ని ఒక ఎలక్ట్రిక్ పరికరం ఇతరులకు అర్థం కాని రీతిలో 30 దేశాలకు పైగా గూఢచారి విభాగం ప్రధానాధికారులకు అందిస్తుంది. ఈ పద్ధతి ఎంటబ్బీ, ఉగండా హైజాకింగ్ సంఘటనల అనంతరం అమల్లోకి వచ్చింది.

ఓసారి ఈజిప్ట్ ప్రెసిడెంట్ సాదత్ ఇజ్రాయిల్ దేశాన్ని సందర్శించి వచ్చాక టెర్రరిస్టులు ప్రతీకార చర్య తీసుకోనున్నారని భద్రతాసిబ్బందికి కబురందింది. వెంటనే రహస్య సంకేత పదంతో అన్ని దేశాలకూ హెచ్చరిక అందజేయబడింది. యూరప్ విమానాశ్రయాలలో భద్రతా ఏర్పాట్లు తీవ్రతరం చేశారు. అలాగే యూరప్ ఆఫ్రికా, మిడిలీస్ట్‌లోని ఇజ్రాయిల్, ఈజిప్ట్ రాయబార కార్యాలయాలను జాగ్రత్తగా కాపలాకాశారు. అప్పటికి ప్రమాదం తప్పిపోయింది.

ఇంకోసారి అరబ్ టెర్రరిస్ట్‌లు జోర్డాన్‌లో వున్న ఇజ్రాలీల ఆధ్వర్యంలోని ఒక బ్యాంకుపై బాంబులు విసరాలని పథకాలు వేశారన్న గాలివార్త ఇంటర్‌పోల్‌కి చేరింది. వెంటనే ప్రేలుడు పదార్థ నిపుణులు అక్కడికి చేరారు. రహస్య సంకేతపదం హెచ్చరికతో. ఎల్‌అల్ విమానంలోని ముగ్గురు వ్యక్తులను రోమ్‌లోని పోలీసులు ప్రశ్నించడానికి తీసికెళ్ళారు. దాంతో టెర్రరిస్టుల పథకం విఫలమయింది. ఇంటర్‌పోల్ అత్యంత జాగరూకతతో వ్యవహరించడాన ఈమధ్య టెర్రరిస్ట్‌ల పథకాలు చాలా విఫలమైనాయి. సంకేతపదం

# ఉష్ . . .రహస్యం చెప్తున్నాం . . .
# వినండి . . .



కొందరు స్త్రీలు పెరిగే ధరలకంటె ముందడుగు వేసి జీవితంలో చిన్న చిన్న సుఖాలను అనుభవిస్తున్నారంటే, మీకాశ్చర్యంగా లేదా? అది ఎలా సాధ్యమో **కెనరా బ్యాంకు** మీకు చెప్తుంది.

సద్దు లేకుండా, పొదుపు చేసి కొన్నాళ్ల తర్వాత ఆ డబ్బుతో మీ కుటుంబానికి ఆశ్చర్యానందాలు కలిగించాలని ఉబలాటపడే మీలాంటి గృహిణులకే మా **బాలక్షేమ డిపాజిట్** పథకాన్ని ఆరంభించాం. మీ నిత్యకృత్యాలలో ఎదురయ్యే కొన్ని ఆర్థిక ఇబ్బందులు మీరు దాచిన ఈ డబ్బుతో సమసి పోతా యి.

ఇప్పుడు మీరుకూడా ఆలాంటి "గృహిణిగా" మారాలి.

"చిల్లర డబ్బులు" అని ఉపేక్షచేయకండి. గప్‌చిప్‌గా ఆకర్షణీయమైన మా **బాలక్షేమ** టి. వి. డబ్బా లో ఆ చిల్లరను వెయ్యండి. ఈ రహస్యం మీకు తెలీకుండానే ఒక పెన్నిధిగా మీకు అందవిచ్చి ఆనందాని కల్గిస్తుంది. ఇప్పుడు చూస్కొండి . . . మీకొక అందమైన చీర — మీ అబ్బాయికి సైకిలు — లేదా మీ యింటికొక ప్రత్యేకతనిచ్చే వస్తువేదైనా కొనగలరు కదా!

మీ చిన్న రహస్యాన్ని పెద్ద పెన్నిధిగా మార్చండి.

**మా యితర పథకాలు**

**కామధేను**
**నిరంతర**
**విద్యానిధి**

**కెనరా బ్యాంక్**




(జాతీయ బ్యాంక్)
దేశము మొత్తమున 1,300 కు పైగా శాఖలు కలవు.

హెచ్చరిక పద్ధతి మూలాన. టెర్రరిస్టుల ఆటలుసాగక కమాండో తరహా పోరాటాన్నెదుర్కోవాల్సి వస్తోంది.

1969లో 84 హైజాకింగ్ టెర్రరిస్టుల దాడులు జరిగితే వీటిలో 13 విఫలమయ్యాయి. 1977లో 27 ప్రయత్నాలు జరిగితే 23 విఫలమైనాయి. అంతర్జాతీయ రహస్య సంకేత పదంతో హెచ్చరించే పద్ధతేగాక ఏ దేశానికాదేశం ప్రత్యేకంగా నిరంతరం మారే సంకేతపద విధానాన్ని అనుసరిస్తోంది.

సంకేత హెచ్చరిక పంపడానికి వీలుగా బ్రిటన్‌లో స్కాట్‌లాండ్‌యార్డ్ నుంచి లండన్ హీత్రో విమానాశ్రయం వరకూగల హాట్‌లైన్స్‌లో ఒకదాన్ని అందుబాటులో వుంచుతారు ఎల్లప్పుడూ.

ఏంటీ టెర్రరిస్ట్ స్క్వాడ్స్ వార్త అందిన కొద్ది నిమిషాల్లో అవసరమైన చోటకి చేరడానికి వీలుగా ప్రత్యేక ఏర్పాట్లున్నాయి. ఇప్పుడు హైజాకర్స్ నెదుర్కోడానికి సైన్యంలోనే ప్రత్యేక దళాలను ఏర్పాటుచేసి శిక్షణ నిస్తున్నారు

హెచ్చరిక వచ్చినప్పుడల్లా సాదా దుస్తుల్లో వున్న పోలీసువారు ప్రధాన విమానాశ్రయాలలో ప్రయాణికుల్లా సూట్‌కేస్‌తో తిరుగుతుంటారు తప్ప విమానం ఎక్కరు. వీరు కష్టమ్స్ పరిశీలన అయాక వచ్చే ప్రయాణికుల ముఖాలను జాగ్రత్తగా పరిశీలిస్తుంటారు. అయినా కొందరు టెర్రరిస్ట్‌లు తప్పించుకొంటూనే వుంటారు.

టెర్రరిస్ట్‌ల స్వర్గం అనతగిన దేశాలు కూడా లేకపోలేదు. వాటిలో గడాఫీ పాలిస్తున్న లిబియాది అగ్రస్థానం. కాలక్రమంలో టెర్రరిస్ట్‌లు దాక్కొనే స్థలాలు తగ్గిపోయి పట్టుబడక తప్పని పరిస్థితి రావచ్చు.

# స్పెషలిస్టు

అన్నిరంగాల్లోనూ స్పెషలిస్టులున్నట్టే అమెరికాలో యాక్సిడెంట్ల స్పెషలిస్టు ఒకాయన వున్నాడు. పేరు విని అపోహ పడకండి. యాక్సిడెంట్లు చేయించడం కాదు యాక్సిడెంట్లను నివారించడమే ఇతని పని.

స్కేటింగ్ చేసేటపుడు, మంచు దట్టంగా పేరుకుపోయిన రోడ్లమీద నడిచేటపుడు సహజంగా కాళ్ళకున్న బూట్లు జారి కిందపడ్డం జరుగుతుంది. అంతటితో ఆగకుండా ఏ కాలో, చెయ్యో విరగడం, ఆస్పత్రులచుట్టూ ప్రదక్షిణ, డాక్టర్లకు దక్షిణలు సరే సరి. వయసులో వున్నవారైతే ఫరవాలేదు కానీ వయసుముదిరిన వాళ్ళ ఎముకలు ఎంతసులభంగా విరుగుతాయో అతుక్కోవడం అంతకష్టం.

'ఈ గొడవంతా లేకుండా వూలు సాక్సులు వేసుకుంటే సరి' అంటున్నాడీ స్పెషలిస్టు. అసలు సాక్స్ వేసుకోకుండా బూట్లు ఎవరైనా వేసుకుంటారా అని అందరూ నవ్వేరు. స్పెషలిస్టు మాత్రం నవ్వేవాళ్ళందర్నీ నవ్వనిచ్చి 'ప్రమాదాలు జరగాలంటే అలా వేసుకోవాలి. జరక్కుండా వుండాలంటే బూట్లమీద సాక్సులు వేసుకోవాలి' అని వివరించాడు.

అందరూ 'ఔరా' అనుకుని దీన్ని వెంటనే అమల్లో పెట్టారు. స్పెషలిస్టు అంచనా తప్పలేదు. ప్రమాదాల సంఖ్య చెప్పుకోదగ్గట్టుగా తగ్గిపోయింది. ఎముకల నిపుణులు, శస్త్రచికిత్స వేత్తలు ప్రమాదాలకు గురైన రోగులు లేక ఈగల్ని, దోమల్ని తోలుకుంటున్నారు పాపం!

"రామారావు ఉన్నాడా బాబాయ్ ?" అన్నాడు కనకారావు వస్తూనే.

"రా! రా! వాడు అన్నం తింటున్నాడులే. మద్రాసు నుండి ఎప్పుడు వచ్చావు? విశేషాలేమిటి?" అన్నాడు గోవిందయ్య.

"మద్రాసు విశేషాలకు కొదవేమిటి బాబాయ్! కావలసినన్ని" అంటూ మంచం మీద కూర్చున్నాడు కనకారావు.

రామారావు ముఖం తుడుచుకుంటూ బయటకు వచ్చాడు. "ఏరా! ఎప్పుడు రావడం?" అన్నాడు పక్కనే కూర్చుంటూ.

"ఉదయం పది గంటలకే వచ్చినా నిన్ను కలిసే అవకాశం దొరకలేదు. డబ్బు! డబ్బు!! ఈ డబ్బు రాబట్టుకోడానికి మా నాన్న దగ్గర వంద వేషాలు వేయాల్సి వచ్చింది. ఈ పిసినారులు పేరుకు పెద్దేగానీ, ఆచరణలో కాదుగా? నాకు డబ్బు సరిగా అంది ఉంటే ఈ పాటికే సినిమా రంగంలో మన పేరు ప్రఖ్యాతులు బయటపడేవి. సరేగానీ నీ విషయం ఏమైంది?"

"ఒరేయ్ నీవు పేరు సంపాదించుకుంటావో లేదోగానీ, అందర్నీ చెడగొడుతున్నావ్‌రా! సినిమాల్లో పెట్టుబడి పెట్టి ఎవడైనా బాగుపడ్డాడంటే, వాడు పెద్ద వెధవఅయి ఉంటేనే బాగుపడి ఉంటాడు. మనలాంటి వాళ్ళం ఆ సినిమాలు తీయలేంరా!" అన్నాడు గోవిందయ్య.

"అదేంమాట బాబాయ్! చూడు, మరో మూడు నెలల్లో మన సినిమా తెలుగు దేశంలో దిగ్విజయంగా వంద రోజులు ఆడి తీరుతుంది." అన్నాడు కనకారావు.

"నీవు చెడేదికాక, వీడిని కూడా చెడగొడుతున్నావ్! ప్రస్తుతం యాభైవేలున్నాయి. తీసుకెళ్ళండి. తర్వాత కావాలంటే సర్దుతాను" అన్నాడు గోవిందయ్య.

"యాభైవేలా ? డైరెక్టరుకే చాలదు బాబాయ్ ! ముడి ఫిలిం ధర విపరీతంగా పెరిగింది. హీరో, హీరోయిన్ల రేట్లు సరేసరి. కలర్ ఫిల్మ్ ఐదు రీళ్ళు అయినా తీస్తేనేగానీ డిస్ట్రిబ్యూషన్ దొరకదు. ఐదు రీళ్ళు తీయాలంటే మినిమం ఐదు లక్షలయినా ఉండాలి."

"సరే! తర్వాత చూద్దాం! నీవు ఎంత తీసుకెళుతున్నావ్?"

"నేను లక్ష తీసుకెళుతున్నాను. శివరావు లక్ష తెస్తున్నాడు. రామారావు వాటా లక్ష మొత్తం మూడు లక్షలతో రంగంలో దిగితే, తర్వాత మళ్ళీ అవసరమైనప్పుడు రావచ్చు అనుకున్నాను. నీవేమో యాభై వేలు ఉన్నాయంటున్నావు?"

"ఉండడం కాదురా! ఇదీ అప్పు తెస్తున్నాను. ఊరంబడి పొలం అయిదెకరాలు అమ్మకానికి పెట్టి ఈ డబ్బు తెస్తున్నాను. వద్దురా అంటే వాడు వినడంలేదు. వాడి ఏడ్పు చూడలేక నేనూ ఇందులో తలదూర్చవలసి వస్తున్నది. తీసుకెళ్ళిన డబ్బు జాగ్రత్తగా వాడండి. ఊరికే ఖర్చు చేయకండి" అన్నాడు గోవిందయ్య.

"సరే! గుడ్డలూ, నీ ఇతర సామాన్లు సిద్ధంగా ఉంచుకోరా. రాత్రికి మెయిల్ ఎక్కామంటే ఉదయం మద్రాసులో దిగవచ్చు."

"వంట గిన్నెలేమైనా పంపించమంటావా?" అన్నాడు గోవిందయ్య,

కనకారావు చెయ్యి తలకేసి కొట్టుకున్నాడు. "పూరి కొంప అద్దెకు తీసుకుని, అందులో అల్యూమినియం గిన్నెల్లో వంట చేసుకుంటూ కూర్చుంటే,




మనల్ని నిర్మాతలుగా ఎవడూ గుర్తించడు. బాబాయ్! నిర్మాతల డిగ్నిటీ బ్రహ్మాండంగా ఉండాలి. వెయ్యి రూపాయల అద్దె ఇంట్లో, డన్‌లప్ పిల్లోల మీద కూర్చుంటే నే విలువ"

"అంతేలే ! 'పాచిపండ్లవాడు సంపాదిస్తే బంగారు పండ్లవాడు ఖర్చు పెట్టినట్లు' – తినీ, తినక ఈ పొలాలు మేము సంపాదిస్తే, మీరు ఇలా ఖర్చు పెట్టడం. వెధవలు" విసుక్కుంటూ లేచిపోయాడు గోవిందయ్య.

"వీళ్ళ మాటలకేంగానీ, సరే ప్రయాణమై వెళ్ళిపోదాం ! శివరావుని కూడా సిద్ధంగా ఉండమని చెప్పు" అంటూ వెళ్ళిపోయాడు కనకారావు.

కనకారావు ఫిల్మ్ ఇండస్ట్రీలో కొంత అనుభవం కలవాడు. విపరీతంగా డబ్బు తగలేసి, సినిమా రంగంలో కొంత అనుభవం సంపాదించి, రెండు చిత్రాల్లో పార్టనర్‌గా ఉండి, కొంతగాకున్నా అసలు సంపాదించుకున్నాడు. ఇతర పార్టనర్స్ దెబ్బ తీయడంతో, అసలు దక్కినా, రావలసిన ఆదాయం రాలేదు. ఇతరులతో కలిసి తీసేకంటే, తనకూ కొంత అనుభవం ఎలాగూ వచ్చింది గనుక భాగస్థుల్ని కలుపుకుని తానే తీయాలనుకున్నాడు. తన గ్రామానికి చెందిన చిన్ననాటి స్నేహితులు రామారావు, శివరావులను ఊదర కొట్టేశాడు. సినిమా రంగం మీద మోజూ, లక్షలు సంపాదించాలన్న ఆశా అందరికీ ఉన్నట్లే ఆ ఇద్దరికీ ఉంది. చివరకు ఇంట్లో వాళ్ళను ఏడ్పించి, బెదిరించి ఒప్పించుకున్నారు. ముగ్గురూ కలిసి మద్రాసు వెళ్ళి సినిమా ప్రయత్నాలు చేయాలనుకున్నారు. ఐదు లక్షలు చేతుల్లో పెట్టుకుని ప్రయత్నాలు చేద్దామంటే రెండున్నర లక్షలు మాత్రమే దొరికింది. సక్రమంగా తీస్తున్నట్లు తెలిస్తే మిగిలిన డబ్బు ఇస్తామన్నారు పెద్దలు. అందువల్ల వచ్చిన డబ్బుతోనే సంతృప్తిపడి మద్రాసు వెళ్ళడానికి సిద్ధపడ్డారు.

రాత్రి పది గంటలకు మద్రాసుకు వెళ్ళే బండిలో వెళ్ళడానికి ముగ్గురూ నిర్ణయించుకున్నారు. కావలసిన వస్తువులు సర్దుకున్నారు.

ప్లాట్ ఫారం మీద జనం కిట కిటలాడుతున్నారు. 'ఈ మందిలో తాము రైలెక్కగలమా?' అని ఆలోచిస్తున్నాడు రామారావు.

అతను అమాయకుడు కాకున్నా ఇటువంటి వ్యాపారాలలో అనుభవంలేదు. సినిమా అంటే ఉన్న మోజు వల్లా, తోటి స్నేహితుడూ, బంధువూ కనకారావు రెండు సంవత్సరాలుగా మద్రాసులో ఉంటూ, సినిమాలు తీస్తుండడం వల్లా అతని ద్వారా తామూ అనుభవం సంపాదించుకోవచ్చని ఆలోచించి రంగంలోనికి దిగాడు.

శివరావు పరిస్థితీ అంతే! గ్రామకరణం కొడుకు శివరావు. అందర్నీ ఎదిరించి కరణం సంపాదించి మూటగట్టిన డబ్బు బయటకు లాగి, కనకారావుతో భాగస్తుడుగా చేరి సినిమా తీయడానికి వెళ్తున్నాడు.

• • •

మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో సరిగా ఐదు గంటలా, పది నిముషాలకు ఆగింది బండి. జనం దిగుతున్నారు. మహాప్రవాహంలా ఉంది సెంట్రల్ స్టేషన్. వేలాది జనం కిటకిటమంటున్నారు. కొందరు



# స్పెషల్ క్లాస్

రాత్రి పన్నెండు గంటలవేళ
క్లబ్బు వదలి ఇంటికి దారి
పట్టాడా పెద్దమనిషి. డోసు ఎక్కువై
బుద్ధి పాదరసం లా పరుగెడుతోంది
ఇంటికి చేరే సరికి తెరచి ఉన్న తలుపులే
స్వాగతం పలికాయి..... హఠాత్తుగా
"స్పెషల్ క్లాసుకి వెళ్లావా నాన్నా?"
అనే పరామర్శ ఎదురొచ్చింది అతన్ని...
ఏమిటా "స్పెషల్ క్లాస్"? ఎవరా అడిగిన మనిషి?
ఏమిటి దాని అర్థం?



"విపుల" డిసెంబరు సంచికలో ప్రముఖ కన్నడ రచయిత "బీచి" కరుణామయ కల్పన "స్పెషల్ క్లాస్" మీ హృదయాన్ని కరిగిస్తుంది.

ఈ కథతో పాటు మరెన్నో భాషల విశిష్ట కథలకు వేదిక "విపుల". కథలు గాక అదనంగా నవ్వించి, కవ్వించే కార్టూన్లు, జోకులు, విజ్ఞాన విహారం చేయించే విచిత్ర విశేషాలు కూడా అందజేస్తోంది

# విపుల

రంగుల ఆఫ్‌సెట్ ముద్రణతో.

132 పేజీలు. రెండు రూపాయలే!

ప్లాట్‌ఫాం మీద సామాన్లు పట్టుకుని వెళ్ళిపోవలసిన రైలు కొరకు ఎదురు చూస్తున్నారు. ట్యూబ్‌లైట్లు ప్రకాశ వంతంగా వెలుగుతున్నాయి.

మూడు సూట్‌కేసులు ముగ్గురు తీసుకున్నారు. కాష్‌బాగ్ చంకలో అదిమి పెట్టుకున్నాడు కనకారావు. ముగ్గురూ బయటకు వచ్చారు.

వరుసగా నిలబడి ఉన్నాయి టాక్సీలూ, ఆటోలు. బీడీ దమ్ము లాగుతూ—పోలీసు తలవంచుకుని కూర్చున్నాడు, ఇది తన డ్యూటీ అన్నట్లు. వేయింగ్ మిషన్‌లలో ఎర్రలైట్లు వెలుగుతూ ఆరిపోతున్నాయి. శివరావు, రామారావు అటూ ఇటూ చూస్తున్నారు. వాళ్ళు గతంలో ఒకసారి మద్రాసు వచ్చినా పెద్దగా పట్టించుకోలేదు. ఇప్పుడు మద్రాసులో నివాసం ఉండడానికే రావడం వల్ల జాగ్రత్తగా చూడాలనుకున్నారు. టాక్సీలు ఎక్కి జనం వెళ్తున్నారు. కొందరు సామాన్లు తామే మోసుకుంటూ వెళ్తున్నారు.

"మనం ఎక్కడికి వెళ్ళాలి?" అన్నాడు శివరావు కనకారావును చూస్తూ.

"నీ పాత స్నేహితులు ఉంటారు కదా" అన్నాడు రామారావు కనకారావుతో

"ఒరే నాయనా! మనం సినిమా తీయడానికి వచ్చాం గానీ, మద్రాసు చూడ్డానికి కాదు! మనం నిర్మాత డిగ్నిటీని మెయింటెన్ చేయాలి. లేకపోతే రేపు మనల్ని వెర్రి కుక్కల్లా చూస్తారు వీళ్ళు. పద. గుప్తాస్ లాడ్జికి వెళ్దాం" అంటూ టాక్సీని కేకేశాడు కనకారావు.

టాక్సీ వచ్చి నిలబడుతూనే సూట్‌కేసులు అందులో పడేశారు. కనకారావు ముందు సీటులో కూర్చున్నాడు. వెనుక ఇద్దరూ కూర్చున్నారు.

"ఎందాం పక్కా—సార్?" అన్నాడ డ్రైవర్ రోడ్డుమీదకు వచ్చి.

"రాయపేట హైరోడ్; గుప్తాస్‌లాడ్జి"

"ఒరేయ్! మా ప్రాణం తీయకుండా ముందు కాఫీ నీళ్లు తాపరా! ఇంటిదగ్గర ఉంటే ఈపాటికే తాగేవాళ్లం" అన్నాడు శివరావు.

"అన్నీ తాగుదాంలేరా! ఈ మహా నగరంలో అన్నీ దొరుకుతాయి" అన్నాడు నవ్వుతూ కనకారావు. డ్రైవర్ కనకారావు వైపు ఓసారి చూశాడు.

"ఏ వూరు సార్ మనది?" అన్నాడు తెలుగులోనే!

"నీకూ తెలుగు వస్తుందా?' అన్నట్లు చూశాడు కనకారావు.

"మాది చీరాల ప్రాంతం!" అన్నాడు శివరావు వెనుకనుండి,

"నాదీ ఆ జిల్లానే సార్! ఒంగోలు దగ్గరుంది మా స్వంత ఊరు" అన్నాడు డ్రైవర్.

"ఎన్ని సంవత్సరాలనుండి ఇక్కడ ఉంటున్నావు?"

"పది సంవత్సరాల్నించీ టాక్సీ అద్దెకు నడుపుకుంటున్నాను."

"ఆదాయం బాగానే ఉంటుందా?"

"ఏం ఆదాయం సార్ ! తినడానికి కూడా సరిపోదు. పెళ్ళాం, ఒక చిన్న పాప ఉన్నారు. పూరి కొంపకు ఏభై రూపాయల అద్దె. మన బియ్యం కొనాలంటే విపరీతమైన రేటు. అన్నీ ఇబ్బందులే! ఏం చేస్తాం. ఏటో కాలం గడుపక తప్పడం లేదు. ఏం పనిమీద వచ్చార్ సార్! బిజినెస్సా?"

"సినిమా తీస్తున్నాం. ఇంతకు ముందు కూడా తీశాంలే!" కొత్తగా

వచ్చిన పిట్టగా భావిస్తాడేమోనని అన్నాడు కనకారావు.

"నాకేదయినా చిన్న వేషం ఇప్పించండి సార్!"

'నీ మొహానికి అదొక్కటే తక్కువ' అనుకున్నాడు మనసులో. పైకి మాత్రం "ఆలోచిద్దాం" అన్నాడు.

"నేను హైదరాలీ వీధిలో ఉంటున్నాను సార్!" అన్నాడు డ్రైవర్.

కనకారావు మాట్లాడలేదు. గుప్తాస్ లాడ్జీ ఆవరణలోనికి వచ్చింది టాక్సీ.

ముగ్గురూ దిగారు. బోయ్ వచ్చాడు టాక్సీ వద్దకు. డ్రైవర్ సూట్ కేసులు అందించాడు.

పది రూపాయలు తీసి డ్రైవరుకు ఇచ్చాడు కనకారావు. "సాయంత్రం కలువు" అన్నాడు హుందాగా ముందుకు నడుస్తూ. బోయ్ సూట్ కేసులు కౌంటర్ వద్దకు తెచ్చి స్టూల్‌మీద ఉంచాడు.

కౌంటర్ వెనుకనున్న అమ్మాయి కనకారావును చూసి చిరునవ్వు నవ్వింది "ఇప్పుడే వస్తున్నారా సార్" అంటూ.

చిరునవ్వుతోనే జవాబిచ్చాడు కనకారావు.

లెడ్జర్‌లో పేరు రాసి, తాళంచెవి అతని చేతిలో పెట్టింది. రెండు వంద రూపాయల కాగితాలు ఆమె చేతిలో పెట్టి పైకి నడిచాడు.

"ఈ అమ్మాయి తెలుసా?" అన్నాడు శివరావు అనుమానంగా.

"నేను ఎప్పుడు దిగినా ఈ లాడ్జీలోనే. అందువల్ల పరిచయం! అయినా ఇటువంటివి ఇక్కడ సహజంరా! ఆశ్చర్యపడకూడదు. ఇక్కడ మన డిగ్నిటీ ఎప్పుడూ మెయింటెన్ చేయాలి. లేదా కుక్కల్లా చూస్తారు".

"ఈ మాట చెప్పడం పదోసారి నాయనా! మాకు జ్ఞాపకం ఉందిలే" అన్నాడు రామారావు.

"మేం మద్రాసులో కాపురం చేయకపోవచ్చు గానీ ఆ మాత్రం తెలివితేటలు మాకూ ఉన్నాయిలే" అన్నాడు మళ్ళీ.

రూం బాయ్ వచ్చి, తాళం తీసి అందులో సామాన్లు పెట్టి, రూం శుభ్రం చేశాడు.

స్నానాలు చేశారు ఒక్కొక్కరే! టిఫిన్ తెప్పించుకుని రూంలోనే ఫలహారం చేశారు.

"ఈరోజు రెస్టు తీసుకుందాం! విపరీతంగా నిద్ర వస్తున్నది. రేపటినుండి కార్యక్రమాలు ప్రారంభించవచ్చు" అన్నాడు కనకారావు.

ఆ మాట పూర్తి కాకుండానే శివరావు మంచంమీద పడ్డాడు. మరో మంచంమీద రామారావు బోర్లా పడుకున్నాడు నిద్ర కుపక్రమిస్తూ. తనకంటే ముందే మంచాలు ఆక్రమించడంలో తెలివి చూపిన ఇద్దర్నీ తిట్టుకుంటూ దుప్పటి కింద పరచుకుని నిద్ర కుపక్రమించాడు కనకారావు.

• • •

ఉదయం ఏడు గంటలకే స్నానాదులు ముగించుకున్నారు ముగ్గురూ. ఫోన్ దగ్గరకు వెళ్ళి తెలిసిన డైరెక్టరుకు ఫోన్ చేశాడు కనకారావు. ఆయనగారు ఇంకా నిద్ర లేవలేదని చెప్పారు అక్కడివాళ్ళు.

"ఎవ్వరా ?" అన్నాడు శివరావు కాఫీ తాగుతూ.

"సినిమా తీయడానికి ఇంతకు ముందే ఒక డైరక్టర్‌తో మాట్లాడి ఉన్నాన్లే. ఇంకా నిద్ర లేవలేదట. సరేగానీ రామారావ్! ఈ సినిమాకు నీ నవల 'కులం'




తీసుకుంటే బాగుంటుందిరా ! ఆ పని చేద్దామా?" అన్నాడు కనకారావు.

రామారావు ముఖం చిట్లించి, నోరు మూసుకుని కూర్చున్నాడు.

"ఒరేయ్ ! మనం కొత్తగా ఈ రంగంలో కాలు పెడుతున్నాం. కొత్త నవల్లు ఎందుకు కాని, మంచి రచయిత కథ చూడరా!" అన్నాడు శివరావు.

కనకారావు మాట్లాడలేదు. సిగరెట్ పీలుస్తూ, రూంలో పచార్లు చేస్తున్నాడు. ఆలోచిస్తూ తల అటు ఇటు ఊపుతున్నాడు.

ఫోన్ మోగింది. కనకారావు అందుకుని మాట్లాడాడు.

"వెళ్దాం పదండి. దర్శకుడు రమ్మంటున్నాడు. అతడితో మాట్లాడి, కథ విషయం ఆలోచిద్దాం" అంటూ రూం బయటకు వచ్చాడు. ఇద్దరూ బయటకు రాగానే తాళంవేసి కీ జేబులో వేసుకున్నాడు కనకారావు.

సి. ఐ. టి. నగరులోని డైరక్టర్ మణ్యాం ఇంటి వద్ద టాక్సీ దిగారు. విశాలమైన డాబా ! గేటు దాటి లోనికి అడుగు పెట్టేటప్పటికి కుక్క భయంకరంగా అరుస్తూ, గొలుసు తెంపుకోవడానికి ప్రయత్నం చేస్తున్నది. శివరావు కాళ్లు చల్లబడ్డాయి. ఇంటిలో నౌకరు వచ్చి కుక్కను అదిలించాడు. వసారాలో ఉన్న మెట్ల వెంట పైకి వెళ్ళి ముందు హాలులో కూర్చున్న డైరక్టర్ మణ్యానికి విష్ చేశాడు కనకారావు చిరునవ్వుతో. మణ్యాం నవ్వుతూ ప్రతి నమస్కారం చేశాడు. మిగిలిన ఇద్దర్నీ తన పార్టనర్స్‌గా పరిచయం చేశాడు.

"సినిమా తీయడం ఖాయమేనన్నమాట" అన్నాడు తల పైకెత్తి కప్పుకేసి చూస్తూ మణ్యాం. భారీ విగ్రహం. బొజ్జ ముందుకువచ్చింది. లుంగీ చుట్టుకున్నాడు. శరీరంమీదున్న బనియన్ తెగిపోతుందేమో నన్నట్లు బిగువుగా వుంది.

"ముందు కథ నిర్ణయమైతే తర్వాత ఏక్టర్ల గురించి ఆలోచించవచ్చు. అన్నింటికీ ముందు కథ ప్రధానం" అన్నాడు మణ్యాం.

కనకారావు తలూపి "వీడు మా బ్రదర్ ! చాలా నవలలు రాశాడు. అందులో ఒకటి ఎన్నుకుంటే మంచి దనుకుంటున్నాను. చెయ్యి తిరిగిన రచయితను పట్టి మాటలు-పాటలు రాయించుకుంటే సరిపోతుంది" అన్నాడు.

"నవలలు లేకున్నా రచయితను వెంటబెట్టుకుని నాలుగు ఫారిన్ చిత్రాలు గానీ, ఇంగ్లీషు పిక్చర్లు గానీ చూస్తే అతడే అన్నీ సమకూర్చుకుంటాడు. ఆంధ్రదేశంలో మగవారి నవలలు ఇప్పుడు ఎవరూ చదవడంలేదు. సినిమాలూ చూడడంలేదు. ఆడవారి నవలలకే విలువ. ఒకవేళ నవలనే తీసుకోదలిస్తే చెయ్యి తిరిగిన రచయిత్రి ఉంది; పరిచయం చేస్తాను. ఆమెవే తీసుకోండి" అన్నాడు మణ్యాం. తిరిగి రామారావును చల్లబరచడానికి "మీ బ్రదర్ నవల వద్దని నా ఉద్దేశం కాదు. అయితే ముందు మంచికథ తీసుకుంటే తర్వాత సినిమాలకు మీవే మొత్తం తీసుకున్నా సినిమా విజయవంతమవుతుంది" అన్నాడు.

"ఆ బాధ్యత ఒక రచయితకే అప్పగిద్దాం. ఎలాగూ రంగన్న మాటలు — పాటలు అద్భుతంగా రాస్తాడుకదా! అతన్ని పిలిపించండి. అతనితో మాట్లాడి తర్వాత నిర్ణయించుకుందాం" అన్నాడు కనకారావు.

రంగన్నకు ఫోన్ చేశాడు మణ్యం. మరో అర్ధ గంటలో రంగన్న పైకివచ్చి అందరికీ వినయంగా నమస్కారం చేశాడు.

"బాగున్నారా రంగన్నగారూ!" అన్నాడు కనకారావు పలుకరింపుగా.

"మీ దయ సార్! మీలాంటివారి చల్లని చూపులుంటే మాలాంటివారిమి బాగానే ఉంటాము" అన్నాడు రంగన్న నవ్వుతూ.

"సరే! సినిమా తీయడానికి సిద్ధంగా వచ్చారు వీరు. మరి కథ మంచిది కావాలి" అన్నాడు మణ్యం.

"కథదేముంది సార్! నాలుగు సినిమాలు చూసి అందులో ఒక బిట్టు, అందులో ఒక బిట్టు కొట్టేస్తే సరిపోతుంది. మళ్ళీ ఒకరిని బతిమాలాడడం ఎందుకు? ఆ భారం నా మీద వేయండి" అన్నాడు రంగన్న అభయహస్తమిస్తూ.

కాఫీలు వచ్చాయి. మణ్యం కూతురు కనకారావు వైపు ఓరగా చూస్తూ కాఫీ అందించింది. కనకారావు ఆమెవైపు చూసి నవ్వాడు. మణ్యం చూసినా పట్టించుకోనట్లు కాఫీ తాగడంలో మునిగి ఉన్నాడు. కాఫీ తాగిన తర్వాత లేచి లోనికి వెళ్ళి పాంటు, షర్టు వేసుకుని వచ్చాడు.

"వెళ్దాం పదండి" అన్నాడు [illegible] దిగుతూ.

మిగిలినవారు అనుసరించారు.

మణ్యం కూతురు నాగిని కనకారావు వైపు చూసి సంజ్ఞచేసింది. దిగుతున్న కనకారావు పైమెట్టుమీదే నిలబడ్డాడు.

"సాయంత్రం సినిమాకు వెళ్దామా?" అంది అతని దగ్గరగా వస్తూ.

"ఈ రోజు తీరిక ఉండదులే! చాలా పనులున్నాయి. ఎలాగూ మరో ఆరు నెలలు ఇక్కడే ఉండాలి కదా; ఎన్నో సినిమాలు చూద్దాం" అన్నాడు నాగిని బుగ్గమీద చిటిక వేస్తూ. నాగిని సిగ్గుతో మెలికలు తిరిగింది. కిందికి వచ్చేసరికి టాక్సీ సిద్ధంగా ఉంది. ముందు సీట్లో ఇద్దరు, వెనుక సీట్లో ముగ్గురు కూర్చున్నారు.

"ప్లాజాకు పోనియ్!" అన్నాడు మణ్యం. టాక్సీ ప్లాజాముందు ఆగింది. శివరావు సినిమా హాలువైపు తలెత్తి ఆశ్చర్యంగా చూశాడు.

మణ్యం ఎదురుగానున్న తాజ్ రెస్టారెంటులోకి దారి తీశాడు.

ఐదుగురూ రౌండు టేబుల్ చుట్టూ కూర్చున్నారు. వెయిటర్ వస్తూనే "ఐదు చికెన్ బిరియానీ!" అన్నాడు కనకారావు. వెనక్కి తిరిగి చూసి తిరిగి వెయిటర్‌ను పిలిచి "నాలుగు బిరియానీ, ఒక ప్లేటు స్వీట్ కేక్స్" అన్నాడు నవ్వుకుంటూ. శివరావు ఇంద్రభవనం లాగున్న రెస్టారెంటును కలయచూస్తున్నాడు.

కాసేపట్లో వెయిటర్ పదార్థాలు తెచ్చి వారి ముందు పెట్టాడు. బిస్కట్ల ప్లేటు శివరావు ముందుకు తోశాడు కనకారావు.

"అదేమిటి?" అన్నాడు మణ్యం.

"ఆ అబ్బాయి బాపనోళ్ల పిల్లగాడు" అన్నాడు హాస్యంగా కనకారావు.

"ఇక్కడ అవన్నీ ఉండకూడదు. అన్నీ అలవాటు పడితేనే నిలబడగలడు" అన్నాడు ప్లేటు మీదకు చెయ్యి పోనిస్తూ రంగన్న.

ఐదు టీలు తెచ్చి బిల్లు ప్లేటులో పెట్టాడు వెయిటర్! బిల్లు ముఖం చూడకుండానే యాభై రూపాయల కాగితం తీసి అందులో వేశాడు కనకారావు. వెయిటర్ సలాంకొట్టి అది తీసుకొని వెళ్లాడు.

ప్లాజా పదిగంటలషో 'స్పార్టకస్' ఆడుతున్నది. హాలులోనికి జొరబడ్డారు. ఇంటర్వెల్ మధ్యలో కూల్‌డ్రింక్స్ తెప్పించుకున్నారు. పన్నెండు గంటలా పదిహేను నిమిషాలకు బయటకు వచ్చారు.

"నాకు భోజనం అవసరంలేదు; లైట్‌గా టిఫిన్ చేస్తాను. మీరు తినదలచుకుంటే తినండి" అన్నాడు మణ్యం.

"నేను భోజనం చేయాలి సార్!" అన్నాడు రంగన్న. ఖర్చవుతున్న డబ్బును చూస్తూ మిగిలిన ఇద్దరు గుండెలు పిసుక్కుంటున్నారు. కనకారావు టాక్సీని పిలిచి హోటల్ 'శాంతి'కి బయలుదేరారు. అక్కడ తినే కార్యక్రమం పూర్తి చేసుకుని సరిగ్గా ఒంటిగంటకు 'శాంతి' థియేటర్ ప్రాంగణంలో అడుగు పెట్టారు. ఒంటిగంట షో 'ఎలిఫెంటాస్ ఆఫ్ ఫ్రాన్స్' ఉంది.

పైకి ఎక్కి బాక్స్‌లో కూర్చున్నారు. ఎయిర్‌కండిషన్డ్ బాక్సులు చల్లగా ఉన్నాయి. సినిమా ప్రారంభానికి ముందు రంగన్న బయటకు వెళ్ళి ఐదు కిళ్ళీలు పట్టుకవచ్చాడు. ఇద్దరూ అవసరం లేదన్నారు మణ్యం రెండు, రంగన్న రెండు, కనకారావు ఒకటి నమలడానికి ఉపక్రమించారు. ముగ్గుర్ని చూస్తూ కూర్చున్నారు మిగిలిన ఇద్దరూ.





సినిమా ప్రారంభమయింది. ఏనుగులు ఏ విధంగా జీవిస్తున్నాయనేది ఇతివృత్తం. అందులో తెలుగు సినిమాకు పనికివచ్చే కథ ఏముందో శివరావుకుగానీ, రామారావుకిగానీ అర్థం కాలేదు. మిగిలిన ముగ్గురూ ఇంటర్వెల్‌లో ఆ సినిమా గురించి చర్చించుకుంటున్నారు.

మూడు గంటలకు షో అయింది. బయటకు వచ్చి టాక్సీ ఎక్కారు. హోటల్ గీతాస్ ముందు ఆపించాడు మణ్యం. ఐదుగురూ దిగి లోనికి వెళ్ళారు.

"ఏం తీసుకుంటారు?" అన్నాడు కనకారావు ఇద్దరివైపు చూస్తూ.

"నాకు ఏమీ వద్దు" అన్నాడు శివరావు. మర్యాద కొరకు కాఫీ చెప్ప మన్నాడు రామారావు.

రంగన్న సర్వర్‌ను పిలిచి "ఐదు రవ్వ" అన్నాడు. "ఇక్కడ అద్భుత మైన రుచిగా ఉంటుంది. బ్రాహ్మిణ్స్ హోటల్! మద్రాసు కంతటికీ గొప్ప హోటల్" అన్నాడు వాళ్ళను చూసి.

శివరావు నోరెత్తలేదు. ఐదు రవ్వ దోసె లొచ్చాయి. శివరావు కొద్దిగా తిని విడిచిపెట్టాడు. రామారావు తన ప్లేటు కనకారావు వైపు తోశాడు. కనకారావు పూర్తిగా తినలేక సగం విడిచిపెట్టాడు. అవన్నీ రంగన్న, మణ్యం ఖాళీ చేసేశారు.

కాఫీ తాగి బయటకు వచ్చారు. రంగన్న కిళ్ళీ బడ్డీ వద్దకు వెళ్ళి సిగరెట్ పాకెట్, అగ్గిపెట్టె తీసుకుని మణ్యానికి అందించాడు. కనకారావు డబ్బు చెల్లించి టాక్సీని పిలిచాడు.

"టాక్సీ ఎందుకూ ? లిబర్టీ టాకీస్ దగ్గిరేకదా ! నడిచివెళ్దాం" అన్నాడు మణ్యం. ఐదుగురూ నడక సాగించారు. ఫర్లాంగు దూరంలోనున్న లిబర్టీ వద్దకు చేరారు.

అక్కడ 'మౌంట్స్ ఆఫ్ సెవెన్' ఆడుతున్నది. బాక్స్ టిక్కెట్లు తీసుకొని లోపలికి వెళ్ళేటప్పటికే ప్రారంభమవు తున్నది. న్యూస్‌రీల్ పూర్తయి, టైటిల్స్ వేస్తున్నారు.

ప్రారంభమయేసరికి హాలు పూర్తిగా నిండిపోయింది. బాక్స్‌లో ఉన్నవారికి కింద ఉన్నవారు కన్పిస్తారు; కానీ, కిందవాళ్ళకు బాక్స్ సీట్లు కన్పించవు.

ఏడు గంటలకు సినిమా అయి పోయింది. బయటకు వచ్చి టాక్సీ ఎక్కారు. దారిలో హోటల్ సరోవర్ ముందు టాక్సీ ఆపించి, టాక్సీలోకే కాఫీ తెప్పించారు. కాఫీ తాగి, కనకారావు పది రూపాయల కాగితం ఇచ్చాడు. బట్లర్ వెళ్ళిపోయాడు. టాక్సీ కదిలింది.

"కాఫీ రెండు రూపాయలా ?" అన్నాడు ఇక ఆగలేక శివరావు.

కనకారావు చిరునవ్వు నవ్వాడు. బయటకు ఈడ్చి తన్నుదామనిపించింది శివరావుకు. 'ఈ విధంగా పది రోజులు తిరిగితే సినిమా తీయడం తర్వాత సంగతి; ఇంటికి వెళ్ళడానికి ఛార్జీలకు కూడా మిగలవు' అనుకున్నాడు. కోపంగా తల పక్కకు తిప్పుకున్నాడు. వీధుల వెంట రంగు రంగులదీపాలనూ, దీపాల మధ్య వెలుగుతున్న అంగళ్ళనూ చూస్తూ ఉన్నాడు.

మణ్యం ఇంటివద్ద ఆయనను దింపారు. రంగన్న కూడా అక్కడే దిగాడు.

"రేపు ఉదయం కథ గురించి చర్చించుకుందాం!" అన్నాడు మణ్యం లోనికి వెళ్తూ.

టాక్సీ కదిలింది. గుప్తాస్ లాడ్జీ వద్ద



దిగి టాక్సీ బిల్లు చెల్లించి లోపలకు కది లాడు కనకారావు. ఇద్దరూ అతన్ని అనుసరించారు.

రూంలోనికి వస్తూనే కలబడినంత పని చేశాడు శివరావు. "ఒరేయ్ ! మంది సొమ్మును ఈ విధంగా ఖర్చు పెట్టడం మంచిది కాదురా!" అన్నాడు ఆవేశంగా.

"ఇది సినిమా ఫీల్డురా నాయనా ! ఇంటిపద్ద మజ్జిగనీళ్లు తాగి, అరుగు మీద కూర్చొని లెక్కలు రాసుకోవడం అనుకున్నావా ? ఖర్చు పెట్టాలి. ప్రతి ఫలం రాబట్టాలి" అన్నాడు కనకారావు అనునయంగా.

"ఈ రోజు మొత్తం ఖర్చు ఎంత ?" అన్నాడు రామారావు.

లెక్కలేసి మొత్తం నాలుగు వందలా యాభై ఏడు రూపాయలని తేల్చాడు కనకారావు.

"ఈ విధంగా ఖర్చు పెడితే ఎన్ని రోజులు నిలబడతాంరా?"

"ప్రతిరోజూ ఎందుకు ఖర్చవుతుంది? ప్రారంభంలో కొన్ని అనవసర ఖర్చులు తప్పవులే."

తాము ఇంద్రజాలంలో ఇరుక్కున్నా మని అనుకున్నాడు శివరావు. ఇంత వరకూ సినిమాల్లో ఉన్న ఉత్సాహం ఇప్పుడు క్రమక్రమంగా చచ్చిపోతున్నది. ఈ రోజు ఖర్చుపెట్టిన మొత్తం అయితే,

ఐదుగురుపగల కుటుంబం నెల రోజులు హాయిగా భోజనం చేసేవాళ్ళు. నిజంగానే తమని అమాయకులుగా చేసి ఈ సినిమా జనం దోచివేస్తారేమో ! పరిస్థితి చూస్తే అలాగే కన్పిస్తున్నది. పైగా కనకారావుకి వాళ్ళు విలువ ఇచ్చి మాట్లాడుతున్నారు. తమకు ఏ విలువా లేదు. డబ్బు మాత్రం అందరిదీ సమానం! ఇది మరీ బాధగా తోచింది. సినిమా ప్రొడ్యూసర్ అనే సరికి అందరూ నెత్తిన పెట్టుకొని పూజి స్తారని ఆశించాడు. కాని ఇక్కడ కాళ్ళ కిందవేసి తొక్కుతున్నట్లనిపించింది.

"అన్నం తెప్పించమంటారా ?" అన్నాడు కనకారావు బాత్ రూంలోకి వెళ్తూ. అవసరం లేదన్నారు. అనుభవం లేనివారు కావడం వల్ల బాధపడుతున్నా రనుకున్నాడు కనకారావు. డబ్బు లేనిది సినిమా రంగంలో ఎవడూ నిలువలేడు మరి.

స్నానంచేసి వచ్చాడు. "మీరు కూడా స్నానం చేయండి. డబ్బు ఖర్చవు తున్నదని కుళ్ళడమెందుకురా ! ఖర్చు చేయాలి. తర్వాత రాబట్టాలి" అన్నాడు. కిందికి ఫోన్ చేసి మూడు కాఫీ పంపించమన్నాడు.

ఇద్దరూ స్నానం చేసి కాఫీ తాగి అలసటతో మంచాల మీద పడ్డారు.

• • •

ఉదయం తొమ్మిది గంటలకు టాక్సీలో చేరారు మణ్యాం ఇంటికి. అపాటికే రంగన్న, మణ్యాం ఇద్దరూ జోక్స్ వేసు కుని నవ్వుకుంటున్నారు. వీరిని చూసి లేచి నమస్కారం చేసి, "రండి" అంటూ ఆహ్వానించాడు రంగన్న. ముగ్గురూ కూర్చున్నారు.

"కథకు ఉపక్రమిద్దామా?" అన్నాడు మణ్యాం.

"మా ఆలస్యం ఏమీలేదు. ఎంత తొందరగా అవుతే అంత మంచిదని మా ఉద్దేశం!" అన్నాడు కనకారావు.

ఐదుగురూ పక్కనున్న గదిలోనికి జొరబడ్డారు. పెద్ద టేబుల్. టేబుల్ చుట్టూ కుర్చీలున్నాయి ఆ గదిలో. చుట్టూ కూర్చున్నారు.

"కథ ఐడియా చెప్పవయ్యా !" అన్నాడు మణ్యాం. రంగన్న గొంతు సవరించుకున్నాడు. జేబులో నుండి కాగి తాలు బయటకు లాగి చదవసాగాడు.

"కాలేజీలో ఒక యువతీ, యువకుడూ ప్రేమించుకుంటారు. అడ్డువచ్చిన విలన్‌ను ఇద్దరూ కలిసి తన్నారు. ఆ తర్వాత రెండు డ్యూయెట్లు పాడుతారు. చివరకు తల్లిదండ్రులకు నచ్చక యువతి అతడిని పెళ్ళి చేసుకోలేకపోతుంది. వేరొకరితో పెళ్ళి జరుగుతుంది. కొన్నాళ్ళకు ఆ యువతి భర్త అకాలదుర్మరణం చెందు తాడు. అపాటికే ఆమెకు ఒక పిల్లవాడు. వాడితో ఒంటిగానే కాలక్షేపం చేస్తూ ఉంటుంది. ఈలోగా హీరో భార్యకు క్షయ రావడంతో మంగళగిరి హాస్పటల్‌కు తీసుకెళ్తారు. అక్కడ అతని భార్య కొద్ది రోజులలోనే మృతి చెందుతుంది. అపాటికే అతనికి ఒక కూతురు. ఈ పరిస్థితులలో హీరోయిన్ తల్లి హఠాత్తుగా రైలు స్టేషన్‌లో కలిసి, హీరో బాధలకు విచా రించి తన కూతురు బాధలు చెప్పుతుంది. అడ్రసు తీసుకుని హీరో వెళ్ళి, హీరో యిన్‌తో తనను తిరిగి పెళ్ళి చేసు కొమ్మంటాడు. హీరోయిన్ నిరాకరిస్తే భరించలేక విరహ గీతాలు, బాధా గీతాలు పాడుకుంటూ పిచ్చిగా తిరుగుతాడు.

 

ఆమె ఉద్యోగం చేస్తూన్న ఆఫీసుకు ఈలోగా పాత విలన్ ఆఫీసరుగా వస్తాడు. ఆమెను కైవసం చేసుకోవాలని ప్రయత్నించగా ఏడుస్తూ హీరోయిన్ వెళ్ళి హీరోతో మొరపెట్టుకుంటుంది. ఆగ్రహోదగ్రుడైన హీరో విలన్‌తో కుస్తీ పడతాడు. చివరకు విలన్ మరణం, హీరో జైలుకు, హీరో కూతురితో హీరోయిన్ ఇంటికి చేరడం జరుగుతుంది. జైలు శిక్ష పూర్తయి ఇంటికి వచ్చి ఇద్దరూ కలుసుకోవడంతో కథ సుఖాంతం అవుతుంది.

"ఈ విధంగా కథ సుఖాంతం అవుతుంది. ప్రతి సినిమా కూడా ఇప్పుడు సుఖాంతం చేస్తున్నారు. కాబట్టి ఆ విధంగానే రాశాను. కథ సుఖాంతాని కంటే దుఃఖాంతానికే బావుంటుందనుకుంటే హీరో జైలుకు వెళ్ళడంతో కథ ముగిస్తే విలన్ చావు, హీరో జీవితాంతం జైలుకు, హీరోయిన్ ఒంటిగా ఏడవడంతో సరిపోతుంది. ఆలోచించండి" అన్నాడు రంగన్న.

"ఇది సినిమా!? వాస్తవ జీవితంలో ఇలా జరగడం అసంభవం" అన్నాడు రామారావు.

"నీవు కథలు రాస్తున్నావు కాబట్టి సినిమాలో కూడా ఆ విధంగానే ఉండాలంటే అసాధ్యం. సినిమా అన్న తర్వాత రెండు ప్రేమ గీతాలు, ఓ విరహగీతం, ప్రేమించడం, విడిపోవడం, డాన్సులు అన్నీ ఉండాలి. అవి లేకుండా సినిమా తీస్తే ఎవడూ చూడడు. కాకపోతే ఇంకా కొంత కథ మారుద్దాం!" అన్నాడు మణ్యం.

"అసలు ఇది కథేనా అని? లక్షలు ఖర్చుపెడుతున్నది ఈ చెత్త కథలకు కాదు. కథ సరిగా లేందే సినిమా తీయడం మంచిదికాదు" అన్నాడు రామారావు. శివరావు కూడా బలపరచాడు. నవలా రచయితను వెంటబెట్టుకుని వచ్చి కథల విషయంలో తాను జోక్యం చేసుకోవడం మంచిది కాదనుకున్నాడు కనకారావు.

"మీ ఐడియా చెప్పండి" అన్నాడు రంగన్న గత్యంతరంలేక.

"ఐడియా ఎందుకు? నా నవలలు అచ్చువేసినవే పది ఉన్నాయి. వాటిలో ఏదో ఒకటి ఎన్నుకుంటే సరిపోతుంది. అవి వాస్తవ జీవితాలకు సంబంధించినవే" అన్నాడు రామారావు.

సినిమా కథలు ఊహాలలో అల్లడం తన పని. నిజజీవితాన్ని రంగరించి రాసేవాడితో తాను పోటీపడడం మంచిదికాదనుకున్నాడు రంగన్న.

"సరే! మీరే ఏదో సెలెక్ట్ చేయండి. దానికి స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు నేను రాసిస్తాను."

"మాటలు రాసివ్వండి చాలు; పాటలు మావాడు బ్రహ్మాండంగా రాసేస్తాడు. రోజుకు పది పాటలు ఇట్టే రాసి పారేస్తాడు" అన్నాడు కనకారావు.

"నేను ఆయనను చూస్తూనే అనుకున్నాను; పది నవలలు రాసిన వ్యక్తి ఆరు పాటలు ఈజీగా రాస్తాడు" అన్నాడు మణ్యం పొగుడుతూ. ముగ్గురిలో రామారావుకే ఆధిక్యత కనిపిస్తున్నది అతనికి! రేపు ఈ సినిమా పట్టు అతడే సంపాదించుకోవచ్చు. ముందు జాగ్రత్తగా ఊదరగొట్టేయడమే మంచిదనిపించింది. రంగన్న కూడా మణ్యం ఊహ అర్థం చేసుకున్నాడు.

"అదే మంచిది. తప్పకుండా అలాగే చేద్దాం. ఇంత గొప్ప వ్యక్తిని దగ్గర

పెట్టుకుని ఊహాలోకాల్లో బతికే మేము రాయడం ఏమిటి ? ఆయనచేతే పాటలు రాయించండి; మాటలు మాత్రం నేను రాస్తాను" అన్నాడు రంగన్న.

కనకారావు ఏమీ మాట్లాడలేదు. ప్రతి విషయంలోనూ తానే జోక్యంచేసుకుంటే, మిగిలిన ఇద్దరూ తమను అలక్ష్యం చేస్తున్నట్లు ఫీలవుతారు. అందువల్ల వారికీ అవకాశం ఉండాలి. పైగా రచయితను వెంటతెచ్చుకొని మరొకడితో కథరాయించు కోవడం రచయితకూ నామోషీగా ఉంటుంది. అందువల్ల అతడు కలుగచేసుకో లేదు.

"సరే! నటీనటుల ఎన్నిక జరగాలి. ఎవరిని తీసుకుందామనుకుంటున్నారు ? వారితో కలసి అడ్వాన్సులు ఇచ్చేస్తే స్క్రిప్ట్ ఒకవైపు జరుగుతూ ఉంటుంది. మరొకవైపు షూటింగ్ జరుగుతూ ఉంటుంది" అన్నాడు మణ్యం.

"పేపర్లో ప్రకటన ఇచ్చి, అందరినీ కొత్తవ్యక్తులను తీసుకోవాలనుకున్నాము" అన్నాడు రామారావు. కనకారావు తల ఊపాడు.

"అదేమిటండీ ? అందరూ కొత్తవార యితే పిక్చర్ అభాసుపాలవుతుంది. మొదటి పిక్చర్ తీస్తూ ఆవిధంగా చేసు కోవడం మంచిది కాదు. ఒకటి తీసిన తర్వాత, కొంత పాపులర్‌గా సంస్థ నిల



బడితే తర్వాత తీసుకోవచ్చు" అన్నాడు మణ్యం.

"లేదులెండి! హీరోయిన్‌ను కూడా బయటి నుండే తేవాలనుకుంటున్నాము" అన్నాడు కనకారావు.

మణ్యం ముఖం ముడుచుకున్నాడు. అయినా తన కూతురికి ఆ అవకాశం దొరికితే బాగుండునని అతడు ఆశిస్తున్నాడు.

"అందరూ కొత్తవారు కాకుండా, ముఖ్యమైన పాత్రలలో పాతవారినే వేసి, ఆ ముఖ్యమైన పాత్రలలో కొత్తవారిని ప్రవేశపెడితే బాగుంటుంది. వారికీ నేర్చుకోవడం తెలుస్తుంది. పిక్చర్‌దెబ్బతినదు" అన్నాడు రంగన్న రాజీ మార్గంగా.

"సరే! ఆలోచిద్దాంలెండి. ముందు స్క్రిప్టువర్క్ కావాలి: అది అయిన తరువాత మిగిలిన విషయాలు పెద్ద సమస్య కావు. ముందు మా వాడిని కూర్చోపెట్టుకుని నవల సెలెక్ట్ చేసుకుని దాని మాటలు తొందరగా తయారుచేయండి" అన్నాడు కనకారావు.

"సరే! కాంట్రాక్టు చెప్పండి" అన్నాడు మణ్యం.

"కాంట్రాక్టు తెలిసిందే కదా! ఐదు వేలకు తక్కువ లేకుండా ఇద్దాం" అన్నాడు కనకారావు.

"అదేంటయ్యా! ఐదువేలకు ఈ రోజు జూనియర్ ఆర్టిస్టు కూడా రాదు. మాటలే గనుక కనీసం పదివేలయినా ఉండాలి. సినీఫీల్డులో ఎవరినయినా కలిసి అడగండి; పాతికవేలకు తక్కువ ఎవడూ రాడు. మీరు స్నేహితులు, మీది తొలి సినిమా గనుక ఆ రేటు చెబుతున్నాను." అన్నాడు రంగన్న.

కనకారావు మణ్యంవైపు చూశాడు. మణ్యం తల ఎగురవేశాడు. ఐదు రూపాయల స్టాంపు మీద అప్పటికప్పుడే అగ్రిమెంటు రాయించుకున్నారు. వెయ్యి రూపాయలు అడ్వాన్సుగా ఇస్తూ, మిగిలినది సినిమా పూర్తి అయ్యేలోగా ఇచ్చే విధంగా రాయించారు. రంగన్న సంతోషంగా వెయ్యి రూపాయలు జేబులో పెట్టుకున్నాడు.

కూతురు పిలిస్తే మణ్యం లోనికి వెళ్ళాడు. శివరావు బయటకు చూస్తూ కాలం గడుపుతున్నాడు. అనవసరంగా ఇందులో తాను ఇరుక్కున్నానేమో అనుకుంటున్నాడు. ఏమాత్రం దెబ్బతిన్నా, తన తండ్రి ఊరివాళ్ళని ముంచి సంపాదించిన డబ్బు మొత్తం ఊడ్చుకొనిపోతుంది. ఇంతవరకూ కనకారావుకే విలువ ఉండేది. ఇప్పుడు రచయితగా రామారావు కూడా స్థానం సంపాదించుకున్నాడు. తనకు ఏదీ చేతకాదు గనుక ఎవరూ గుర్తించరు అనుకున్నాడు.

"మంచినీరు తాగివస్తాను" అంటూ లోనికి వెళ్ళాడు రంగన్న.

మణ్యం కుర్చీలో కూర్చుని ఉన్నాడు. ఐదు వందరూపాయల కాగితాలు తీసి మణ్యం జేబులో పెట్టాడు "ఉంచండి" అంటూ.

"ఎందుకు లేవయ్యా!" అంటూనే, నోట్లు బయటకు కన్పించకుండా లోపలకు తోశాడు మణ్యం.

"పిల్లలను కుంటున్నావేమో! మహా మేధావుల్లా ఉన్నారయ్యా! జాగ్రత్తగా ప్రవర్తించాలి'' అన్నాడు.

"అవునవును. మనల్నే అమాయకులుగా చేస్తున్నారు'' అన్నాడు రంగన్న.

"మీ అమ్మాయికి హీరోయిన్ వేషం ఇస్తారనుకున్నాం.''

"చూద్దాం" అన్నాడు తల ఊపుతూ మణ్యం ఆలోచనలోపడి.

రంగన్న బయటకు వచ్చాడు. ఆపాటికి ముగ్గురూ తర్జన భర్జనలు పడుతున్నారు. రంగన్నను చూసి నోరు మూసుకున్నారు.

ఫోను మోగుతుంటే రంగన్న ఎత్తి మాట్లాడి "మణ్యంగారూ! ఫోనువచ్చింది" అంటూ పిలిచాడు. వచ్చిన ఫోను అందుకున్నాడు. కొంచెం సేపు మాట్లాడి "సరబలి సినిమా ప్రొడ్యూసర్ పిలుస్తున్నాడు; నేను వెళ్ళాలి. మనపని అయిందిగా! ఒక వారం, పదిరోజుల్లో మాటలు, పాటలు పూర్తయితే స్క్రీన్‌ప్లే చేసి, తర్వాత విషయాలు ఆలోచించుకుందాం" అన్నాడు వెళ్ళడానికి ఉద్యుక్తుడవుతూ.

"నేను కూడా సాయంత్రం మీ రూంకు వస్తాను. అక్కడే నవల సరిచూసి, సెలెక్టుచేసి పని ప్రారంభిద్దాం'' అన్నాడు రంగన్న.

"వంట ఏర్పాట్లు ఇక్కడే చేశారు. ఈ రోజు మా అతిథులు మీరు ! కానీ, ఏంచేస్తాం ! అర్జంటుగా పనిపడింది. అమ్మాయి మీకు తెలుసుగా! కొత్తేముంది? అమ్మాయ్ నాగినీ! వీరికిఆతిథ్యం ఏర్పాటు చేయి. నేను వెళుతున్నాను" అంటూ రంగన్నతోకలిసి వెళ్ళిపోయాడుమణ్యం.

"నాకు ఏమీ బోధపడటం లేదు'' అన్నాడు శివరావు తల తాటిస్తూ.

"ఇది సినీ మాయరాబాబూ!మరో పది రోజులు ఇలాగే నలుగురినీ కలుస్తుంటే అన్నీ అర్థమవుతాయి'' అన్నాడు కనకారావు నవ్వుతూ.

నాగిని బయటకు వచ్చింది.

"భోజనానికి ఏర్పాటు చేశాను. అంతా రడీ!" అంది వెళ్తూ. నౌకరువచ్చి "అమ్మగారు కాళ్లు కడుక్కోమంటున్నారు" అన్నాడు.

మధ్యన టేబుల్. టేబుల్ చుట్టూ మూడు కుర్చీలు. టేబుల్ పైన పళ్ళేలలో పదార్థాలు.

పదార్థాల వైపు గాక అవి వడ్డిస్తున్న నాగిని వైపు చుస్తున్నాడు శివరావు. తన ఊరిలో అటువంటి అందగత్తెను తాను ఎప్పుడూ చూడలేదనుకున్నాడు. చాలా అందంగా, ఆకర్షనీయంగా, మత్తుగా కన్పించింది. 'హీరోయిన్ పాత్రకు బ్రహ్మాండంగా ఉంటుంది.' అనుకున్నాడు ఓరగా చూసింది నాగిని శివరావువైపు. వెర్రివాడిలాగా చూస్తున్న శివరావును గిల్లాడు రామారావు. ఉలిక్కిపడి తల తిప్పిచూసి, అతని కళ్లలో కన్పిస్తున్న కోపంచూసి తలవంచుకున్నాడు. వీళ్ల చేష్టల్ని చూడకుండా, నాగినిని కవ్విస్తూ మాట్లాడుతున్నాడు కనకారావు.

భోజనం పూర్తిచేసి, ముఖాలు తుడుచుకుంటూ హాలులోనికి వచ్చారు శివరావు, రామారావు.

"ఈ రోజుయినా సినిమాకు వెళ్దామా?" అంది నాగిని.

"మావాళ్ళు నామీద పడి ఏడుస్తారు. ఇంతవరకూ కథ ఏమీ చర్చించుకోలేదు."

"సమయం చాలా ఉందిగా. ప్లీజ్ ! రారూ !" అంది అతడి చెయ్యి తన చేతిలోనికి తీసుకుంటూ.

ఆమె చెయ్యి నొక్కి "ఆరుగంటలకు వస్తాను" అన్నాడు బయటకు వస్తూ. టాక్సీ తీసుకుని రూంకు వచ్చారు. దారిలో ఎవరూ మాట్లాడలేదు. రూంకు వచ్చి శివరావు,కనకారావు పడుకున్నారు. రామారావు తన పాత నవలలు బయటకు

తీసి చూస్తూ ఆలోచించసాగాడు.

సాయంత్రం ఐదుగంటలకు ఫోను మోగుతుంటే లేచి అందుకున్నాడు కనకారావు. నాగిని ఫోను చేస్తున్నది.

వెంటనే తనున్న హోటల్ వద్దకు రమ్మన్నాడు. ఐదున్నరకు అక్కడికి చేరుతానంది.

ఫోను పెట్టేసి వెనుతిరిగేలోగా నమస్కారం పెడుతూ రంగన్న ప్రవేశించాడు. తిరిగి ఫోను ఎత్తి హోటల్‌కు ఫోన్‌చేసి నాలుగు కాఫీ పంపమన్నాడు.

"నవల విషయం ఆలోచించారా?" అన్నాడు రంగన్న కూర్చుంటూ. వేలు పెట్టి రామారావుకేసి చూపించాడు ఆ విషయం తనది కాదన్నట్లుగా!

రంగన్న తలతిప్పిఅటువైపుచూశాడు.

"ఈ నవలనే తీసుకుందామనుకుంటు



న్నాను. ఇందులో ప్రధానంగా కులాంతర వివాహం, మూఢ విశ్వాసాల్ని వ్యతిరేకించడం కథావస్తువు." అన్నాడు రామారావు.

రంగన్న నవల చేతికి తీసుకున్నాడు క్రౌన్ సైజులో వంద పేజీల పుస్తకం.

కాఫీ వచ్చింది. తాగి తాను రాత్రి పదిగంటలకు వస్తానని చెప్పి వెళ్ళాడు కనకారావు.

పోతున్న కనకారావుని చూస్తూ "ఆయన ఎక్కడికి వెళ్తున్నాడు?" అన్నాడు రంగన్న.

"డైరెక్టరు మణ్యం కూతురితో సినిమాకి వెళ్తున్నట్లున్నాడు" అన్నాడు రామారావు.

రంగన్న పకపక నవ్వాడు. "అయితే వలలో పేసిందన్నమాట. ఎప్పటినుండో హీరోయిన్ ఛాన్స్ సంపాదించాలని కలలు కంటున్నది.. ఏ నిర్మాతా పలకడం లేదు. తండ్రి ఎంత ప్రయత్నించినా సాధ్యంకాలేదు. చివరకు ఈయన గారిని లొంగదీసుకోడానికి తండ్రికి తెలిసే ఎత్తు వేసి ఉంటుంది."

రంగన్న ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు శివరావు. "పోనీలెండి! కొన్నాళ్ళు ఆ పేరుతోనయినా మావాడు సుఖపడనీ! వాడి ఒక్కడి ఇష్టమే కాదు గదా పాత్ర ఇవ్వడానికి?" అన్నాడు రామారావు.

"సరయిన మాట మాట్లాడారు. ఇక్కడ కొత్త వ్యక్తులు సినిమా రంగంలో ప్రవేశిస్తే వాళ్ళను ఒళ్ళో వేసుకుని ఛాన్సులు పొందడానికి ఎందరో ప్రయత్నిస్తుంటారు. మంచి నటీమణులు మరుగున పడిపోతారు వీరి మూలంగా! ఉదాహరణకు మోహిని ఉంది చూడండి పాపం! ఆ అమ్మాయికి సరయిన పాత్రలే దొరకడంలేదు. మోహిని ముందు ఈ నాగిని లాంటివాళ్ళు దిగదుడుపే! అయినా ఆ అమ్మాయికి వేషక తగినవారులేక జూనియర్ వేషాలు వేస్తూ బతుకుతున్నది. మీరుకూడా చూడండి ఆ అమ్మాయిని ఒకసారి!" అన్నాడు చాకచక్యంగా.

మణ్యం కూతురి మీద వ్యతిరేకత లేపడం ద్వారా ఈ అమ్మాయిని పైకి తీసుకొని రావడానికి అతని ప్రయత్నం.

"చూద్దాం!" అన్నాడు తలవంచుకుని నవలవైపు చూస్తూ రామారావు. ఈ వేదవలిద్దరూ ఒకేలా తయారవుతున్నారనుకున్నాడు శివరావు. ఈ ఇద్దరి మధ్య తాను చవటగా తయారవుతున్నాడు. ఎవరు వచ్చినా వారిద్దరినే పరిచయం చేసుకుంటున్నారు. మణ్యం తన కూతురిని కనకారావు మీద ప్రయోగిస్తే, మరో మోహినిని వీడి మీద ప్రయోగించడానికి రంగన్న ప్రయత్నం చేస్తున్నాడు. ఈ వెధవలతో పాటు తానూ పెట్టుబడి పెట్టిన వ్యక్తిగా ఎవరూ గుర్తించటం లేదు అనుకున్నాడు కసిగా.

"మీరు చూస్తానంటే ఈ రాత్రికే తీసుకొస్తాను" అన్నాడు రంగన్న.

"ఇప్పుడు కాదులెండి రంగన్నగారూ! ముందు కథతొందరగా పూర్తవాలి. ఆ తర్వాత మిగిలిన విషయాలు. ఈ నవలలో మాటలు కావలసినన్ని ఉన్నాయి. మీరు పెద్దగా ఊహించి రాయవలసిన పనేలేదు. వీటిని సెట్ చేసుకున్నా సరిపోతుంది. సినిమా పద్ధతిలో రాయడం నాకుతెలియదు. లేకుండే నేనే రాసుకొనేవాడిని" అన్నాడు రామారావు గంభీరంగా.

'నీవేరాసుకుంటే నాకు పదివేలు ఎట్లా

వస్తాయి?' అనుకున్నాడు రంగన్న.

* * *

కనకారావు కౌంటర్ వద్దకు వచ్చి నిలబడ్డాడు. షిఫ్ట్ డ్యూటీలో ఓ అమ్మాయి ఉంది. నవ్వుతూ ఆమెవైపు చూశాడు. ఆమె కూడా చిరునవ్వుతో "కూర్చోండి" అంది.

"ఎంతకాలంనుండి ఇక్కడ పనిచేస్తున్నారు?" అన్నాడు.

"రెండు సంవత్సరాలవుతుంది."

"జీతం ఎంత ఇస్తారు?"

"నెలకు మూడువందలు ఇస్తున్నారండీ! ఎప్పుడైనా ఓవర్ టైం చేయవలసి వస్తే, డ్యూటీకి-అంటే ప్రతి ఆరుగంటలకు పది హేనురూపాయలిస్తారు. నెలకు ఐదారు డ్యూటీలు దొరుకుతాయి."

"మద్రాసేనా మీది?"

విచారంగా నవ్వింది "లేదండీ! మాది నెల్లూరుజిల్లా. సినిమా మోజుతో ఇక్కడకు వచ్చాను. ఓ సంవత్సరం పాటు నానా బాధలు పడి ప్రయత్నాలు చేశాను. ఫొటోజెనిక్ లేదన్నారు కొందరు. ఒళ్లుమరీ కట్టె అన్నారు కొందరు. రకరకాల పేర్లు పెట్టడమేగానీ, సాయంచేసే వాళ్లు లేక డిగ్రీ చేతిలో ఉండడంవల్లా, ఈ సంవత్సరంలోనూ తమిళం నేర్చుకోగలిగి ఉండటం వల్లా ఈ ఉద్యోగం దొరికింది"

"ఇందులో సుఖమేగదా !"

"సుఖమా!" విరక్తిగా అంది వస్తున్న కస్టమర్‌ను చూస్తూ. వచ్చినవ్యక్తితోపాటు ఓ అందమైన అమ్మాయి ఉంది. రూం బుక్ చేసుకుని, తాళంచెవి తీసుకున్నారు. రూం బాయ్ వచ్చి వారిని తీసుకొని వెళ్ళాడు. వెళ్తున్న ఇద్దరినీ చూస్తూ కూర్చుంది.

"మీకు పెళ్ళయిందా ?"

హఠాత్తుగా ఈలోకంలోకి వచ్చినట్లు ఉలిక్కిపడి "లేదు" అంది పెదవుల మీదకు చిరునవ్వు తెచ్చుకోడానికి ప్రయత్నించేస్తూ.

"మీ బిజినెస్ ఏమిటండీ సార్!" అంది సూటులో మెరిసిపోతున్న అతన్ని కిందినుండి పైదాకా చూస్తూ.

"సినిమా తీయడానికే వచ్చాం! అన్నీ పూర్తయ్యాయి. సంస్థ రిజష్టరయింది. కథ పూర్తవుతున్నది".

ఆ అమ్మాయి ఆశ్చర్యంతో అతన్ని చూస్తూ "ఇంతకుముందు కూడా మిమ్మల్ని చూసినా ఎవరో బిజినెస్ మాగ్నెట్ అనుకున్నాను కాని, సినిమా నిర్మాతలనుకోలేదు. జీవితంలో కనీసం ఒక సినిమాలో అయినా నటించాలని ఆశగా ఉంది. దయచేసి అవకాశం ఇవ్వండి సార్".

సినిమా వ్యామోహం ఎటువంటిదో అతనికి తెలుసు. అందులో కనీసం ముఖం కన్పించే పాత్ర దొరికినా చాలు సర్వస్వం అర్పించడానికి సిద్ధపడతారు. ఆవిధంగా చాలా మంది ఆడపిల్లను ఆకర్షించి, వారిజీవితాల్ని దోచుకుంటున్నారు కూడా. చివరకు వేషాలు దొరకక సాని కొంపలకు కొందరూ, ఉంపుడు గత్తెలుగా కొందరూ, సినిమారంగంలో రిటైర్‌అయి అమ్మాయిల్ని చేరదీసి వ్యభిచార వ్యాపారం చేసే సినీనటీమణులవద్ద కొందరూ, అంతో ఇంతో చదువు ఉండి అవకాశం దొరికితే ఉద్యోగాలు చేసుకునేవారు కొందరు.

శరీరం అర్పించకుండా సినిమారంగంలో సహాయం సంగతి తర్వాత ముందు మాట్లాడడం కూడా జరగదు. కనకారావు సంవత్సరం నుండీ సినిమారంగంలో ఉన్నాడు. అందువల్ల అతనికి చాలా విషయాలు తెలుసు. అందులో ఒకటి

సినిమా ఆశచూపి రోజుకో ఆడపిల్లను వెంటేసుకొని తిరగడం.

తనవైపే చూస్తున్న కనకారావుచూపుల్ని తప్పించి తలవంచుకుంది సరోజ! అతడు ఏవిధంగా ఆలోచిస్తుంటాడో ఆ అమ్మాయికి తెలుసు. అతడు వేషం ఇస్తే అతనితో జల్సాగా తిరగడానికి వ్యతిరేకించదు.

నాగిని టాక్సీదిగి అతనివద్దకు వచ్చింది. నాగినిని చూస్తూ లేచినిలుచున్నాడు కనకారావు. నాగిని అందగత్తె కాదు. కానీ శరీరంలో ఉండవలసిన అన్ని వంపులూ కుదిరాయి. పలుచటి చీరలో లోనున్న లంగా మసకగా కన్పిస్తున్నది.

నాగిని చెయ్యిపట్టుకొని బార్‌లోకి వెళ్లి ఖాళీగాఉన్న టేబుల్ ముందుకూర్చున్నాడు.

"ఏం తీసుకుంటావ్ ?"

"ఏమీవద్దు. కాఫీ చాలు" అంది నాగిని మత్తుగా అతన్ని చూస్తూ.

స్ట్రాంగ్ కాఫీ తీసుకరమ్మన్నాడు వెయిటర్‌తో.



"మీ నాన్న ఉన్నాడా?"

"వుదయం వెళ్ళినవాడు ఇంతవరకూ రాలేదు."

"ఇంట్లో ఇంకా ఎవరెవరున్నారు?"

"ఇద్దరు అన్నగార్లు. ఒకరు ట్రాన్స్ పోర్టు కంపెనీలో క్లర్కు. ఇంకో ఆయన ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ సంస్థలో క్లర్కు. ఒక చెల్లెలు చదువుకుంటున్నది. అమ్మ ఉంది."

"మధ్యాహ్నం మీ అమ్మ కన్పించలేదే మరి?"

"అతిథుల ముందుకు ఆమె పెద్దగా రాదు."

"ఇటువస్తున్నట్టు తెలియదా?"

"తెలిస్తేఏం?" ఎదురు ప్రశ్న వేస్తూ నవ్వింది. కనకారావు జవాబివ్వ లేదు. ఆమె ఒంటికి, గుడ్డలకు హత్తుకొన్న మరికొళందు ఘాటు అతని ముక్కుపుటాలు తాకుతున్నది. జాకెట్ కిందనున్న బ్రా దాటి బయటకు దుముకుతున్నట్లున్న రొమ్ముల్ని చూస్తూ ఆలోచిస్తున్నాడు.

కాఫీ వచ్చింది. తాగుతూ చూస్తున్నాడు.

"ఎప్పుడూ చూడటమేనా?" అంది చిరు కోపంతో అతన్ని చూస్తూ.

"అంతకంటే ఏంచేసినా ఇక్కడ నవ్వుతారు" అన్నాడు లేస్తూ.

సిగ్గుతో తలవంచుకొని లేచింది నాగిని.

బిల్లు చెల్లించి టాక్సీ వద్దకు వచ్చారు. వెళ్తున్న ఇద్దరివైపూ చూస్తూ ఊపిరి బరువుగా విడుస్తున్నది సరోజ. ఇద్దరూ కూర్చుంటూనే టాక్సీ తలుపువేసి, స్టీరింగ్ వీల్ ముందు కూర్చుని స్టార్ట్ చేశాడు డ్రైవర్.

"ఏ సినిమాకు వెళ్దాం"

"మీ ఇష్టం. 'మిస్సమ్మ' ఆడుతోంది వాహినీలో!" అంది నాగిని.

టాక్సీ వాహినీ కాంపౌండ్‌లో నిలబడుతూనే కిందికిదిగి డబ్బిచ్చేశాడు. టాక్సీ వెళ్ళిపోయింది.

వాహిని పాతబడుతున్నదనుకున్నాడు. కొత్తకొత్త హాళ్లముందు ఇది దిగజారినట్లే ఉంటుంది మరి.

బాక్స్ టికెట్స్ తెచ్చి, ఇదరూ పైకి వెళ్ళారు.

సినిమా పాతదే అయినా కొత్తవాటి కంటే చాలా మెరుగ్గా ఉందనుకున్నాడు. ముఖ్యంగా సంగీతం, ఎటువంటి వికారం కలిగించని పాటలు, అందుకు తగిన నటన.

'ఈనాటి సినిమాలు కోతులు కుప్పిగంతులేస్తున్నట్లే ఉంటుంది' అనుకున్నాడు.

చీకటిలో తన ఒంటిని రాసుకుంటూ తన వేళ్లను నిముషుతున్న నాగినిని గమనించకపోలేదు. నాగిని విషయం బయట చూడవచ్చు. రేపు తన సినిమాకు కావలసిన విషయాలు ఏవైనా దొరుకుతాయేమోనని చూస్తున్నాడు. రేస్పాన్స్‌లేని అతని ముఖంలోకి చూసి తల తిప్పుకొని సినిమా చూడసాగింది నాగిని.

ఇంటర్వెల్‌లో కూల్‌డ్రింక్స్ తెప్పించాడు. "సినిమా ఇంట్రెస్టింగ్‌గా లేదు" అంది నాగిని.

"ఇంట్రెస్టు కోసం కాదుగా మనం వచ్చింది?" అన్నాడు ఆమె ముఖంలోకి చూస్తూ.

నవ్వింది నాగిని.

"మొండిఘటంలాగున్నారు".

"ఏమీకాదు. సినిమా ఆలోచనలో పడ్డానులే. స్త్రీ వెర్రెత్తిస్తే, ఎత్తని వెధవ ఉంటాడా? ఉంటే మా రామారావులాంటి





వాడు ఏ ఒక్కడో?"

"ఆయన అంత నిగ్రహపరుడా?"

"ఇంతవరకూ! ఇకముందు నేను చెప్ప లేనుగా."

సినిమా ప్రారంభమయింది. నాగిని భుజంచుట్టూ చేతులువేసి నడుంనిమిరాడు. పులకించిపోతున్న నాగిని అతని మెడను కావలించుకుని ముద్దులతో ముఖాన్ని నింపింది.

సినిమా విడిచిన తర్వాత టాక్సీలో మౌంటురోడ్డుకు వచ్చి హోటల్ గాంజ్‌లో భోజనం చేశారు.

"ఇంటికి వెళ్తావా? డ్రాప్ చేస్తాను" అన్నాడు ఆమె ముఖంలోకి చూసి.

"ఇంటికి వెళ్ళమంటావా? నీయిష్టం అయితే!" అంది మత్తుగా అతనిమీదవాలి. చూస్తున్న వ్యక్తులముందు అలా ఉండడం మంచిది కాదని లేచివచ్చాడు. టాక్సీఎక్కి గుప్తాస్ లాడ్జీకి వెళ్ళమన్నాడు.

లాడ్జికౌంటరులో పురుషుడు ఉన్నాడు. సరోజ డ్యూటీదిగి ఉంటుందనుకున్నాడు. వస్తున్న ఇద్దరినీ చూశాడు కౌంటర్‌లోని మనిషి. అతను తమ పాత ఖాతాదారుడేనని అతనికి తెలుసు.

"మిష్టర్ పాల్! రూం కావాలి!" అన్నాడు టేబుల్‌మీద చెయ్యివేసి.

"మీ పేరుతో రూం ఉందికదా సార్!"

"అందులో నా మిత్రులున్నారు. మరొకటి!"

అర్థమయినట్లు తలూపి, బోర్డులో నున్న తాళంచెవిలాగి బాయ్‌ని కేకేశాడు. బాయ్ వచ్చి తాళంచెవి తీసుకొని పైకి పరుగెత్తాడు.

ఇద్దరూ పైకి వచ్చారు. మిత్రుల రూం ఇంకా పై అంతస్తులో ఉంది. రూంలోకి వెళ్ళి లోనుండి తాళం వేశారు.

"ఇంటికి పోకుంటే మీవాళ్ళు ఏమీ అనరా?"

"ఎందుకంటారు? నీతోనే ఈ రోజు ఉంటానని మా నాన్నకూ, అమ్మకూ తెలుసు" అంది గలగల నవ్వుతూ. ఉబ్బి పోతున్న రొమ్ములకు స్వేచ్ఛ కలిగించ డానికి జాకెట్, స్త్రీకి బనియన్ తీసి కుర్చీలోవేసి మత్తుగా అతని చేతుల్లో వాలింది. కనకారావు ఆమెను పొదివిపట్టు కొని మంచం మీదకు తెచ్చాడు.

* * *

రూంలో శివరావు పుస్తకం చదువు కుంటూ కూర్చున్నాడు. రామారావు, రంగన్న పేపరు ముందు వేసుకొని పెన్నులతో కుస్తీపడుతున్నారు. అలికిడి విని తలెత్తి చూశారు కనకారావు.

"ఎంత వరకు వచ్చారు?"

"బేసిన్ బ్రిడ్జి దగ్గరున్నాం. ఇంకో పదినిమిషాలుంటే సెంట్రల్‌కు వస్తాంలే" అన్నాడు రామారావు వెటకారంగా. కనకా రావు నోరెత్త లేదు. రామారావు కోపంలో ఉన్నప్పుడు ఏంజరుగుతుందో అతడికి అనుభవమే! తాను ఆడపిల్లల వెంట తిరుగుతూ, తమమీద ఈ బరువు మోపానని అతనికి మంట.

"కథ చాలా పటుత్వంగా ఉంది కానీ యండి. మాటలు ఇంతకటువుగా రాస్తే సినిమా దెబ్బ తింటుందేమోనని నా అను మానం" అన్నాడు రంగన్న వినయంగా.

"మాటలు కటువుగానూ హాస్యంగానూ కూడా ఉండాలి" అన్నాడు కనకారావు.

"బ్రహ్మాండంగా వస్తాయ్‌లే!" అన్నాడు రామారావు.

"చేసేదేదో ఇద్దరూ కలసి ఆలో చించండి. సినిమా దెబ్బతినకుండా

ఉండడం ముఖ్యం."

ఎవరూ మాట్లాడలేదు.

"శివరావుగాడు ఇంటికి వెళ్తాడట! ఇక్కడ పనిలేక బోరుగా ఉందంట" అన్నాడు రామారావు రాసుకుంటూనే.

"నిజంగానే వెళ్తావేరా!" అన్నాడు ఆశ్చర్యంగా కనకారావు. వచ్చి రెండు రోజులవలేదు. అప్పుడే వీడికి వచ్చిన విసుగేమిటి?

"నేను ఉండిమాత్రం ఏం చేయాలిరా! నీ పనులు నీవు చేసుకుంటున్నావు. వాడి పనులు వాడూ చేసుకుంటున్నాడు. నాకు ఏ పనీ చేతకాదు. ఊరికే కూర్చుని తింటూ ఉండటమెందుకూ? అందుకే వెళ్ళిపోదామనుకున్నాను."

"ఇకరావా?"

"రాకేం! మాబాగా వస్తాను. షూటింగ్ ప్రారంభమయితే పనిఉంటుంది కదా! అప్పుడు వస్తాను" అన్నాడు శివరావు. 'ఇదీ ఒకందుకు మంచిదే' అనుకున్నాడు కనకారావు.

"సరే! వెళ్ళదలచుకుంటే నీయిష్టం! మరో వారం రోజుల్లో రంగం సిద్ధమవుతున్నది కదా? పాటలు-మాటలు తయారు కావడమే ఆలస్యం. సినిమా ప్రారంభమవుతుంది. ఈలోగా వెళ్లిరాదలచుకుంటే పోయిరా!"

శివరావు పుస్తకంలో మునిగిపోయాడు. రంగన్న, రామారావు మాటలు రాసుకోవడంలో మునిగిపోయారు. ఫోన్‌కొరకు ఎదురుచూస్తూ కూర్చున్నాడు కనకారావు.

ఆరు గంటలకు ఫోన్ వచ్చింది. మణ్యం వస్తున్నాడట. ఆ విషయం వారికి తెల్పాడు. మరో పావుగంటకు మణ్యం తానేవచ్చాడు.

"ఎంత వరకు వచ్చింది మనకథ?" అన్నాడు రావటంతోనే.

"ఈరోజు ఉదయం నుండీ కూర్చున్నాం సార్! మూడు సీన్లకు సరిపడే మాటలు విడదీసి రాశాము. మరో వారాని కల్లా పూర్తిగా రాస్తాములెండి. ఒకవైపు నుండి ప్రారంభిస్తే పాటలుకూడా ఆయన త్వరగానేరాసేస్తాడు" అన్నాడు రంగన్న.

"మంచిదే. ఫిల్మ్‌రోల్ స్టాకు ఉందో లేదో తెలుసుకోండి. ఫిల్మ్ గనుక దొరకకపోతే బాధపడవలసి వస్తుంది. బ్లాకులో అమ్ముతున్నారందరూ!"

"ఎంత కావలసి వస్తుంది?"

"యాభై రోళ్ళయినా కావాలి. ముందు పాతిక రోళ్ళు కొని స్టాక్ ఉంచండి. తర్వాత చూద్దాం"

తల ఊపాడు కనకారావు.

"కథ పూర్తయ్యేలోగా అన్నీ సిద్ధంగా ఉంచుకుంటే టెక్నీషియన్స్‌నూ, నటీనటులనూ వెంటనే మాట్లాడుకొని, షూటింగు ప్రారంభించవచ్చు" అన్నాడు మణ్యం వెళ్ళిపోతూ.

శివరావు పోతున్నట్లేనా?''

"ఆ! ఢిల్లీ ఎక్స్‌ప్రెస్‌కు వెళ్తాడుట''

స్నానం చేసి, గుడ్డలు మార్చుకునేటప్పటికి బాయ్ టిఫిన్ తీసుకువచ్చాడు. ముగ్గురూ పూర్తిచేసి, కాఫీతాగి స్టేషన్‌కు బయలుదేరారు.

"ఇక్కడ సినిమా ఇంకా మొదలు కాలేదని చెప్పకురా బాబూ! తీస్తున్నారని చెప్పు. ఇంత వరకూ ప్రారంభించలేదంటే ఇక ముందు పైసా ఇవ్వరు'' అన్నాడు కనకారావు.

"మీరు సినిమాతీస్తారో, రైలు కింద పడి ఛస్తారో నాకు తెలియదు. నేను ఇక రాకూడదనుకుంటున్నాను. పెట్టుబడి లక్షరూపాయలూ వాపసు తీసుకుంటాను"




అన్నాడు చిరాకుగా శివరావు.

"ఒరే నాయనా! అంతపని ఎందుకు చేస్తావ్‌రా! నీవు ఇంటికి పోకున్నా బాధ లేదు గానీ ఇక్కడే పడివుండు. ఇప్పడే పెట్టుబడి తక్కువై మేం ఏడుస్తుంటే నీ ఏడు పేందిరా!'' అన్నాడు కనకారావు.

"వాడేదో తమాషాగా అంటున్నాడు లేరా! ఇంతవరకూ మనల్ని దింపి వాడు మానుకుంటే లక్షరూపాయలు కాదు పైస కూడా వాపసురాదని వాడికీ తెలుసు. మన మేదో సుఖమనుభవిస్తున్నామనీ, విలువ సంపాదించుకుంటున్నామనీ వాడిఏడుపు" అన్నాడు రామారావు నవ్వుతూ.

"అసలు రేపు పనంతా వాడిదేకదరా! ప్రొడ్యూసర్‌గా వాడిపేరు వేస్తాం. ఆఫీసు అకౌంట్ అంతా వాడిపేరుతో పెడదాం! మేనేజింగ్ పార్టనర్‌గా వాడినే పెడదాం! నాకు పైన తిరగడంతో సరిపోతుంది. నీకు షూటింగుతో సరిపోతుంది. మిగిలిన విషయాలన్నీ వాడివేకదా!'' అన్నాడు కనకారావు ఉబ్బిస్తూ. వీడు జారిపోతే బాధపడవలసి వస్తుందని భయపడుతు న్నాడు. జారిపోకుండా ఏదో ఒక వల పన్నితేగానీ వీడు ఆగడు. 'అదదాన్ని తగి లించడమే అందుకు మార్గం' అనుకున్నాడు.

"నీవు ఇంటికి పోవద్దుగాని రూంకు వెళ్లాంరా! మరో నాలుగు రోజులుంటే ఆఫీసు ఓపెన్ చేస్తాం. అప్పుడు కావలసి నంత పని ఉంటుంది."

"ఎలాగయినా నేను ఇంటికివెళ్లాలిరా. ఒక వారం రోజుల్లో వస్తాను. అప్పటికి ఇళ్ళు మాట్లాడి సిద్ధంగా ఉంచండి. నేను వచ్చేటప్పటికి అన్నీ సిద్ధంగా ఉండాలి" అన్నాడు శివరావు నవ్వుతూ.

ఎక్స్‌ప్రెస్‌కు బెర్త్ సంపాదించి ఎక్కించారు. బండి కదుల్తూనే బయిటకు వచ్చి టాక్సీ ఎక్కి మణ్యం ఇంటికి వెళ్ళారు.

మణ్యం ఇంట్లోనే ఉన్నాడుగానీ ఇంకా లేవలేదు. నాగిని వచ్చి ఇద్దరినీ పలుక రించి పైకి వెళ్ళింది. మరి కొంచెం సేపటికి నిద్ర మత్తుతో బొజ్జ చేతితో రుద్దుకుంటూ వచ్చాడు మణ్యం.

"కూర్చోండి. రాత్రంతా రీడబ్బింగ్ చూసుకోవడంతోసరిపోయింది.తొందరగా రిలీజ్ చేయాలంటున్నాడు. ఇప్పడే వచ్చి పడుకున్నాను. స్నానం చేసి వస్తాను" అంటూ వెళ్ళాడు.

ఇద్దరికీ కాఫీ తెచ్చిఇచ్చింది నాగిని.

ఇద్దరూ తలవంచుకొని ఆలోచించు కుంటున్నారు. ఇంతలో నడిప్రాయం మనిషి ఒకామె మెట్లుఎక్కి వచ్చింది.ఆమె వెంట నాగిని వయస్సు ఉన్న అమ్మాయి ఉంది. ఇద్దరూ చకచకా వీరి వైపు చూడ కుండా లోనికి వెళ్ళారు. కనకారావు వారిని చూడలేదు. రామారావు తల ఎత్తి చూసే టప్పటికే లోనికి వెళ్ళిపోయారు. లోపల నుండి గలగల నవ్వుల శబ్దం విని పిస్తున్నది. వింటూ కూర్చున్నారు.

మరి కొంచెం సేపటిలో బయటకు వచ్చింది ఆమె. ఆమెతోపాటు అమ్మాయి. వీరిని చూసి దగ్గరగా వచ్చింది.

"ఎప్పుడొచ్చావ్‌రా దొంగసచ్చి నోడా!" అంది నవ్వుతూ ఎంతో పరిచయ మున్న దానిలా. కూర్చీ లాక్కుని పక్కనే కూర్చుంది.

కనకారావు నవ్వాడు. "వచ్చి మూడు రోజులయింది."

"ఏం చేస్తున్నావు?"

"కలర్ పిక్చర్ తీయాలని వచ్చాం.

కథ ప్లాటు, నివసించే ప్లాటు వెతుక్కుంటున్నాము."

"ఇంటి వద్దకు కూడా రాలేదేం ఈ మూడు రోజుల్నుంచి?"

"వీలుపడలేదు."

"వీలెందుకు పడదు? మరిచిపోయుంటావు. అవున్లే! ఎలా కనిపిస్తాం?" అంది ఈసడింపుగా.

"మరచిపోలేదు గానీ, పనుల వల్ల రాలేకపోయాను."

"ఈ రోజు మధ్యాహ్నం భోజనానికి రావాలి. నీకు కోడికూర ఇష్టం కదా! ఇంటి దగ్గర ఉడుకుతున్నది" అంది అతని చేతిని చేతిలోకి తీసుకుని రాస్తూ.

"వేరేపని ఉంది ఈ పూట! రాలేను."

"మొహం పగలగొడతాను, చూస్తాను ఎలా రావో!" అంది. అంతవరకూ పక్కనున్న వ్యక్తిని గుర్తించనట్లు చూస్తూ "ఈ అబ్బాయి ఎవరు?" అంది రామారావు వైపు చూస్తూ.

"మా పార్టనర్! మంచి రచయిత వీడి నవలే రేపు మేము తీసే సినిమా!"

"చెప్పి చావవేం మరి! ఇదిగో బాబూ! నీవు కూడా ఈ రోజు మా ఆతిథ్యానికి రావాలి. రానంటే మాత్రం కుదరదు" అంది గట్టిగా. రామారావు నవ్వాడు కానీ, జవాబివ్వలేదు.

"నేను వెళ్తున్నాను. వస్తావా రావా? చెప్పు" అంది లేస్తూ.

"వస్తాం పో" అన్నాడు తలూపి, ఆ అమ్మాయి వైపు చూస్తూ. అమ్మాయి ఇద్దరినీ మార్చి మార్చి చూస్తూ కళ్ళు తిప్పుతున్నది.

ఇద్దరూ వెళ్ళారు.

"ఎవర్రా ఈ మహాతల్లి?"

"సుబ్బయ్య ఉంపుడు కత్తెరా! దర్శకుడు సుబ్బయ్య తెలుసుగా! మొదట కొన్నాళ్ళు అక్కడే ఉన్నాగా నేను. అప్పుడు తోడయింది. ఈ మహారాణి! నా ప్రాణం తీస్తున్నదనుకో! దొరికితే జలగలాగ పీలుస్తుంది" అన్నాడు విసుక్కుంటూ.

"ఆ అమ్మాయి ఎవరు? హీరోయిన్ లాగుంది!"

"ఈ మద్రాసులో అందరూ హీరోయిన్‌లలాగానే ఉంటార్లే! ఈవిడగారు అతగాడు సంపాదించే డబ్బు చాలక, ఇటువంటి వారిని తయారుచేసి వెలు సంపాదిస్తుంటుంది."

ఆశ్చర్యంగా చూశాడు రామారావు "ఆ అమ్మాయి అటువంటిదనుకోను."

"అంతే! కానీ బజారుపిల్ల కాదు. రోజు సంపాదన వేల మీద ఉంటుంది. అందరికీ అందదు! తేడా అదే! ముందు ముందు నీకే అర్థమవుతాయి."

రామారావు పలుకలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు.

మణ్యం వచ్చాడు. పాంటు, షర్టు వేశాడు.

"టెక్నిషియన్‌లను బుక్ చేస్తే సరిపోతుంది. వరుసగా ఒక్కోపని పూర్తి చేద్దాం. 'నరబలి' కూడా పూర్తవుతున్నది గనుక, నేను మీ సినిమా మీదనే కేంద్రీకరిస్తాను!" అన్నాడు మణ్యం.

"కథ పూర్తయితే టెక్నిషియన్స్‌ది పెద్ద సమస్య కాదులెండి. నాకు కూడా కొంత అనుభవం ఉందికదా! వాళ్ళను ఒక్క రోజులో ఏదుకోవచ్చు."

"మరి హీరో, హీరోయిన్ గురించి ఆలోచించారా?"

"చెప్పాగా! హీరోయిన్‌గా కొత్త




వ్యక్తినే తీసుకోవాలని ఉంది. హీరో విషయం కూడా, ముసలోళ్ళను పట్టి లక్షలిచ్చేకంటే, తక్కువ రేటు హీరోను పట్టి పైకి తేవడం మంచిదనుకుంటు న్నాము."

నాగిని చెవులు రిక్కించి తలుపు చాటు నుంచి వింటున్నదని తెలుస్తూనే ఉంది. తలుపు వెనకనుండి చీరకుచ్చెళ్ళు అటు ఇటు ఊగుతున్నాయి.

"మరేం లేదు. తొందరగా ఏదో ఒకటి ఆలోచించండి. ఎలాగూ నాకూ సినిమాలు ఉన్న వరకూ పూర్తయ్యాయి. మీది పూర్తి చేసిగాని మరొకటి తీసుకో దలచలేదు. అందువల్ల పూర్తిగా మీ దాని మీదే కేంద్రీకరిస్తాను."

"సరే! వారం రోజుల్లో అన్ని పనులు పూర్తి చేస్తాము" అంటూ లేచాడు. ఇద్దరూ మేడ దిగి కిందకు వస్తుంటే పడుకున్న కుక్క గుర్రుకొడ్తూ చూస్తు న్నది. వీధిలో టాక్సీలు కన్పించలేదు. మెయిన్ రోడ్డు ఎక్కారు.

"నమస్కారమండీ! సినిమా తీస్తు న్నారట కదా? ఎప్పటి నుండి ప్రారంభం?" అన్నాడు ఒక వ్యక్తి దగ్గరకు వచ్చి.

"మరో వారం రోజుల్లో సెట్స్ మీదకు వెళ్లాలనుకుంటున్నాం!"

"నన్నుకూడా కొంచెం గుర్తుంచు కోండి"

"తప్పకుండా!" అన్నాడు ముందుకు నడుస్తూ. ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

"ఎవరితను?" అన్నాడు రామారావు.

"బోడిగాడు ఎవడో! సినిమా తీయ డానికి వచ్చారని తెలిస్తే ఈ ప్రాంత మంతా అతడి దర్శనాల కొరకు ఎదురు చూస్తుంటారులే! ఎందరో, ఎన్నో రకాల వ్యక్తులో తారసపడతారు. అడుగు అజాగ్ర త్తగా వేస్తే అందరూ కాళ్లకింద తొక్కే స్తారు" అన్నాడు.

టాక్సీ వెళ్తుంటే పిలిచి ఎక్కారు.

"హీరోయిన్‌గా ఎవరిని తీసుకుంటే బాగుంటుంది?" అన్నాడు రామారావు.

"ఒరేయ్! ఆ బాధ్యత అంతా నీవే తీసుకో. రచయితవు కదా! ఏ పాత్రకు ఎవరు సరిపడతారో ఆలోచించు. వెనుక నేను కావలసినపుడు గైడెన్స్ ఇస్తుంటాను. పిక్చర్ తీయడం అంతా నీ మీదే వేసుకో?"

రామారావు మాట్లాడలేదు. బయటకు చూస్తూ ఆలోచిస్తున్నాడు.

"కాని కాలుపెట్టేటప్పుడు అతిజాగ్ర త్తగా ఉండు. లేకుంటే పతనమవుతావు. ఇది బోగస్ ఫీల్డు. ఇంతకు మించిన బోగస్ ఎక్కడా ఉండదు."




టాక్సీ ఆగుతూనే ఇద్దరూ దిగారు. బయటే వరండాలో కుర్చీ వేసుకు కూర్చున్న మధ్య వయస్సు ఆవిడ లేచి ఎదురు వచ్చింది "రండి లోపలకు!" అంటూ.

ఇద్దరూ సింహద్వారం దాటి లోపలికి వెళ్ళారు. విశాలమైన హాలులో మధ్యకి రెండు వైపులనుండి మెట్లు, హాలు చుట్టూ గదులు, వెనుక బాత్ రూములు. అత్యంత

నవీనంగా ఉంది భవనం. ఆ యింటిలో నివసిస్తున్న వ్యక్తి పడుపు వృత్తి చేయిస్తున్నదంటే నమ్మలేకపోయినా ఆశ్చర్య పడవలసింది ఏమీ లేదనుకున్నాడు. ఏ పుట్టలో ఏ పాముంటో? పేరుకు పెద్దిళ్ళు! ఆచరణ మరో రకం, అనుకున్నాడు.

"స్నానాలు చేస్తారా?" అంది కన్నమ్మ.

"ఇప్పుడు చేసే ఓపిక లేదునాకు. నీవు చేస్తావా?" అన్నాడు కనకారావు. రామారావు అడ్డంగా తలూపాడు.

"భోజనాలు ఏర్పాటుచెయ్యి సరితా!" అంది లోపలనుండి వస్తున్న అమ్మాయిని చూస్తూ.

"ఏం! దర్శనలు కరువయ్యాయే? మద్రాసు రాదల్చుకోలేదా?" అంది నవ్వుతూ కన్నమ్మ!

"రాదల్చుకోకుంటే ఎందుకు వస్తాను? డబ్బుకోసం ఊరంతా వెతకాల్సి వచ్చింది. అందువల్లనే నాలుగు నెలలు మద్రాసులో లేను. డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు గదా ఈ మద్రాసులో"

"నీకేం! హాయిగా ఏ డైరెక్టరుదగ్గరో అసిస్టెంటుగా ఉంటే సంపాదించుకుంటావ్?"

"ఛ ఛ! ఒకడి కింద ఎందుకు పడి ఉండటం!?" అన్నాడు విసుగ్గా. అతని విసుగు చూసి, నవ్వుకుంది కన్నమ్మ.

"సుబ్బయ్య ఎక్కడికెళ్లాడు?"

"ఔట్‌డోర్ షూటింగ్ ఉందని వెళ్ళాడు. తాగుబోతు వెధవ! తాగి పడుకోవడం తప్ప ఏమీచేతకాదు" అంది అసహ్యంగా.

"నీకేంబాధ? హాయిగా సంపాదించి, పెళ్ళాం పిల్లల్ని విడిచి అంతా నీకే పెడుతున్నాడుగా?"

"వాడిబొంద, నాతలకాయ. వచ్చేదంతా తాగి తందనాలాడ్డంతో సరిపోతుంది. సరే గానీ, ఈ అబ్బాయి కథా రచయిత అన్నావుకదా! మీ సినిమాకు ఈ అబ్బాయేనా కథ రాసింది?"

"కథ, పాటలు కూడా వీడే! మాటలు కొత్తగనుక, రంగన్నతో కలిపిరాయిస్తున్నాను. తర్వాత వచ్చే సినిమాకు అంతా మేమే"

"నీకు బంధువేనా?"

"అన్నదమ్ముల కొడుకులం."

సరిత వచ్చి ఏర్పాటు చేశానని చెప్పింది.

"బాత్‌రూంలోకి వెళ్ళి ముఖంకడుక్కోండి" అంది లోనికివెళ్తూ.

ఇద్దరూ కాళ్లు, చేతులు, ముఖం కడుక్కొని బయటకు వచ్చేటప్పటికి సరిత టవల్ పట్టుకొని బయట నిలబడింది. టవల్ తీసుకుని, ముఖం తుడుచుకుని సరిత వెంట లోనికి వెళ్ళారు.

సన్‌గ్లాస్ టేబుల్ చుట్టూ కుర్చీలు. టేబుల్‌పైన పదార్థాలున్నాయి.

రెండు ప్లేట్లలో అన్నంవడ్డించి, మాంసం గిన్నెలతో పక్కన పెట్టింది. రెండు గిన్నెలలో పెరుగుచట్నీ ఉంచింది.

సరిత పక్కనే నిలబడింది.

"మొహమాట పడకు బాబూ! నీయిల్లే ఇది, బాగాతిను" అంది కన్నమ్మ.

"వాడు మొహమాటపడటమేమిటి? కోడినిమొత్తం తినగల ఘనుడు. పెట్టడానికి నీకే విసుగ్గా ఉంటుందేమో?"

"అతిథుల్ని సంతృప్తిపరచడనికేగా పిలిచింది? సరేగానీ సరితకు ఏదైనా పాత్ర ఒకటి చూడరా పాపం మన వద్దనే ఉంది."

తలెత్తి సరిత వైపు చూశాడు. సరిత ఇటే చూస్తున్నది.





"చూద్దాం, ఇంకా టయముంది కదా."

భోజనాలు పూర్తయ్యాయి. ఇద్దరూ లేచి హాలులోకి వచ్చారు. రాత్రంతా నిద్రలేకపోవడం వల్లనూ, అతిగా అన్నం తినడం వల్లనూ కళ్లుమూసుకుపోతున్నట్లున్నాయి.

కన్నమ్మ హాలులోకి వచ్చింది. "కొంచెం సేపు రెస్ట్ తీసుకోండి" అంటూ "సరితా!" అని కేకేసింది.

"ఏం, పిన్నీ?" అంటూ వచ్చింది. చేతులు తుడుచుకుంటూ.

"చూడు, నీ బెడ్‌రూంలో పరుపు, దుప్పటి సరిచెయ్యి. ఆ అబ్బాయి పడుకుంటాడు" అంది.

సరిత తన బెడ్‌రూంలోకి వెళ్లింది.

సరిత బయటకు వచ్చిన తరువాత, "వెళ్ళి పడుకో బాబూ! విశ్రాంతి తీసుకో! సాయంత్రం వెళ్దురుగానీ!" అంది.

ఎలాగూ రూంకి వెళ్ళినా నిద్రపోవడం తప్పదనుకొని, రూంలోకి వెళ్ళాడు.



పరుపుమీద తెల్లటి దుప్పటి మెరుస్తున్నది. నిలువెత్తు బీరువా తలుపుకు అద్దం బిగించబడి ఉంది. కిటికీలకు డిజైన్ కర్టెన్స్ ఉన్నాయి. పైన ఫ్యాన్ తిరుగుతోంది. గోడలకు అర్ధనగ్న, నగ్న ఫొటోలు తగిలించి వున్నాయి. కూజా, దానిమీద గ్లాసు. మంచంమీద పడుకున్నాడు. కనకారావు ఆమెతో గడపకుండా ఎలాగూ బయటకు రాడు. అంతవరకూ ఓ నిద్ర తీద్దామని నిర్ణయించుకున్నాడు.

ఐదు నిముషాలలోనే గాఢంగా నిద్ర పట్టింది.

తిరిగి లేచేటప్పటికి జీరోబల్బు వెలుగుతున్నది. చల్లటిగాలి వీస్తున్నది. బయట దట్టంగా చీకట్లు అలుముకున్నాయి. వీధి లైట్ల వెలుతురు కన్పిస్తున్నది. తత్తరపాటుతో లేచాడు. పడుకునే సమయానికి రెండు గంటలయింది. వాచి చూసుకుంటే ఏడున్నర. లేచి స్టాండు మీదున్న టవల్‌తో ముఖం తుడుచుకుని బయట హాలులోకి వచ్చాడు. నౌకరు కింద కూర్చుని ఉన్నాడు.

"మా వాడు వెళ్ళిపోయాడా?"

"లేదు బాబూ! లోన ఉన్నారు. మీరు కూడా స్నానంచేయండి. నిద్రనుండి లేస్తూనే స్నానం చేయించమని చెప్పారు అమ్మగారు" అన్నాడు.

కనకారావు లోపలే ఉండగా తాను వెళ్ళిపోవడం మంచిది కాదని, బాత్‌రూం వైపు కదిలాడు. వెంట నౌకరు వెళ్ళి, హీటర్ తిప్పి, వేడినీళ్ల బకెట్‌కు పట్టాడు. హాలులోకి వచ్చేటప్పటికి సరిత సోఫాలో కూర్చొనిఉంది. అతన్నిచూసి లేచి "రండి భోజనం చేద్దురుగానీ!" అంది.

"కనకారావుని రానివ్వండి" అన్నాడు. సరిత చిరునవ్వు నవ్వి "కావలసినప్పుడు ఆయన తింటాడు. మీకు ఏర్పాటు చేయమన్నది అమ్మగారు" అంది లోనికి దారి తీస్తూ.

టేబుల్ ముందు కుర్చీలో కూర్చున్నాడు. పక్క కుర్చీలో కూర్చుని వడ్డించింది! తింటున్న అతని ముఖంవైపు చూస్తూ ఆలోచిస్తున్నది.

అన్నంతిని లేచి హాలులోకి వచ్చి కూర్చున్నాడు. హాలులో రంగుల ట్యూబులైట్లు వెలుగుతున్నాయి. ఇంతవరకూ నిద్రమత్తులో సరిగా చూడలేదు. హాలు ఇప్పుడు మరింత దేదీప్యమానంగా వెలుగుతున్నది.

"భోజనంచేసి వస్తాను. అక్కడే పడుకోండి. ఈ రాత్రికి ఇక్కడే ఉండమంటున్నది అమ్మగారు" అంది సరిత అతని దగ్గరగావచ్చి. రామారావు నోరెత్తి మాట్లాడలేదు. మౌనంగా తల ఊపాడు. లేచివచ్చి బెడ్‌రూంలో కుర్చీలో కూర్చున్నాడు.

మరో అర్ధగంటకు సరిత వచ్చింది.

అర్ధనగ్నంగాఉంది. పలుచటి చీర కింద లంగాలేదు. పలుచటి జాకెట్ కింద బ్రాలేదు. మరికొళుందు వాసన గుప్పున కొడుతున్నది. మల్లెపూల సౌరభం వెదజల్లబడుతున్నది. హాలులో లైట్లు ఆర్పి, బెడ్‌రూంలోకి వచ్చి లోపల గడియ పెట్టింది. అన్నీచూస్తూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు. దగ్గరగా వచ్చి నిలబడింది. ఒడిలోకి లాక్కున్నాడు. సరిత అతని కళ్లలోకి చూస్తూ చిలిపిగా నవ్వుతున్నది. ఆమె బుగ్గల్ని అందుకోడానికి తల వంచాడు రామారావు.

• • •

వారం రోజుల కిందటే పేపర్లలో




వేయడంవల్ల చాలామందే హాజరయ్యారు. కనకారావు రూంలో కూర్చుని వచ్చేవారిని విచారిస్తున్నాడు. డైరెక్టర్ మణ్యం గైడెన్స్ ఇస్తున్నాడు. బయట హాలులో కూర్చున్నాడు రామారావు.

చీరాలనుండి ఒకరు వచ్చారు. అతడు రామారావు క్లాసుమేటే! బాగా తెలిసిన వ్యక్తి అక్కడ ఉండటంచూసి, అతడు కూడా సినిమా ఇంటర్వ్యూకు వచ్చాడని ఆ వ్యక్తి పలుకరించాడు.

"ఎప్పుడొచ్చావు రామారావ్?"

"వారంరోజులయింది నాగయ్యా!" అన్నాడు నవ్వుతూ.

లోపలనుండి పిలుపువస్తే నాగయ్య వెళ్ళాడు. తిరిగి బయటకు వచ్చాడు. పలభైమంది మగ, ఆరుగురు స్త్రీలు కొత్తవారు వచ్చారు. వీళ్ళుగాక, స్థానికులు చాలామంది వచ్చారు. పైగా జూనియర్ ఆర్టిస్టు బ్రోకర్లు కొందరువచ్చి కలిసి మాట్లాడారు.

ఇంటర్వ్యూలు పూర్తిచేసి కనకారావు, మణ్యం బయటకు వచ్చారు. "మీ అందరికీ ఉత్తరాలు రాస్తాము" అన్నాడు హాలులోకివచ్చి. ఎంతో ఆశతో వచ్చినవారు అటుఇటు కాకుండా వెళ్ళడానికి ప్రయత్నిస్తున్నారు. కనకారావు రూం తాళం చెవులు ఇచ్చి "డైరెక్టర్ వెంట వెళ్ళి మళ్ళీ వస్తాను" అన్నాడు రామారావుతో.

నాగయ్య ముందుకువచ్చి మళ్ళీ తనని తాను పరిచయం చేసుకుని, తనవీ, తన చెల్లెలివీ ఇద్దరివీ ఫొటోలు ఇచ్చాడు. "నేను వెళ్ళిపోవాలయ్యా! అడుగో! మా పార్టనర్ అక్కడ ఉన్నాడు. నీ బాధ ఆయనకు చెప్పుకో!" అంటూ వెళ్ళిపోయాడు కనకారావు.

అంతవరకూ రామారావు వేషానికి వ్యక్తిగా భావించిన నాగయ్య, ఆశ్చర్యపోయి దగ్గరగావచ్చి నమస్కారం చేసి, తాను ఎందుకు వచ్చిందీ వివరాలు చెప్పాడు. రామారావు నవ్వుకుని లేచి "రా! రూంలో మాట్లాడదాం!" అంటూ రూం వైపుదారి తీశాడు. రూంతాళం తెరచి ఇద్దరూ కూర్చున్నారు. బజర్ నొక్కి బాయ్‌ని పిలిచి రెండుకాఫీ తీసుకురమ్మని చెప్పాడు. ఈ అట్టహాసమంతా చూసి నాగయ్యకు కళ్ళు తిరిగిపోయాయి. తమతో పాటు చదివిన వ్యక్తిగా ఇంతవరకూ ఆలోచించాడుగానీ, పెద్ద నిర్మాతగా గుర్తించలేకపోయాడు రామారావును. అందుకు క్షమాపణ కోరాడు.

"అసలు నీవు ఎప్పుడు వచ్చావు. నీ చెల్లెలు వచ్చిందా?"

"నేను ప్రస్తుతం ఇక్కడే ఉంటున్నాను. మా కుటుంబం కూడా ఇక్కడే ఉంది. మాచెల్లెలికి డాన్సు నేర్పిస్తున్నాము. నేను లారీట్రాన్స్‌పోర్ట్ సంస్థలో పనిచేస్తున్నాను. మా నాన్న రిటైరయ్యాడు. మా తమ్ముడు ఇక్కడే పచ్చయప్ప కాలేజీలో చదువుతున్నాడు" అన్నాడు నాగయ్య.

"ఔను! ఒకసారి చీరాలలో ఉండగా మీ యింటికి కూడా వచ్చాను" అన్నాడు గుర్తుచేస్తూ రామారావు.

తలూపాడు నాగయ్య. వచ్చిన కాఫీ అందుకొని తాగడం ఆరంభించారు. మా చెల్లెలు స్వర్ణ ఫేస్ అద్భుతంగా ఉంటుంది. మీరు చూసే ఉంటారు. ఫొటోజెనిక్ కూడా సరిపోయింది. కానీ, ఏ నిర్మాతా అవకాశం ఇవ్వడం లేదు. చీరాల ప్రాంతం వాళ్ళు సినిమా తీస్తున్నారని మొన్ననే మీ అడ్రసు తెలుపుతూ అక్కడి నుండి ఉత్తరం వచ్చింది. మీ ప్రకటన

కూడా చూశాను. స్థానికులు కదా అవకాశం దొరకవచ్చని ఆలోచించాను. సరిపడే పక్షంలో స్వర్ణను తీసుకరావచ్చని, నేను ఫొటోలు తీసుకవచ్చాను" అంటూ స్వర్ణ ఫొటో అతని ముందు టేబుల్ మీద పెట్టాడు.

ఆ ఫొటో నాగయ్య అక్కడని ఇట్టే కనిపెట్టాడు రామారావు. అయినా ఆ విషయం చెప్పి అతన్ని బాధపెట్టకూడదనుకున్నాడు. గతంలో అతని ఇంటికి వెళ్లినప్పుడు అక్కగా పరిచయంచేశాడు. సినిమా విషయం వచ్చేసరికి వయస్సు తగ్గించి చూపడానికి చెల్లెలిగా చూపిస్తున్నాడు.

ఫొటోతీసి టేబుల్ సొరుగులో పెట్టాడు. "తర్వాత ఆలోచిద్దాం! ఈ సంస్థ మీద ముగ్గురికి అధిపత్యముంది. మరి అందరికీ నచ్చాలికదా! నిదానంగా చూద్దాం" అన్నాడు.

"సరే! మీ యిష్టం! అందులో బలవంతం ఏముంది?మీకు సరిపడనప్పుడు మీరు మాత్రం ఏం చేయగలరు? మా నాన్నను చూసి చాలారోజులయింది.రండి! ఒకసారి మా యింటికి వచ్చి అందర్నీ చూడవచ్చు" అన్నాడు నాగయ్య నవ్వుతూ.

"అవసరమైన పనులున్నాయి. అందువల్ల కార్యక్రమాల్లో మునిగి ఉన్నాను. ఎప్పుడో సారి వస్తాలే!" అన్నాడు.

"ఒకసారి రండి! ఎంతసేపు? మరో అరగంటలో వచ్చేద్దురుగాని. ఈ రోజు ఇద్దరం కలిసి వెళ్దాం. ఎలాగూ ఆఫీసును శలవు పెట్టాను. సాయంత్రం దాకా చేసేదేమీలేదు" అన్నాడు నాగయ్య.

"సరే! మీరు వెళ్ళండి. వీలును చూసి సాయంత్రం వస్తాను" అన్నాడు కాదనలేక.

"వీలు విషయంకాదు. తప్పకుండా రావాలి" అంటూ చెయ్యిచాచాడు. చెయ్యి కలిపాడు రామారావు. నాగయ్య సంతోషంగా వెళ్ళిపోయాడు.

అంతవరకూ వారి సంభాషణ వింటున్న రంగన్న అందుకుని, "మొహమాట పెట్టి ముంచేస్తారు సార్! ఇటువంటివారిని నమ్మకూడదు" అన్నారు. తలెత్తి చూశాడు రంగన్న వైపు.

ఎవరు ఎటువంటివారో ఈ వారం రోజులలో అర్థమవుతూనే ఉన్నది. అనేక రకాల వ్యక్తులు అనేక విధాల యాచించడానికి వస్తున్నారు. సినిమాలో నటించడమంటే దేవుణ్ని దర్శించినంతగా ఉబలాటపడుతున్నారు. నిన్నటిదాకా బయట ఉండటంవల్ల తానుకూడా అంతే భ్రమపడ్డాడు. కాని, ఈ రోజు ఇది దుర్గంధమనీ, బయటి ప్రపంచంలోని అన్ని చెడులూ ఇందులోనే ఉన్నాయనీ తెలుసుకోగలుగుతున్నాడు. భర్తను తప్ప మరొకర్ని ఆశించకుండా బతికే ఆడదాన్ని కూడా, సినిమాలో అవకాశం ఇస్తామనే పేరుతో లొంగదీసే అవకాశంఉంది. సాధారణ స్త్రీ విషయంలో ఇక అడ్డంకులేమిటి? ఇంత నీచమైన మహాసముద్రంలో తానూ వారిలాగే తయారు కాక తప్పదు. ఆదాయం ఏమీ లేకున్నా ఈ ఫీల్డ్ ఎందుకు విడువలేకపోయాడో, రాత్రి సరిత చెబుతున్న కథలు విని అర్థం చేసుకున్నాడు. సరితను తాను అనుభవించాడు. సరిత కోరిన వేషం తాను ఇవ్వగలడా? అసంభవం! ఇలా అనుభవించిన ప్రతి ఒక్కరికీ వేషం ఇవ్వవలసి వస్తే, కనకారావు ఎంతమందికి ఇస్తాడు? ఏదేమైనా సరితతో సినీరంగంలో తన





పతనం ప్రారంభమైందనుకున్నాడు. అది తప్పనిపరిస్థితి అనికూడా తెలుసుకుంటున్నాడు.

ఆలోచిస్తూ పడుకున్న రామారావును చూసి తలపంకించి తన పనిలో మునిగాడు రంగన్న.

స్క్రిప్ట్ పూర్తి కావస్తున్నది. మరో నాలుగు రోజులు పోరాడితే సరిపోతుంది. ఆ తర్వాత అందర్నీ ఎన్నుకొని షూటింగ్ ప్రారంభించవలసి ఉంటుంది. ఈ స్క్రిప్ట్ పూర్తయితే తన బాధ్యత సగం తగ్గిపోతుంది. స్క్రీన్‌ప్లే అప్పటికప్పుడయినా చేసుకోవచ్చు. మోహినికి హీరోయిన్ వేషం కాకున్నా ఏదో ఒక ముఖ్య పాత్ర అయినా ఇప్పించాలనుకున్నాడు. మోహిని అతని ఉంపుడు గత్తె కూతురు. కనకారావు వల్ల లాభం లేదు. ఆ చెయ్యి సినీరంగంలో ఇప్పటికే మెలితిరిగింది. చాలామంది తోడుఅయి ఉంటారు. అందువల్ల ఎవరికీ హామీ ఇవ్వకుండా తప్పించుకుంటాడు. ఇతను కొత్త వ్యక్తి. మోహినిని ఒకసారి పరిచయం చేసి, ఇద్దర్నీ కలిపితే చచ్చినట్లు ఒప్పుకుంటాడు ఈ రామారావు అనుకున్నాడు రంగన్న.

సాయంత్రం నాలుగ్గంటలకు లేచి స్నానంచేసి, గుడ్డలు మార్చుకుని బయటకు కదిలాడు రామారావు. అతడితో పాటు రంగన్న లేచి బయటకు వచ్చాడు. "రేపు ఉదయం కలవండి. నాకు పనిఉంది వెళుతున్నాను" అన్నాడు తాళం వేస్తూ.

"మీరు మా యింటికి ఒకసారి రండి సార్! లేకుంటే ఇప్పుడే వెళ్దాంరండి. మా అతిథ్యం స్వీకరించండి" అన్నాడు రంగన్న నవ్వి.

"తొందరేమిటి? తర్వాత చూద్దాం" అన్నాడు రామారావు.

"సరే! నేను వెళ్తున్నాను. ఉదయం కలుస్తాను. వీలుంటే రేపు రావడానికి ప్రయత్నించండి" అంటూ వెళ్ళాడు రంగన్న.

కౌంటర్‌లో సరోజకు తాళంచెవి ఇచ్చి హోటల్‌లోకి వెళ్ళి టిఫిన్ చేశాడు. బయటకు వచ్చి బిల్లు చెల్లించి ఆవరణలో ఉన్న టాక్సీని కేకేసి వస్తూనే ఎక్కాడు.

కృష్ణదాసు రోడ్డులోనున్న నాగయ్య ఇంటిముందు దిగి, టాక్సీకి డబ్బులిచ్చి పంపాడు. ఇల్లు పెద్దది కాదు, డాబా! ముందుకు అడుగు వేశాడు. అప్పుడే బయటకు రాబోతున్న నాగయ్య తండ్రి సదానందం ఇతన్ని చూస్తూనే సంతోషంగా "రండి రండి" అంటూ ఆహ్వానించాడు. నవ్వుతూ ఆయనవెంట లోనికి అడుగు పెట్టాడు. ముందు రూంలో నాలుగు కుర్చీలు, ఒక సోఫా ఉన్నాయి. కూర్చుంటూనే "నాగయ్య మీ విషయం చెప్పాడు. ఉదయం శలవు పెట్టాడు కనుక నైట్ ఓవర్ డ్యూటీ వస్తే వెళ్ళాడు. అమ్మాయ్ స్వర్ణా!" అంటూ కేకేశాడు.

స్వర్ణ లోపల్నుంచి హాలులోకి వచ్చి రామారావుని చూసింది. నాగయ్య ఉదయం వివరాలు చెప్పాడు. వెంటనే గుర్తించి నమస్కారం చేసింది. రామారావు ఆమె వైపు చూసి ప్రతి నమస్కారం చేశాడు.

"ఇతడే రామారావు" అంటూ పరిచయం చేశాడు సదానందం.

"నాకెందుకు తెలియదునాన్నా! చీరాలలో ఉండగా మన ఇంటికి వచ్చాడుగా!" అంది కలుపుగోలుతనంగా చిరునవ్వు నవ్వుతూ.

లోనికి వెళ్ళింది స్వర్ణ. అల్మారాలో ఉన్న ఫైలు తీసుకవచ్చి స్వర్ణ ఫొటోలు

ఒక్కొక్కటీ తీసి చూపించాడు సదానందం. అందులో కొన్ని అర్ధనగ్నంగా ఉన్నవీ, వివిధ కోణాలనుండి తీసిన ఫొటోలూ ఉన్నాయి. ఫైలు మూసి, "అమ్మాయి సినిమాకు బాగా పనికి వస్తుందని చాలామంది డైరెక్టర్లు అన్నారు. జూనియర్ వేషాలు ఇస్తామన్నారు. కానీ నేనే వ్యతిరేకించాను. దొరికితే హీరోయిన్ పాత్రే దొరకాలి అనుకున్నాను" అన్నాడు సదానందం.

ఆయన భార్య, చిన్న కొడుకు, కోడలు వచ్చి చూసి పలుకరించారు. అందరికీ నమస్కారాలు పెట్టాడు నవ్వుతూ. అందరూ వెళ్ళిపోయారు. స్వర్ణ కాఫీ తీసుకొని వచ్చి తండ్రికి, రామారావుకు ఇచ్చింది. కాఫీ తాగుతూ స్వర్ణను ఓరకంటితో చూశాడు. స్వర్ణ చూపులేకాదు సదానందం చూపులు కూడా తనమీదనే ఉన్నాయని అతనికి తెలుసు.

కాఫీ తాగి "వస్తానండి!" అంటూ లేచాడు.

"రాత్రి అన్నం తిని వెళ్ళువుగానీ, ఉండండి" అన్నాడు సదానందం.

"ఇతరత్రా పనులున్నాయండీ! అందువల్ల వెళ్ళక తప్పదు"

"రేపు ఎక్కడికి వెళ్ళాలి?"

"ఈరోజు చెప్పలేం! రేపటి పరిస్థితి ఎట్లా ఉంటుందో?"

"రేపు సాయంత్రం రండి. అందరం కలిసి షికారుగా బీచ్‌కువెళ్దాం" అన్నాడు సదానందం.

"చూద్దాం" అన్నాడు రామారావు.

"తప్పకుండా రండి. అందరం కలసి వెళ్ళొచ్చు" అంది స్వర్ణ అర్థింపుగా చూస్తూ. ఆమెవైపు చూడకుండా తల వంచుకుని "వస్తాను" అంటూ బయటకు వచ్చాడు. బిన్నీ గేటు వరకూ నడిచి వచ్చాడు.

వెళ్తున్న టాక్సీని పిలిచి టాక్సీ ఎక్కి "మాంబళం పద" అన్నాడు.

మాంబళంలోని కుట్టుపిళ్లై వీధిలోని రంగన్న ఇంటివద్ద దిగాడు. అప్పుడే రంగన్న ఇంటికి వచ్చి స్నానంచేసి, బయటకు వచ్చాడు. హఠాత్తుగా వస్తున్న రామారావును ఆశ్చర్యంగా చూసి తేరుకుని "రండి" అంటూ ఆహ్వానించాడు. లోనికివచ్చి కూర్చున్నాడు రామారావు.

ఒక లావుపాటి ఆవిడ వచ్చి అతన్ని చూసి ప్రశ్నార్థకంగా రంగన్న వైపు చూసింది.

"ఈమె నా భార్యండీ! పేరు అమ్మణ్ని! తమిళ్ళలెండి. ఈయనే నేను మాటలు రాస్తున్న సినిమాకు నిర్మాత" అంటూ పరిచయం చేశాడు తమిళంలో. వచ్చీరాని తెలుగులో మాట్లాడుతూ ఆమె నమస్కారం పెట్టింది.

"పాప ఇంట్లో ఉందా?" అన్నాడు రంగన్న.

"పక్క ఇంట్లో ఉన్నట్లుంది. పిలిపిస్తాను" అంటూ ఆమె లోనికి వెళ్ళింది. మరో అర్థగంట తర్వాత కాఫీతో ఇరవై ఏండ్ల అమ్మాయి అక్కడికి వచ్చింది. రంగన్న పరిచయం చేస్తూ "మా అమ్మాయి మోహిని" అన్నాడు. మోహిని తలవంచి అతడికి నమస్కారం చేసింది. 'చాలా అందంగా ఉంది' అనుకున్నాడు రామారావు. అందించిన కాఫీ తాగుతూ ఆమెనే చూస్తూ కూర్చున్నాడు. రంగన్న లోనికి వెళ్ళాడు.

"కూర్చో!" అన్నాడు రామారావు మోహినిని చూస్తూ. సిగ్గుతో మెలికలు

 

తిరుగుతూ కుర్చీలో కూర్చుంది.

"పెళ్ళయిందా?"

తలూపింది కాలేదన్నట్లు.

"ఇంతకుముందు సినిమాలలో నటించావా?"

"ఒక తమిళం, రెండు తెలుగు సినిమాలలో చిన్న పాత్రలు దొరికాయండీ! మరీ అంతచిన్న పాత్రలు వేయడం ఇష్టంలేదు. మరి దొరికిందేదో పోగొట్టుకోలేక వేశాను" అంది.

"ఉదయం షోకు వెళ్ళావటకదా అమ్మాయ్" అన్నాడు రంగన్న అక్కడికి వచ్చి. మోహిని తలెత్తి రంగన్న వైపు చూసి భావం గ్రహించి "అవును" అంది తలూపుతూ.

"సరే! నీవు ఇంటివద్దే ఉండు. నేనూ, మీ అమ్మా సినిమాకు వెళుతున్నాము" అని రామారావుతో "మీరిక్కడే ఉండండి. భోజనం ఇక్కడే చేయండి. అమ్మాయి ఆతిథ్యం ఇవ్వడంలో వెనుకంజ వేయదులెండి! మరో మూడు గంటల్లో మేమూ వస్తాము" అంటూ రంగన్న, భార్య బయటకు వెళ్ళిపోయారు.

తమను ఒంటరిగా విడువడానికి వారు వేసిన ప్లాను ఇది అన్న విషయం రామారావుకు అర్థమవుతూనే ఉంది. సినీ జీవితంలో దానికదే దొరికివచ్చే ఆనందం విడిచిపుచ్చాలని అతడు అనుకోవడం లేదు. ఇందులో కాలుపెట్టిన వాడు తిరిగి నీతిగా బయటకు పోవడం సాధ్యంకాదని కొంచెం అనుభవమే చెప్పగలిగింది.

"ఇక్కడ కూర్చోవాలంటే బోర్ కొడుతుంది. ఉదయంనుండీ కూర్చోవడమే! పానగల్ పార్క్‌కు వెళ్దాం వస్తావా?" అన్నాడు మోహిని కళ్ళల్లోకి చూస్తూ.

మోహిని తలూపి పావుగంటలో అలంకరించుకుని వచ్చింది. రామారావు బయటకు వచ్చాడు. మోహిని తాళం వేసి తాళంచెవి బ్యాగ్‌లో వేసుకుంది.

ఇద్దరూ టెర్మినస్‌వరకూ వచ్చి టాక్సీ ఎక్కారు. పానగల్ పార్కు వద్ద దిగి లోనికి వెళ్ళారు. పచ్చని చెట్లమీద లైట్ల వెలుతురు పడి మెరుస్తున్నది. జనం పలుచగా ఉన్నచోట కూర్చున్నారు.

"మానాన్న మాటలు రాయడం పూర్తయిందా?" అంది మాట్లాడటానికి ప్రయత్నిస్తూ.

"కావస్తున్నది. తొందర్లోనే సెట్ మీదకు తీసుకెళ్ళాలనుకుంటున్నాం. ఏం! నీవూ పాత్ర వేస్తావా?"

సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ తల ఊపి "అవకాశం ఉంటే తప్పకుండా!" అంది.

"ఎలాంటి పాత్ర కావాలి? హీరోయిన్ పాత్ర తప్ప వేయవా?"

"ఏదో ఒకటి. ముందు అవకాశం ఇప్పించండి" అంది అతని కళ్ళల్లోకి చూసి.

"మనమూ సినిమాకి వెళ్దామా?"

"వద్దు. సినిమాలు చూడాలంటే నాకు తలనొప్పి. మీకిష్టమయితే మరెక్కడికైనా సరే వెళ్దాం" అంది గడ్డి తుంచి కొరుకుతూ.

లేచాడు రామారావు. అతనితో పాటు నిలబడింది మోహిని. ఇద్దరూ రోడ్డుమీదకు వచ్చి పాండీ బజారువైపు నడిచారు. 'శాంతి' హోటల్‌లోకి దారితీశారు.

"ఏం తీసుకుంటావ్?"

"మీయిష్టం!" అంది మోహిని చుట్టూ చూసి.

సర్వర్ వస్తూనే రెండు ప్లేట్లు బాసుంది, మిక్చర్ తీసుకురమ్మన్నాడు. టిఫిన్ తినడం పూర్తి చేసి, బయటకు వచ్చి "నేను రూంకు వెళుతున్నాను. నిన్ను మీ యింటి దగ్గర డ్రాప్ చేసి వెళ్తాను" అన్నాడు ఆమెనుండి జవాబు రాబట్టాలని చూస్తూ.

"నేను రాకూడదా మీ రూంకు?" అంది తలవంచుకుని ఓరగా చూస్తూ.

"నీ యిష్టం!" అని టాక్సీని పిలిచాడు.

టాక్సీ గుప్తాస్ లాడ్జీ దగ్గర ఆగింది. దిగి కౌంటర్ దగ్గర రూం తాళం చెవి తీసుకుని పైకి వెళ్లారు. ఇంకా కనకారావు రాలేదు. ఈరోజు వస్తాడన్న నమ్మకమూ లేదు. ఈ వారం రోజుల్లో రాత్రిపూట ఎప్పుడూ రూంలో ఉండలేదు. వచ్చినా బయటనే పడి ఉంటాడు. లేదా, మరో రూం తీసుకుంటాడు లెమ్మనుకున్నాడు రామారావు.

రూంలోకి అడుగు పెట్టి చుట్టూ చూస్తూ "చాలా బాగుంది! రూం అద్దె ఎంత?" అంది.

"రోజుకు నలభై రూపాయలే!" అన్నాడు అది ఓలెక్క కాదన్నట్లు. తర్వాత "తాళం చెవి నీదగ్గరుంది కదా! మరి మీ అమ్మా నాన్న వస్తే ఎట్లా?" అన్నాడు.

"వారి వద్దకూడా ఇంకో తాళంచెవి ఉంది."

"రాత్రి ఇంటికి వెళ్ళకుంటే మీవాళ్లు కంగారుపడరా?"

జవాబుగా అతని కళ్లలోకి మత్తుగా చూసింది. "వారికి అంతా తెలుసు" అంది రూం తలుపువేసి మత్తుగా ఉన్న మోహిని నడుము చుట్టూ చెయ్యి వేశాడు. అతని చేతుల్లో వాలిపోయింది. ఆమె మీదకు ఒరిగి, చేతుల మీద ఎత్తుకొని మంచం వైపు నడిచాడు. మోహిని అరమోడ్పు కన్నులతో చూస్తున్నది.

• • •

సాయంకాలం నాలుగంటలకే సదానందం ఇంటి వద్దకు వెళ్ళాడు రామారావు. ఎదురు చూస్తున్నట్లున్నాడు సదానందం. టాక్సీ దిగటంతోనే ఎదురు వచ్చి "చెప్పినట్లు వచ్చారే!" అన్నాడు నవ్వుతూ.

లోనికి వచ్చి కూర్చున్నాడు రామారావు జవాబుగా నవ్వి.

"మావాళ్ళందరు సినిమాకు వెళ్ళాలన్నారు. మీతో బీచ్‌కు వెళ్ళామని అనుకున్నాం కదా! అందువల్ల సినిమా మానుకుని కూర్చున్నాం" అన్నాడు అతని కొరకే అందరూ ఉన్నారన్న మాట ధ్వనిస్తూ. ఇదంతా ఉబ్బించే గౌరవం అని ఈపాటికే అర్థమయింది రామారావుకు. అయినా అందరితోనూ కలిసిపోవాలనే నిర్ణయంతో ఉన్నాడు.

స్వర్ణ స్టూల్‌మీద ఫలహారం ప్లేటు, గ్లాసుతో నీళ్ళు పెట్టింది. తండ్రికి మరొక ప్లేటు ఇచ్చింది.

"నాగయ్య మీకొరకు ఉందామని అనుకున్నాడు. పైనుండి చెక్కింగ్ ఆఫీసరు వచ్చాడట. అకౌంట్లన్నీ చూపించాలి, రాలేనని ఫోన్ చేశాడు. బాధపడుతున్నానని కూడా మీతో చెప్పమన్నాడు" అన్నాడు సదానందం. తల ఊపాడు రామారావు.

"నిజానికి నాకూ తీరిక లేదండీ! స్క్రిప్ట్ పూర్తికాలేదు. అయినా మీతో చెప్పాను గనుక, మాట కొరకు రాక తప్పింది కాదు" అన్నాడు.

 

"మంచిది" అన్నాడు సదానందం. ప్లేటు తీసుకుని వెళ్ళి, కాఫీ తెచ్చింది. స్వర్ణ. "అందరూ ప్రయాణం కండి వెళ్దాం" అన్నాడు స్వర్ణతో సదానందం. స్వర్ణ తలూపి లోనికి వెళ్ళింది.

స్వర్ణ తమ్ముడు టాక్సీని పిలిచాడు. టాక్సీ వచ్చి నిలుస్తూనే డ్రైవరు తల బయటకు పెట్టి చూసి "ఇక్కడున్నారేమిటి సార్?" అన్నాడు రామారావుతో. ముఖం చిట్లించి చూశాడు రామారావు.

"నన్ను గుర్తుపట్టలేదా సార్! వారం రోజుల కిందట సెంట్రల్ నుండి గుప్తాస్ లాడ్జీ వద్ద మిమ్మల్ని దించాను. మాది అమ్మన బ్రోలు. నా పేరు ఖాదర్!" అన్నాడు డ్రైవర్ నవ్వుతూ.

రామారావు తెలిసిందన్నట్లు తలూపి నవ్వుతూ "మా స్నేహితుని ఇల్లు ఇది" అన్నాడు వచ్చి డ్రైవర్ ప్రక్క సీటులో కూర్చుంటూ. అందరూ బయటకు వచ్చి టాక్సీ దగ్గర నిలబడ్డారు. స్వర్ణ ఫ్రంట్



సీటులో రామారావు పక్కన కూర్చుంది. వెనుక డోర్ తెరుచుకుని ఎక్కాలనుకుంటుండగా, పక్క ఇంటివాళ్ళు పిలిచారు ఫోన్ వచ్చిందంటూ.

సదానందం వేగంగా వెళ్ళాడు.

ఐదు నిమిషాలలో తిరిగి వచ్చి "సారీ రామారావుగారూ! మా కోడలు తల్లి, మా చెల్లెల్ని గుండె నొప్పితో మైలాపూర్ హాస్పిటల్‌లో చేర్చారట! వెంటనే రమ్మన్నారు. సరే! మేము వెళ్తాము. స్వర్ణను తీసుకుని వెళ్ళిరండి" అన్నాడు విచార వదనంతో. రామారావు తలూపి స్వర్ణ వైపు చూశాడు. స్వర్ణ డోర్ అద్దం మీద వేలితో రాస్తూ అద్దాన్ని చూస్తున్నది.

"పోనీ ఖాదర్!" అన్నాడు రామారావు. టాక్సీ ముందుకు కదిలింది. వెనుక నీలబడి వాళ్ళు చూస్తున్నట్లు గమనించాడు.

బేసిన్ బ్రిడ్జిదాటి, ఎస్ప్లనేడ్ మీదుగా హైకోర్టుదాటి బీచ్ రోడ్డు వైపుగా సాగింది టాక్సీ. బీచ్ ముందుకు తెచ్చి నిలిపాడు ఖాదర్.

ఇద్దరూ కిందికి దిగారు. డబ్బుఅందుకొంటూ "నాకేదయినా చిన్న వేషం దొరికితే వేద్దామని ఉంది సార్! అందుకే అంత దూరంనుండి వచ్చాను. వేషం దొరకక పోవడంతో, ఉన్న డ్రైవరు వృత్తితో బతుకుతున్నాను" అన్నాడు ఖాదర్.

"ఇంకా సమయం చాలాఉంది; చూద్దాంలే!" అన్నాడు ముందుకుకదుల్తూ. అతనితో పాటు స్వర్ణకదలింది. వివిధ రకాల దుకాణాలు, విపరీతంగా వస్తున్న జనం, పేవ్‌మెంట్లమీద వివిధ ఫొటోలు అంతా కోలాహలంగా ఉంది.

రెండు పొట్లాల ఉప్పుశనగలు తీసుకుని స్వర్ణకు ఒకటి ఇచ్చాడు.

తీసుకుంటూ "ఉప్పుశనగలు మీకు ఇష్టంగా ఉన్నట్లుంది" అంది నవ్వుతూ.

"అవును. చీరాలలో ఉండగా రోజుకు సోలెడు నమిలితే గానీ తృప్తిరేది కాదు. ఒక్కోపూట వాటికొరకు అన్నం మానుకునేవాడిని."

"అయ్యో!" అంది హాస్యంగా అతని ముఖంలోనికి చూసి నవ్వుతూ. సముద్రం అలల హోరు విన్పిస్తున్నది. అలకు దగ్గరలో పడవకు ఆనుకుని కూర్చున్నారు సముద్రం వైపుచూస్తూ.

"చీరాలలో ఎన్ని సంవత్సరాలున్నారు ?" అంది స్వర్ణ.

"డిగ్రీ అక్కడే పూర్తి చేశాను. ఆ తర్వాత ఇల్లుచేరి సుఖంగా కాలక్షేపంచేద్దామనుకున్నాను. మా పెదనాన్న కొడుకు నన్ను ఇక్కడికి తెచ్చి నిలువునా ముంచేశాడు" అన్నాడు నవ్వుతూ స్వర్ణ ముఖంలోనికి చూసి. పల్చటి అమెరికన్ జార్జెట్ చీరలోసహజంగానే అందంగా ఉన్న స్వర్ణ మరింత అందంగా కన్పిస్తున్నది. నుదుటి మీద ఎర్రటి పెద్దబొట్టు,చెవులకు సన్నటి జూకాలు, మెడలో ఒంటిపేట గొలుసు. ఆమె తమ్మునికి పెళ్ళయింది. ఆమెకు పెళ్ళి కాలేదా ఇంకా ?

"మీకు పెళ్ళి కాలేదా స్వర్ణా?"

అతనివైపు చూసి, తలతిప్పి సముద్రం వైపుచూస్తూ "అయిందండీ ! విడాకులు కూడా అయ్యాయి" అంది. ఆమె ముఖం మ్లానంగా ఉంది.

"కారణం?" ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

"వట్టి తాగుబోతు ! తాగివచ్చి అనుమానంతో బాదుతుంటే ఎంతసేపని సహించగలను ?"




"మరో పెళ్ళి చేసుకోవచ్చుకదా?"

స్వర్ణ ఆలోచిస్తూ "ఆతర్వాత ఇక్కడికి తెచ్చారు. నాకు టైపుతెలుసు. ఒక ఆఫీసులో టైపిస్టుగా పనిచేస్తున్నాను. అయినా సినిమాల్లో నటించాలన్న ఆశతో డ్యాన్సు స్కూలుకు వెళ్ళి నేర్చుకుంటున్నాను" అంది తలవంచుకుని.

"నీవు ఉద్యోగం చేస్తున్నట్లు నాగయ్య చెప్పలేదే?"

"ఏమో ?" అంది ఇసుకలో వేలితో రాస్తూ.

చీకటి పడుతున్నది. రోడ్డు వెంట లైట్లు వెలిగాయి. అన్నశాల చుట్టూరంగురంగుల లైట్లు వెలుగుతున్నాయి. అంగళ్ళ ఎత్తి వేస్తున్నారు. జనం రావడం తగ్గి వెళ్ళిపోవడం ఎక్కువయింది.

"మీ సినిమాలో నాకేదయినా అవకాశం ఇవ్వగలరా?" అంది అతని దగ్గరగా జరిగి. సముద్రపుహోరు మరింత ఎక్కువవుతున్నట్లుంది. స్వర్ణ జడలోని మల్లెలువిచ్చుకుంటూ సువాసనల్ని వెదజల్లుతున్నాయి.

"నా ఒక్కడిదీ ఏమీలేదు కదా! మరి కొందరున్నారు. అందరి ఇష్టం బట్టి ఉంటుంది పరిస్థితి."

"ప్లీజ్ ! దయచేసి ఏ చిన్న వేషం ఇచ్చినా వేసాను. మనం ఒకే ప్రాంతం వాళ్ళం. మీనుండి అవకాశం దొరుకుతుందని నాకు ఆశగా ఉంది" అంది మరింత దగ్గరగా జరుగుతూ. స్వర్ణ చేతులు అతని నడుముకు రాసుకుంటున్నాయి. ఆమె ముఖం అతడి ముఖం వద్ద ఉంది.

ఆమె నడుంచుట్టూ చేతులువేసి దగ్గరగా లాక్కున్నాడు. స్వర్ణ అభ్యంతర పెట్టలేదు. అవకాశం కల్పిస్తూ జాకెట్ పిన్నులు తొలిగించింది.

బీచ్ నిర్మానుష్యమవుతున్నది. తమ లాంటివాళ్ళు కొందరు తప్ప మరింకెవరూ లేరని గ్రహించి, లేచినిలబడ్డాడురామారావు. స్వర్ణ చీర సవరించుకుంటూ లేచి, జాకెట్ పిన్నులు పెట్టుకుంటూ అతనివైపు చూసింది.

రోడ్డుమీదకు వచ్చారు. గడియారం ఎనిమిది చూపిస్తున్నది. ఎదురుగా వున్న 'హోటల్ బుహారి'లోకి దారితీశాడు. ఫామిలీ రూంలోకి వెళ్ళారు ఇద్దరూ ! ప్రత్యేకంగా ఇద్దరి కొరకు సీట్లున్నాయి. వెయిటర్ వస్తూనే కోడిపులావ్, ఆమ్లెట్ తీసుకురమన్నాడు.

సిగ్గుతో అతనివైపు చూసి, తిరిగి తల దించుకున్నది స్వర్ణ.

"బాధపడుతున్నావా స్వర్ణా?" అన్నాడు చెయ్యి నిమురుతూ.

అడ్డంగా తల ఊపింది. సర్వర్ వచ్చి ప్లేట్లు సర్దివెళ్ళాడు.

భోజనం చేసి బయటకు వచ్చారు. టాక్సీని పిలిచాడు.

"నిన్ను మీ యింటిదగ్గర దింపి, నేను వెళ్తాను స్వర్ణా" అన్నాడు. అతని చెయ్యి పట్టుకుంది స్వర్ణ.

"ప్లీజ్! మీ రూంలో కాలంగడపడానికి అవకాశం ఇవ్వరూ ఈ ఒక్కరాత్రి ?" అంది ముఖంలోకి చూస్తూ అభ్యర్థనగా.

ఆ మాట తాను అనవలసింది. ఒకఆడపిల్లనుండి వస్తే వ్యతిరేకించడం అవమానకరమని రామారావుకు తెలుసు. టాక్సీలో కూర్చుని "రాయపేట హైరోడ్డుకు పద" అన్నాడు.

మత్తుగా స్వర్ణ అతని చేతుల్లో వాలి మెడచుట్టూ చేతులు వేసి, తలవంచి, చుంబించింది. విడిపించుకొని, లేపి కూర్చోబెట్టాడు.

"ఇది రూంకాదు టాక్సీ" అన్నాడు

తొడగిల్లి చెవిలో.

స్వర్ణ సిగ్గుపడింది.




ఉస్మాన్ రోడ్డుకు ఆఫీసు మార్చారు.

రోజుకు నలభై రూపాయల చొప్పున నెలకు పన్నెండు వందల రూపాయలు హోటల్ బిల్లు అవుతుంది. అంత చిన్న రూంకు పన్నెండు వందలు చెల్లించే కంటే, బయట చూసుకోవడం మంచిదని పించింది. నెలకు వెయ్యి రూపాయల అద్దెతో, రెండంతస్థుల మేడ దొరికింది. విశాలమైన హాలు, నాలుగు గదులు, బాత్ రూంలు, రెండు లెట్రిన్స్ కింద, పైన విశాలమైన హాలు, రెండు గదులు, బాత్ రూం లెట్రిన్ సౌకర్యాలున్నాయి.

ఫర్నిచర్‌కు నాలుగువేలు ఖర్చయింది.

మద్రాసు వచ్చి పదిహేను రోజు లయింది. కనకారావుకు అంతకు ముందే అనుభవం ఉంది. ఏ అనుభవమూలేని రామారావు కూడా సినీ ట్రిక్కులు, మాయోపాయాలు, లాలింపులు, బుజ్జ గింపులు, స్నేహాలు, మోసాలు అర్థం చేసుకుంటున్నాడు. తల్లిదండ్రులే స్వయంగా కూతుళ్లను తార్పుడు పనికి అప్పగించడం, వారు తెచ్చే డబ్బుతో జీవితాన్ని గడపడానికి ప్రయత్నించడం మొదట విడ్డూరంగా కన్పించినా, తర్వాత మామూలయింది.

మాటలు - పాటలు రాయడం పూర్త యింది. ప్రధాన పాత్రలు ఇద్దరు హీరో యిన్‌లు, హీరో, సైడ్ యాక్టర్స్ ఇద్దరు స్త్రీలు, ముగ్గురు పురుషులవి ఉన్నాయి. విలన్ లేడు. పూర్తి వివరాల్తో కథ రాశారు.

అందులో ఒక చిన్న పిల్లవాడు. గ్రామంలో జరుగుతున్న బ్రహ్మాండమైన జాతరచూసి సంతోషిస్తూంటాడు.చివరలో జాతర పోతును నరికి వేస్తారు. అది చూసి ఆ పిల్లవాడు ఆవేశం పొందుతాడు. అసహ్యించుకుంటాడు. సంతోషం కొరకు జాతర చేయడం మంచిదే! కాని, మరొక ప్రాణిని చంపడం మంచిదికాదు. నిజంగా దేవుడు ఉంటే ఈ విధంగా జరగదని విశ్వసిస్తాడు. దేవుడు రక్తం కోరడనీ, అలా కోరేవాడు దేవుడు కాదనీ ఆలో చిస్తాడు. కోపంతో ఊరి వెలుపల ఉన్న పోలేరయ్య, పెద్దమ్మ, చిన్నమ్మల విగ్ర హాల మీద మూత్రం పోస్తాడు. అందుకు గాను తల్లిదండ్రులు దండిస్తారు. చిన్న ప్పుడు నాటుకున్న ఆ గాయం ఎల్లప్పుడూ అతని మనస్సులో నిలబడుతుంది. 'దేవుడు లేడు' అంటూ నిర్ణయించు కున్నాడు. గ్రామంలో అందరూ అతన్ని వెర్రివాడుగా చూస్తుంటారు.

అదే గ్రామంలో చేపలు పట్టుకుని బతికే నరసయ్య కూతురు రామితో చెరువు కట్టవద్ద పరిచయమౌతుంది. పరిచయం ప్రణయంగామారి, తనకంటే నాలుగు సంవత్సరాలు వయస్సులో పెద్దయిన రామిని దగ్గరికి తీసుకుంటాడు. ఆమె గర్భవతి అవడంతో, రాత్రికి రాత్రే ఊరువిడిచి ఇద్దరూ పారిపోతారు. కొంతకాలం మద్రాసులో తనకు తెలిసిన

వ్యక్తులవద్ద కాలం గడుపుతూ ఉంటాడు. రామి మగపిల్లవాణ్ని ప్రసవించి చని పోతుంది. ఈ విషయాలు తెలిసి హీరో అక్క, అమ్మ మద్రాసు వస్తారు. ఆపిల్ల వాడిని తమకు ఇవ్వమనీ, ఇంటికి తీసుకు వెళ్ళి పెంచుకుంటామనీ నచ్చచెబుతారు. వినడు. తల్లి గ్రామం వెళుతుంది. పక్క ఇంటిలో ఉన్న మతాంతర దంపతుల కూతురు సుగుణ అనే అమ్మాయితో అక్కకు పరిచయమౌతుంది. తన తమ్ముడికి ఆ అమ్మాయిని కట్టబెట్టాలని ఆలోచిస్తుంది. సుగుణ తల్లిదండ్రులు ఆ యిష్టా యిష్టాలు సుగుణమీదనే తోస్తారు. రెండవ భార్యగా ఉండడానికీ, పిల్లవాడికి తల్లి కావడానికీ అంగీకరిస్తుంది. కారణం, ఆపిల్లవాడు సుగుణ చేతుల్లోనే పెరుగుతున్నాడు. పెళ్ళయిపోతుంది. సుగుణ దైవభక్తిగలది. ఇంటిలో పటాలు ఏమీ లేకపోవడం చూసి, కొన్ని పటాలు కొనితెచ్చి ఇంట్లో అమరుస్తుంది. హీరో మండిపడి అన్నీ పగలగొడతాడు. ఆమె ఎంత చెప్పినా వినకుండా, ఈ ఇంట్లో దేవుడనేవాడు ఏరూపంలోనూ కన్పించ కూడదంటాడు. సుగుణ జ్వరంతో మంచంపడుతుంది. ఆమెతోపాటు పిల్ల వాడూ మంచంపడతాడు. డాక్టర్లు పెదవి విరిచారు. ఈ పరిస్థితిలోనయినా దేవుణ్ని అంగీకరించమనీ, దేవుణ్ని అంగీకరిస్తే పిల్లవాడు బతుకుతాడనీ సుగుణ బతి మాలుతుంది. విసిగిపోయిన హీరో చివరకు "పిల్లవాడూ, నీవూ బతకడమే జరిగితే దేవుడున్నాడని నమ్ముతాను" అంటాడు. ఆ రాత్రి గడవకముందే ఇద్దరూ చనిపో తారు.

కథా సారాంశం అది.

విలన్ ఉండడం మంచిదనీ, విలన్, హీరో రెండుసార్లయినా ఫైటింగ్ చేస్తేనే సినిమా సక్సెస్ అవుతుందనీ, డాన్సులు కూడా ఉండాలనీ, హాస్యం తగుపాళ్ళలో ఉండాలనీ మణ్యం ఎంత చెప్పినా రామారావు వినలేదు. "చెత్త సినిమాలు తీయడంకంటే ఇంటికి వెళ్ళిపోవడం మేలు'' అన్నాడు.

''ఈవిధంగా సినిమాతీస్తే, తీసిన తర్వాత ఇంటికి వెళ్లాలంటే ఛార్జీకి డబ్బులు కూడా దొరకవు" అన్నాడు మణ్యం.

''బాధపడను. మా కథ ట్రాజడీగా ఉండాలి. నిజాన్ని ప్రతిస్పందించాలి. వెకిలికూతలు, వెకిలి నటన అవసరంలేదు" అన్నాడు రామారావు.

''మీఖర్మ!"అంటూలేచాడు మణ్యం. కనకారావును బయటకుపిలిచి "ఏ అను భవం లేనివానికి నాయకత్వం అప్పగించి పక్కకు తప్పుకుంటున్నారేమిటి మీరు? ఆయన ఏదో ఊహాలోకాలలో తేలియాడు తున్నాడు. సినీజీవితంలో అలాంటి కథలు తీస్తే, అందులో హీరోలాగానే ఈ హీరో కూడా అవుతాడు'' అన్నాడు.

"మేం లోబడ్జెట్ చిత్రం తీద్దామను కున్నాం. అదిన్నీకళాఖండంగా తీయాలని మా ఉద్దేశం! రామారావు అమాయకుడేం కాదు. ఈ పదిహేను రోజులలో వాడు సినిమారంగంలో సాధించిన విజ్ఞానం నాకే ఇంతవరకూ అర్థంకాలేదు. వాడు త్వరలోనే పైకి వెళ్ళగలడు. అందువల్లనే వాడికే ప్రొడక్షన్ బాధ్యత అంతా అప్ప గించాను" అన్నాడు కనకారావు.

''మీయిష్టం! లాభనష్టాలు భరించే వారు మీరయితే మధ్యలో నాకేం! కానీ, తీసిన సినిమా దెబ్బతింటే, దర్శకుడు మళ్ళీ తేరుకోలేడు. అందువల్ల మీ

సినిమాప దర్శకత్వం నావల్లకాదు. మరొకరిని ఎన్నుకోండి" అని మణ్యం వెళ్ళిపోయాడు. లోపలకువచ్చి రామారావుతో చెప్పాడు కనకారావు.

"పోనీ మరొకడిని వెతుక్కుందాం! అంతేగానీ, మన ఆశయాలు చంపి సినిమా తీయడమెందుకు?" అన్నాడు రామారావు.

రంగన్న వచ్చాడు. "మణ్యంగారు దర్శకత్వం మానుకుంటామన్నారు. ఏమయింది?" అన్నాడు ఆదుర్దాగా.

"కథ నచ్చడం లేదట. డబ్బు మేం ఖర్చుపెట్టి, అతడు చెప్పినట్లు వినడం నాకూ నచ్చదు!" అన్నాడు రామారావు.

నాగిని మోహినికి అడ్డు అనుకుంటున్న రంగన్న మణ్యం వెళ్ళిపోవడంతో మోహినికి, నాగిని పోటీ తగ్గింపనుకుని సంతోషించాడు.

"ఈ దర్శకులకు నిజంగానే కథ పటుత్వం తెలియదు. ఒకటి, రెండు సినిమాలు తీస్తూనే, ఇంటర్నేషనల్ లెవల్‌లో తమ పేరు నిలబడింపని వెర్రెత్తిపోతారు. వచ్చే అవకాశాలు పోగొట్టుకుంటారు" అన్నాడు కనకారావు.

స్క్రిప్టు బయటకుతీశాడు రామారావు. "ఇంకావమైనాఉంటే సరిచేయండి రంగన్నగారూ! రేపటినుండి నటీనటుల ఎన్నిక, టెక్నీషియన్ల ఎన్నిక జరుగుతుంది. వచ్చేనెల అవుట్‌డోర్ షూటింగ్ ఏర్పాటు చేస్తాం. ఇక ఆలస్యం పనికిరాదు" అన్నాడు.

రంగన్న స్క్రిప్టు తీసుకున్నాడు.

శివరావు ఆరాత్రి వచ్చాడు. వస్తున్నట్లు ముందే ఉత్తరం రావడంతో స్టేషనుకు వెళ్ళాడు కనకారావు. ఇద్దరూ కలిసి, కొత్త నివాసం వద్దకు వచ్చారు.





గోవిందయ్య ఇచ్చిన మరో యాభై వేలు తెచ్చాడు శివరావు.

శివరావుని ఆఫీసు ఇన్‌ఛార్జిగా నియమించుకున్నారు. రామారావు ప్రొడక్షన్ మొత్తం బాధ్యత తీసుకున్నాడు. కనకారావు పై అధికారులనుండి రావలసిన పర్మిషన్లు, అవుట్‌డోర్ షూటింగ్ ఏర్పాట్లు, సెన్సార్‌లాంటి బాధ్యతలు తీసుకున్నాడు. డబ్బు రామారావుకే అప్పజెప్పారు. ఎందుకయినా మంచిది పైసా ఖర్చుకూడా జాగ్రత్తగా ఆలోచించాలనుకున్నారు.

ముగ్గురూకూర్చుని సినిమా ఎస్టిమేట్ వేశారు. కొత్త నటీనటులను కలుపుకున్నా పాత నటీనటులు కొందరు తప్పక ఉండాలి కనుక, ఎంత తక్కువయినా డెబ్బైవేలు ఖర్చు పెట్టాల్సి వస్తుందనుకున్నారు. కనీసం యాభై కలర్‌ఫిల్మ్ రోల్స్ కావల్సిఉంది నెగెటివ్ పూర్తయ్యేటప్పటికి! కలర్‌ఫిల్మ్ రోల్ దాదాపు పన్నెండు వందల రూపాయలుంది ధర. ఆ విధంగా అరవైవేలు ఖర్చు. ఔట్‌డోర్ షూటింగ్‌లు కనీసం రెండుసార్లయినా ఏర్పాటుచేయాలి. అందుకు లక్ష ఖర్చు. ఇన్‌డోర్‌షూటింగ్‌లకింద యాభై వేలు, ఆఫీసుకింద, టాక్సీ అద్దెలకింద మరో యాభై వేలు సంవత్సరం మొత్తంమీద ఖర్చు. టెక్నీషియన్స్‌కింద లక్ష, దుస్తులకుగాను ఇరవైవేలు, చిల్లరఖర్చులకు యాభై వేలు, రికార్డింగ్‌సాంగ్స్ కింద ఇరవైవేలు, రీరికార్డింగ్, డబ్బింగ్ యాభై వేలు. నెగెటివ్ పూర్తయ్యేటప్పటికి మొత్తం ఐదులక్షలా డెబ్బైవేలు. దాదాపు ఆరు లక్షలు ఖర్చవుతుందని నిర్ణయించారు.

టాక్సీలకింద ఇరవైవేలు ఖర్చుపెట్టే కంటే పదిహేనువేలు ఖర్చుపెట్టి కారు కొనడం మంచిదని నిర్ణయించుకున్నారు. చేతిలో మూడులక్షలున్నాయి. మరో

మూడు లక్షలు ఇంటివద్ద పీడించి సంపాదిస్తే, నెగెటివ్ తయారవుతుంది. అంత వరకూ డిస్ట్రిబ్యూటర్ల మీద ఆధారపడకుండా వుంటే తరువాత వాళ్ళే వచ్చి వెంట తిరుగుతూ వస్తారన్నాడు కనకారావు. డిస్ట్రిబ్యూటర్ల మీద ఆధారపడితే, వాళ్ళ ఆఫీసులచుట్టూ తిరగలేక బాధపడాలన్నాడు.

డబ్బు చేతిలో ఉందిగనుక, వెంటనే కారును కొన్నారు. ఖాదర్‌ను పిలిపించి, డ్రైవరుగా నియమించుకున్నారు.

ఇంతవరకూ, కలర్‌ఫిల్మ్ తీయాలంటే కనీసం ఇరవై లక్షలవుతుందని అనుకుంటూ ఉండేవాళ్ళు. దానిని తమ ఎస్టిమేట్‌లో ఆరు లక్షలకు కుదించినందుకు సంతోషించారు. ముప్పైకాపీలు తీసి విడుదల చేస్తే, రోజుకు నాలుగు ఆటలచొప్పున వారం రోజులు వేస్తే నాలుగు షోలకు ఎంతతక్కువ అయినా టాక్స్, ఎగ్జిబిటర్ కమీషన్ పోను నాలుగు వేలు మిగులుంది. అందులో డిస్ట్రిబ్యూటర్ కమీషన్ పదిహేను శాతం పోయినా ఒక్కొక్క హాలుకు మూడువేలా నాలుగు వందలు, సలభై హాల్సుమీద రోజూలక్షానలభైవేలువస్తుంది. ఆ విధంగా వారంరోజులు ఆడిస్తే తొమ్మిది లక్షలపైగానే వస్తుంది. అందులో పెట్టుబడి ఐదులక్షలు పోయినా, మిగిలిన నాలుగులక్షలు ప్రింట్లకు సరిపోతుంది. వారంరోజులతర్వాత వచ్చే రాబడి మొత్తం మిగులుంది.

లెక్క అద్భుతంగా వేశారు. వారి అంచనా ప్రకారం డిస్ట్రిబ్యూటర్‌కు మొదట ఇచ్చే ఐదు సంవత్సరాల కంట్రాక్టులోనే యాభై లక్షలు, సంవత్సరానికి పదిలక్షలు, ఒక్కొక్కరికి మూడులక్షలా ముప్పై మూడువేల, మూడువందలా ముప్పై మూడురూపాయలు వస్తాయి.

ఇదంతా ఊహాగానమేనని తెలుసు రామారావుకు. గతంలో కట్టెలడిపో, హోటల్ పెట్టి, ఇలాంటి లెక్కలే వేసి పెట్టుబడికూడా దక్కకుండానష్టపోయారు. లోబడ్జెట్ పద్ధతిలో ప్రవర్తిస్తే కొంత వరకూ సర్దుకోగలమనీ, ఆదాయం రాకున్నా నష్టంరాకుంటే చాలనీ అనుకున్నాడు. శివరావుమాత్రం ఊహాగానాల్లోనే మునిగితేలుతున్నాడు. కనకారావు ఈ సినిమాను అడ్డుపెట్టుకొని జీవితాన్ని సుఖమయంచేసుకుందామని ఆలోచిస్తున్నాడు.

రాత్రికి రంగన్నను కూర్చోబెట్టి కథను మొత్తం ఒకసారి సరిచూశాడు రామారావు

"కథ మీకు నచ్చిందా?"

"అద్భుతంగా ఉంది. ఇటువంటి కథ ఎవడూతీయడు. డబ్బు సంపాదించుకోవాలనేవారికి ఈ కథ బాగుండదు. కానీ గొప్పకళాఖండం" అన్నాడు రంగన్న.

"పొగడకుండా, ఉబ్బించకుండా నిజం చెప్పండి" అన్నాడు కనకారావు. "ఇంకా మార్చాలంటే మార్చేద్దాం. సెట్‌మీదకు వెళ్ళినతరువాత మార్చడంసాధ్యంకాదు."

"నాకు తెలిసినంతవరకూ ఏమీ మార్చనవసరంలేదు. ఉబ్బించేందుకు మాట్లాడడం లేదు. నిజంగానే. చెబుతున్నాను" అన్నాడు రంగన్న.

"రేపు నటీనటుల గురించి ఆలోచిద్దాం."

కనకారావు బయటకు వెళ్ళాడు.

"మా పాపను చూశారనుకుంటాను. అదే మోహిని! ఏదయినా పాత్ర ఒకటి ఇప్పించండి. హీరోయిన్ వేషమయినా చేయగలదు. బలే చలాకీపిల్ల" అన్నాడు రంగన్న.

రామారావు నవ్వి "ఆలోచిద్దాం. ఇంకా ఇద్దరు ఉన్నారు కదా?" అన్నాడు.

"మీరు 'ఊ' అందే వారు కాదంటారా? అంతా మీ చేతిలోనే ఉంది."

"అని నాయిష్టం వచ్చినట్లు ప్రవర్తించ దలచుకోలేదు. ఏమాత్రం దెబ్బతిన్నా, అందరం ఒకే ఊరిలో తిరిగేవాళ్ళం, మనస్పర్థలు ఏర్పడతాయి. అందువల్ల వాళ్ళతో చర్చించే ఏర్పాటు చేయాలి ఏదయినా!"

"కనీసం చిన్న వేషమయినా..."

"విసిగించకండి రంగన్నగారూ! ఒకమాట అంటే కట్టుబడి ఉండటం నా బాధ్యత! అందువల్ల మాట ఇవ్వక ముందే ఆలోచించుకోవడం మంచిది" అంటూ లేచాడు.

రంగన్న కూడా లేచాడు 'ఈ వెధవ ఏ విధంగానూ లొంగేటట్లు లేదు' అనుకుంటూ. 'ఇటువంటి మొండివెధవలు అప్పుడప్పుడు ప్రవేశిస్తుంటారు. అందువల్లనే ఇంకా కొంత నీతి ఉంది ఇందులో' అని కూడా అనుకున్నాడు. కనకారావుని అయితే బతిమాలి, చేతులు గడ్డాలు పట్టి ఒప్పించుకునేవాడు. ఇప్పుడు కనకారావు చేతిలో ఏమీలేదని తెలుస్తూనే ఉంది. ఈ మహానుభావుడు పలికేరకంగా లేడు. రంగన్న వెళ్ళిపోయాడు.

"ఏం చేస్తున్నావురా?" అన్నాడు శివరావు రూంలోకి వస్తూ.

"కలలు కంటున్నానురా?" అంత కంటే ఏంచేస్తాను?" అన్నాడు లేచి కూర్చుంటూ.

కాసేపాగి "రహ్మతునియాను హీరోయిన్‌గా పెడితే ఎలా ఉంటుందిరా?" అన్నాడు.

"భలేరంజుగా ఉంటుంది. మనం సిన్మా తీయకముందే విడుదలై తిరిగి వస్తుంది" అన్నాడు శివరావు కోపంగా.

రామారావు అతనివైపు చూశాడు సాలోచనగా.

"ఎవరికి నచ్చినదాన్ని వాళ్ళు తెచ్చి పెట్టకండ్రా! పెట్టుబడి పెడుతున్నది డబ్బురా! డబ్బు! సరయిన వ్యక్తులను చూసి ఏర్పాటు చేయాలి. రహ్మతునియాను హీరోయిన్ చేస్తే, అలాంటి పొట్టి దానికి తగిన హీరో ఎక్కడా దొరకడు"

"పడుకో!" అన్నాడు రామారావు లేస్తూ.

"ఎక్కడికి వెళ్ళాలి?" అన్నాడు శివరావు కూడా లేచి నిలబడుతూ.

"ఎక్కడికీ వెళ్ళడంలేదు. తిని పడుకోవడమే ఈ రోజు కార్యక్రమం! రేపటి నుండీ అందరికీ వర్క్ ఉంటుంది" అంటూ బయటకు వచ్చాడు.

సినిమా పూర్తిచేయగలమన్న ధైర్యం ఇప్పుడు కలిగింది ముగ్గురికీ! కానీ, హీరోయిన్, సమస్య వద్ద రగడ పడవలసి వస్తుందేమోననుకుంటున్నారు. ఇందులో ఎవరూ మిగిలినవారిని కాదని ప్రవర్తించ కూడదు. ఇద్దరిని ఒప్పించి, తనకు లొంగి ఉండే ఆడదాన్ని హీరోయిన్ గా పెట్టాలని అటు కనకారావు, ఇటు రామారావు ఆలోచిస్తున్నారు. శివరావుకు ప్రత్యేకంగా ఎవరి మీదా గురి లేదు అతడికి అనుభవమూ లేదు. ఏర్పరచుకునే స్థాయీలేదు, ఏర్పరచుకోవాలనే అభిలాషకూడాలేదు. దిగినందుకు మునగకుండా గట్టుచేరితే, గట్టుచేరిన తర్వాత మళ్ళీ దిగకుండా జాగ్రత్తపడదామని ఆలోచిస్తున్నాడు. ఎలాగూ లక్షరూపాయలు పెట్టాడు. ఇప్పుడు తాను మానుకున్నా అందులో పైసాకూడా వాళ్ళు తిరిగి ఇవ్వరు. గట్టిగా




అడుగుతే వీళ్లుఇక్కడా, ఇంటివద్ద వాళ్లూ తంతారు. గ్రామలలో వీరికి ఉన్న పట్టు వల్ల ఇవ్వమన్నా చేయబోయేదిలేదు. కనుక గోదావరిలో దిగాక మునిగిపోవడం కన్నా కుక్కతోకో, గాడిదతోకో పట్టు కొని ఒడ్డుకు చేరడమే మంచిదని ఆలో చించి,తిరిగి మద్రాసు వచ్చాడు.తనడబ్బు ఖర్చు పెట్టి వాళ్ళు జల్సాగా తిరుగుతుంటే తాను మాత్రం ఎందుకు ఊరకుండాలి? వారితో పాటు ఈ కొద్దిరోజులు తానూ సుఖపడదామని ఆశించాడు.

• • •

మర్నాడు నలుగురూ చర్చించుకుంటూ కూర్చున్నారు. తక్కువ స్థాయిలో ఉన్న ఆర్టిస్టు రాంగోపాల్‌ను పిలిపించారు. ఆ ఫిల్మ్ సంస్థపేరు అంతకు ముందే వినిఉండటంవల్ల పరుగెత్తుకొని వచ్చివాలాడు. అందరికీ నమస్కారాలు



చేసి,రంగన్నగారిని కూడా పలకరించి నిలబడ్డాడు చేతులు కట్టుకుని.

''కూర్చో'' అన్నాడు రామారావు ఇంటర్వ్యూకు సిద్ధపడుతూ.

ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

''ఎన్ని చిత్రాలలో నటించావు?''

"నాలుగు దొరికాయిసార్ ఇంతవరకూ. మరో రెండు చిత్రాలు నిర్మాణంలో ఉన్నాయి."

"నీకు హీరోపాత్ర మాదానిలో ఇవ్వాలనుకున్నాం. అంగీకరిస్తావా?"

ఆనందంగా తలూపాడు. "మీరు అంగీకరిస్తే తప్పకుండా నటిస్తానుసార్!"

"నీ రేటు ఎంతో చెప్పు"

"మీ ఇష్టం వచ్చినంత ఇవ్వండి సార్! నేను కాదనను. ప్రధానంగా నా నటన చూపించాలనుకుంటున్నాను కానీ, డబ్బు ప్రధానంకాదు. మీయిష్టం."

"ఇదే మా మొదటి సినిమా గనుక, ఇందులో ఐదు వేలిస్తాం. ఇది పాపులర్ అయి, రెండో పిక్చర్ ప్రారంభిస్తే దానిలో ఎక్కువ మొత్తం ఇవ్వగలం"

రాంగోపాల్ తల వంచుకుని ఆలోచిస్తున్నాడు. మరీ అంత తక్కువకు ఒప్పుకుంటే బాగుంటుందా? ఒప్పుకోకపోతే హీరోఛాన్స్ పోతుంది. డబ్బు పెద్దగా రాకున్నా, పేరు నిలబడుతుంది. దీనివల్ల ఇతర సంస్థలలో హీరో పాత్రలు దొరకవచ్చు.

"చెప్పు, నీయిష్టం! మాకు చాలా పనులున్నాయి ఇంకా! నీ పని పూర్తవుతే తర్వాత ఆలోచించాలి."

"ఎనిమిది వేలు ఇప్పించండి సార్" అన్నాడు బతిమాలే ధోరణిలో.

"ఐదువేలకు మించి ఐదుపైసలు కూడా మేం ఇవ్వలేము. ఇష్టమయితే అగ్రిమెంటు రాయించండి. లేకుంటే వెళ్ళండి" అన్నాడు రామారావు ఖచ్చితంగా.

"సరే సార్! ఇదే నాకు హీరో సినిమా! మీరు చెప్పినంతకే అంగీకరిస్తాను" అన్నాడు రాంగోపాల్.

అతనితో అగ్రిమెంటు రాయించుకోమన్నాడు శివరావును. రాయించమని రంగన్నకు చెప్పాడు. ముగ్గురూ పక్క రూంలోకి వెళ్ళారు.

"హీరోయిన్‌గా స్వర్ణ అనే అమ్మాయిని చూశాను. ఈరోజు ఇక్కడికి పిలిపిస్తాను. నీవు కూడా చూడు సరిపోతే ఆ అమ్మాయినే సెలక్ట్ చేద్దాం"

"కన్నమ్మ వద్ద ఉన్న అమ్మాయి కూడా పనికి వస్తుందేమో?"

"సాయంత్రం పిలిపిద్దాం" అన్నాడు రామారావు.

జూనియర్ ఆర్టిస్ట్ శివకుమార్ వచ్చి నమస్కారం చేసి నిలబడ్డాడు చేతిలో ఫైలు పట్టుకొని.

"నీ ముఠా ఎంత మంది ఉన్నారయ్యా?" అన్నాడు కనకారావు అతన్ని చూస్తూ.

"ఇరవైమంది మగవారు, పదహారు మంది ఆడవారూ ఉన్నారు సార్!"

"గ్రూప్ డాన్స్‌కు పనికివచ్చేవాళ్లున్నారా?"

"ఉన్నారు సార్! ఫైటింగ్ చేసేవారు కూడా ఉన్నారు. చిన్న చిన్న వేషాలకు అంటే ఒకటీ రెండూ మాటలు మాట్లాడి నటించేవాళ్ళు ఉన్నారు"

"ఏదీ ఫైలు ఇటు ఇచ్చెయ్".

దగ్గరగా వచ్చి ఫైలు టేబిల్‌మీద పరచాడు. పేజీలు తిప్పుతూ ఒక్కొక్కరిని పరిచయం చేస్తున్నాడు. వివిధ రకాల యాంగిల్స్‌లో ఫొటోలున్నాయి.

 

కొన్ని మరీ ఎబ్బెట్టుగా ఉన్నాయి.

"అవసరమైనప్పుడు తెలియచేస్తాం" అన్నాడు కనకారావు వెళ్ళమన్నట్లు చూస్తూ.

శివకుమార్ బయటకు వెళ్ళాడు.

సంగీత దర్శకుడు వచ్చాడు. అంత వరకూ అతడు అసిస్టెంటుగా పని చేస్తున్నాడు. దర్శకత్వ బాధ్యత దొరుకుతుందని ఆశించి వచ్చాడు. వివరాలు చెప్పాడు. తాను ఎన్ని వాయిద్యాలు వాయించగలడో, కూర్చగలడో, అభినయించి చెప్పాడు.

"ఎంత ఇవ్వాలి?" అన్నాడు రామారావు.

"ఇంతవరకూ అసిస్టెంటుగా ఉన్నాను సార్! మా గురువుగారు నెలకు ఎనిమిది వందలు ఇచ్చేవారు"

"అవన్నీ మాకెందుకు బాబూ! ఎనభై వేలు ఇచ్చినా మేం వద్దనము. మూడు నెలల లోపల మా పిక్చర్ పూర్తి చేస్తాము. ఎంత ఇవ్వాలో చెప్పు. ఒక రితో మాకు పోటీలేదు"

"పదివేలివ్వండి" అన్నాడు సంగీత దర్శకుడు.

"లేదు. ఐదువేలు ఇస్తాం. హీరోపాత్ర ధారికే ఐదువేలిస్తుంటే, మీకు పది వేలేమిటి?" అన్నాడు నవ్వుతూ.

"మూడు నెలల్లో పూర్తిఅవుతుందా?"

"సూర్యుడు పడమటివైపు పొడవ వచ్చు కాని, మేం చెప్పింది తప్పడానికి అవకాశం లేదు."

"సరే! మీయిష్టం" అన్నాడు అతడు.

"శివరావ్! సంగీత దర్శకునితో కాంట్రాక్ట్ రాయించుకో!"

టెక్నీషియన్స్ ఒక్కొక్కరే వస్తున్నారు. ఒప్పందం పూర్తిచేసుకుని, ఐదు రూపాయల స్టాంపుమీద కాంట్రాక్టు రాయించుకుని కొంత అడ్వాన్సు ఇచ్చి పంపుతున్నారు.

"ఇంతవరకూ మనం కొత్తపద్ధతి అనుసరించాం" అన్నాడు కనకారావు.

ఏమిటన్నట్లు తలెత్తి చూశాడు రామారావు.

"ప్రతి ఒక్కడూ ముందు దర్శకుని మాట్లాడుకుని, తద్వారా అతనికీ. నిర్మాతకూ అనుకూలమయిన టెక్నీషియన్స్‌ను ఎన్నుకుంటారు. ఇంతవరకూ మనకు దర్శకుడు లేడు. టెక్నీషియన్స్ మాత్రం సిద్ధమయ్యారు. ఇది విచిత్రమయితే, సాధారణంగా సినీ ఫీల్డులో హీరో, హీరోయిన్లే ఎక్కువ రాబడతారు. కాని, మన దానిలో మాటల రచయితకే ఎక్కువ ఇచ్చాం" అన్నాడు కనకారావు నవ్వుతూ.

"మనం వచ్చినప్పుడు పరిస్థితులు తెలియవు. పైగా అప్పుడు దర్శకుడుగా ఉన్న వ్యక్తి ఆ విధంగా ఒప్పించాడు. మనం ఒప్పుకోక తప్పలేదు. ఒకసారి బోల్తా పడ్డామని మళ్ళీ పడతామా? దర్శకులకేం కొల్లలుగా కన్పిస్తున్నారు. మద్రాసు పేవ్‌మెంట్ల మీద బిక్షగాళ్ల కరువు కావచ్చునేమోగానీ, దర్శకులకు కరువులేదు."

అసిస్టెంటు డైరెక్టరు కళింగను వెంట పెట్టుకొచ్చాడు రంగన్న. నమస్కారాలు, పరిచయాలు అయిన తరువాత రంగన్న వివరించాడు. "ఇరవైఐదు సినిమాలకు సుబ్బయ్య వద్ద అసిస్టెంటుగా పని చేశాడు; కానీ ప్రమోషన్ ఇవ్వలేదు సుబ్బయ్య. అతని వెనుక ఉండి, అతనికి పేరు తెచ్చేకంటే, స్వంతంగా ఎవరయినా అవకాశమిస్తే పని చేయాలనుకున్నాడు. మీ సంస్థ గురించి చెప్పి తెచ్చాను"

అన్నాడు రంగన్న.

"డబ్బు విషయం చెప్పారా? మనది లోబడ్జెట్ చిత్రం" అన్నాడు రామారావు.

'లోబడ్జెట్ కాదు లాస్ బడ్జెట్ చిత్రం' అనుకున్నాడు మనసులోనే రంగన్న. సినీ చరిత్రలో ఈవిధంగా ఎవరూ చేయ లేదు. రాత్రింపగళ్ళూ ఆలోచించి, మరి కొందరిని తెలుసుకొని ఎవరు పనికి వస్తారో, రారో పరిశీలించి నియమిస్తారు. వీళ్లు కూడా పరీక్షిస్తున్నారు. కానీ, అసలు వీళ్ళకే పరిజ్ఞానం లేకపోతే ఏం పరీక్షి స్తారు? పైగా డబ్బు తక్కువ తీసుకునే వాడయితే సరి, వాడికి స్థాయి లేకున్నా అగ్రిమెంటు రాయించు కుంటు న్నారు. మణ్యం డైరెక్షన్ అయితే బాగుండేది. అందరినీ అతడే కూర్చుకునే వాడు. అతన్ని దూరం చేసుకున్నారు. పిల్ల కుంకలు పిల్ల చేష్టలు చేస్తున్నారు అభ్యు దయం పేరుతో! చివరకు వీళ్ళు మున గడం తప్ప, తేలడం లేదనుకున్నాడు రంగన్న.

"నాకు ఇది మొదటి ఛాన్సు! అందు వల్ల మీరే ఆలోచించండి" అన్నాడు కళింగ.

"పదివేలు ఇస్తాము. అదయినా రచ యితకు పదివేలు ఇచ్చి, దర్శకుడికి ఇవ్వకపోవడం బాగుండదనే ఇస్తున్నాం. హీరోకు ఐదువేలు మాత్రమే ఇస్తు న్నాము" అన్నాడు కనకారావు.

తల ఊపాడు కళింగ. రంగన్న చెప్పిన దాన్ని బట్టి వాళ్లు ఐదారువేల కంటే ఎక్కువ ఇవ్వరనుకున్నాడు. అంత వరకయినా పనిచేసి, డైరెక్టరుగా పేరు తెచ్చుకుంటే తర్వాత అవకాశాలు దొరుకు తాయని ఆశించి వచ్చాడు. పదివేలిస్తా మన్నందుకు సంతోషించాడు.

కాంట్రాక్టు రాయడం అయిపోయింది.

"రేపురండి. టెక్నీషియన్స్ లిస్టు, నటీనటుల లిస్టు ఇస్తాము. సినిమా ఫెయిల్ కాకుండా చూసే బాధ్యత మీదే"

కళింగ లేచి సంతోషంగా నవ్వాడు "ఇది నాకు మొదటి డైరెక్ట్ చిత్రం. ఇది ఫెయిలయితే నేను దర్శకుడిగా పనికి రాను. ఆ తర్వాత అసిస్టెంటుగా ఎవడూ ఉంచుకోడు. అందువల్ల నా జీవితానికి ప్రధానమైన విషయంలో జాగ్రత్తగానే ప్రవర్తిస్తాను" అంటూ వెళ్ళాడు.

బరువు సగం తగ్గినట్లు భావించాడు కనకారావు. డైరెక్టర్ ఎవడైనా మిగిలిన టెక్నీషియన్స్‌లా కాకుండా, పూర్తి బాధ్యతతో ప్రవర్తిస్తాడు. ఏమాత్రం పొరపాటు బడినా, అలసత్వంతో ప్రవర్తిం చినా వాడి సినీ జీవితం అంతటితో ఆఖరే అవుతుంది. ఇతర టెక్నీషియన్లు సక్ర మంగా ప్రవర్తించకున్నా అవకాశాలు మళ్ళీ దొరకవచ్చు. కానీ దర్శకుడికి దొరకవు. పైగా తెలివి తేటలు లేని సుబ్బయ్య అన్నీ ఉన్న ఈ అసిస్టెంట్ల వల్లనే పెద్ద దర్శకుడిగా తయారయ్యాడని అందరికీ తెలుసు.

పదకొండు గంటలకు డ్యూటీకి వెళ్తూ సరోజ వచ్చింది ఆఫీసుకు. కనకారావుని చూసి నమస్కరించింది దగ్గరగా వస్తూ. పరిచయం చేశాడు శివరావుకూ, రామా రావుకూ.

"నేను చూశానుగా లాడ్జిలో. కానీ పరిచయం లేదు" అన్నాడు క్రిందనుండి మీది దాకా చూస్తూ రామారావు. 'మనిషి మరికొంత లావు ఉంటే బాగుండేది' అనుకున్నాడు.

"కూర్చో" అన్నాడు కనకారావు, సరోజ కూర్చుంటూ "డ్యూటీకి టైం




అవుతున్నదండీ! మీరు ఉంటారు కదా ఒకసారి కలిసి వెళ్దామని వచ్చాను" అంది తలవంచుకుని.

ఆమెనే రెప్ప వేయకుండా చూస్తున్నాడు శివరావు.

"వేషం అడుగుతున్నది. ఏదో ఒకటి చెప్పు" అన్నాడు కనకారావు.

"మనిషి సరిపడదని ఆలోచిస్తున్నాను. మరీ అంత నాసిగా ఉంటే కష్టమేమో"

"ఉన్నది అంతే మరి! ఏం చేస్తాం? ఏదో ఒకటి; కనీసం ఓ సినిమాలో నటించాను అన్న సంతృప్తి కొరకు ఆమె ప్రయత్నం" అన్నాడు కనకారావు.

"ఏం వేషం వేస్తావు?" అన్నాడు రామారావు.

" మీ ఇష్టం వచ్చింది ఏది ఇచ్చినా సరే! నాకు సినిమాలో అవకాశం కావాలి. అందు కొరకే ప్రయత్నం."

"తల్లి పాత్ర ఇవ్వచ్చు కానీ జనం హాల్లో నుండి లేచిపోతారేమో" అన్నాడు రామారావు నవ్వుతూనే.

"రాంగోపాల్‌కు తల్లిగా పాత్ర వేస్తే ఇంత సన్నటి మనిషి మరీ ఘోరంగా ఉంటుంది" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

"సరే! మళ్ళీ రండి. ఆలోచిద్దాం" అన్నాడు రామారావు.

లేచి అందరికీ నమస్కరించి బయటకు కదలింది. 'చూస్తే అవకాశం ఇస్తారన్న నమ్మకం లేదు. అయినా ఆశ! మరోసారి కలుద్దాం; మునిగిందేమిటి?' అనుకుంది.

కన్నమ్మ వచ్చింది చిరునవ్వు ఒలకబోస్తూ.

"ఏరా దొంగ సచ్చినోడా ! ఈ రెండు రోజులనుండీ రావడం లేదేం?" అంది వచ్చి కూర్చుంటూ. శివరావు ఆమె మాటలు విని దిమ్మెరపోయినట్లు చూస్తున్నాడు.

"వేరే పనులున్నాయి. ఎప్పుడూ నీయింటి దగ్గర పడి ఉండటానికేనా ఇక్కడకు వచ్చింది?" అన్నాడు కనకారావు కోపంగా. ఆమెను మాట్లాడవద్దని అనలేదు. ఆమె గౌరవం ఇద్దామని అనుకోదు. గతంలో ఆమె హెచ్చు స్థాయిలో ఉన్నప్పుడు ఆమె దగ్గర తను తక్కువ స్థాయిలో ఉండడం వల్లా, ఆమె నోటిదురుసు మనిషి కావడంతో, చనువు ఏర్పడినా మాటలు యథాలాపంగానే వస్తాయి.

"కోపమెందుకుగానీ, సరితకు ఏదయినా సినిమాలో ఛాన్సు ఇవ్వరా!"

"ఎందుకు? సరితను అడ్డు పెట్టుకుని రోజుకు ఐదువందలు సంపాదిస్తున్నావు. అంత డబ్బు ఇవ్వటానికి మాకు దమ్ము లేదులే! మా సినిమా పెట్టుబడి అంతా కలిసి నీ సంవత్సరం ఆదాయమేగా" అన్నాడు నవ్వుతూ.

"నీ వెకిలి కూతలు మామూలేలే! పాపం! ఆ పిల్ల మూడు రోజులనుండీ నిన్ను అడగమని చెబుతున్నది."

"సుబ్బయ్యను కదిలించకూడదా! ఇంట్లో అంత పెద్ద డైరెక్టరును పెట్టుకుని మా వెంట పడ్డావేమిటి?"

"వాడి తల పగిలిపోనూ! పేరుకే వాడికీ నాకూ సంబంధం తప్ప మరేమీ లేదని నీకు తెలియదూ. ఆ పిల్లను వాడెందుకు తీసుకుంటాడు. నీ విషయం చెప్పు."

"పోనీ! ఒక లక్షరూపాయలు పెట్టుబడి పెట్టు. హీరోయిన్ ఛాన్సు నీకూ, సైడ్ హీరోయిన్‌గా సరితకూ ఇద్దాం"

గలగల నవ్వింది కన్నమ్మ.' పైట విదిలించి వేసుకుంటూ "నేను ఇంకా ఏం నటిస్తాలే గానీ; ఆ పెట్టుబడులు కూడా నా పద్దులేవు. నీ హాస్యం విడిచి ఆ పిల్లను చూడాల" అంది.

"ఈ అబ్బాయి యెవరు?" అంది శివరావు వైపు చూసి. శివరావు తలవంచుకున్నాడు. అతడి సిగ్గును చూసి నవ్వుకుంది కన్నమ్మ.

"వాడు మా మూడో పార్టనర్!" అన్నాడు రామారావు.

"నీవూ రాకుండా మానుకున్నవే?" అంది అతన్ని పలుకరిస్తూ. చిరునవ్వు నవ్వాడే తప్ప జవాబివ్వలేదు రామారావు.

"సాయంత్రం వస్తావా?" అంది కనకారావును చూస్తూ.

"ఈ నాలుగు రోజులూ బయటకు కాలు పెట్టలేదు. పనుల్లో ఉన్నాం. అందరితో కాంట్రాక్టులు అయిన తర్వాత, సెట్స్‌కు వెళ్ళేముందు వీలును బట్టి చూద్దాం."

"సరే! సరిత విషయం ఆలోచించు" అంది లేచి వెళ్లిపోతూ.

ఖాదర్ వచ్చాడు. "మోహినిని తీసుకు వచ్చాను సార్!" అన్నాడు. మెరుపు తీగలా వస్తున్న మోహినిని చూస్తూ, కళ్ళప్పగించాడు శివరావు. ముగ్గురికీ నమస్కరించింది.

"కూర్చో" అన్నాడు రామారావు. పొందికగా ఒదిగి కూర్చుంది.

"మన రచయిత రంగన్న కూతురు; పేరు మోహిని!" పరిచయం చేశాడు రామారావు. కనకరావు తలఊపాడు. శివరావు కళ్ళు ఆర్పడంలేదు. అతని కళ్ళల్లోకి చూసింది మోహిని. తలదించుకున్నాడు శివరావు సిగ్గుతో.

"ఈ అమ్మాయికి సైడ్ హీరోయిన్, అంటే సెంకడ్‌రోల్ ఇస్తే ఎట్లా ఉంటుంది?" అన్నాడు రామారావు.

'హీరోయిన్, సెంకడ్ హీరోయిన్ అందర్నీ వీడు ముందుగానే నిర్ణయించేసుకున్నట్లుంది' అనుకున్నాడు కనకారావు. అతనిలో కొద్దిగా ఈర్ష్య పుట్టింది. తనకులొంగే వారిని అందరినీ కలుపుకుంటున్నాడు. నాకు చెందిన ఒక వ్యక్తికి అవకాశం ఇవ్వమంటే ఆలోచించాలంటున్నాడు. ఇదే పెద్దరికం వెలగబెట్టడం అనుకున్నాడు. 'ఇప్పుడే అధికారం పూర్తిగా అప్పచెబితే, ముందు ముందు తన్ను తొక్కేసి పైకి పోతాడు. అందువల్ల అధికారం చెలాయించకుండా చూడాలి. ఇంత వరకూ అవకాశం ఇవ్వడమే తప్పేమో!' అనుకున్నాడు.

రామారావు అతని వైపే చూస్తున్నాడు ఏం జవాబిస్తాడోనని. మోహిని కూడా అతని జవాబు వినడానికి చెవులు రిక్కించి సిద్ధపడింది. కనకారావు జవాబివ్వలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు.

తర్వాత నిదానంగా "ఆలోచిద్దాం" అన్నాడు చివరికి.

శివరావు లేచి లోపలకు వెళ్ళాడు. తనను ఏ విషయం ఎవడూ అడగనందుకు అతడు బాధపడుతున్నాడు. అప్పుడే వీళ్ళు ఇక్కడ లేడీ స్నేహితుల్ని ఏర్పరచుకున్నారు. రాజకీయ నాయకులు పదవులు పంచుకుంటున్నట్లు, పాత్రలు కూడా తమ మనుషులకు ఇచ్చుకోడానికి ప్రయత్నం చేస్తున్నారు.

రామారావు, మోహిని లేచి బయటకు వెళ్ళారు. వెళ్తున్న ఆ ఇద్దరినీ చూస్తూ, ఆలోచిస్తూ కూర్చున్నాడు కనకారావు.

బయట ఖాదర్ బీడీ తాగుతూ కూర్చు




న్నాడు. వెళ్ళిపోతున్న ఇద్దర్నీ చూశాడు. కాని, కారు కావాలనలేదు గనుక తానూ పలుకరించలేదు. పైగా ఆ కారు కొన్న ఈ నాలుగురోజులలో వాడకం కనకరావు మాత్రమే! రామారావు ఒకటి రెండు సార్లు మాత్రమే వెళ్ళాడు.

ఫోను మోగుతుంటే లేచి అందుకున్నాడు కనకారావు.

మణ్యం ఇంటినుండి ఫోను. నాగిని ఫోను చేస్తున్నది.

"ఇంటివద్దే ఉన్నారా?" అంది నాగిని

"ఎక్కడికీ ఇంకా వెళ్లలేదు" అన్నాడు కనకారావు.

''మీ సినిమా కాంట్రాక్టు పోగొట్టుకున్నందుకు నాన్న ఎంతో బాధపడుతున్నాడు. కళింగను ఏర్పాటు చేశారట కదా?"

''అవును. ఈ రోజే ఒప్పందం ఖరారయింది.''

''ఎలాగూ నాన్న చేజేతులా రా పోగొట్టుకున్నాడు. నేను చెప్పినా ఆయన ఆ రోజు వినలేదు. ఇప్పుడు బాధపడుతున్నాడు. సరే! విశ్రాంతిగా ఉంటున్నారా? బిజీగా ఉంటున్నారా?''

"ప్రస్తుతం విశ్రాంతి! ఎవరూ లేరు. ఒక్కడినే."

"కంపెనీకి రమ్మంటారా?"

"మీ అమ్మా, నాన్నా లేరూ?"

"మీ విషయంలో లేనట్లే అనుకో!" నవ్వు వినిపిస్తున్నది.

"రా! వెంటనే!"

"వస్తున్నాను" ఫోన్ క్లిక్‌మంది. ఫోను కిందపెట్టి ఆలోచిస్తూ కూర్చున్నాడు. పావుగంటలో బయట టాక్సీ ఆగిన చప్పుడు. టకటక చెప్పుల చప్పుడు చేసుకుంటూ నాగిని లోపలకు ప్రవేశించింది నవ్వుతూ.

"నాన్న గంట్రకితమే అన్నాడు పొరపాటు చేశానని!"

"పోనివ్వు! ఎవరో ఒకరు. మాకు కావలసింది సినిమా పూర్తికావడం. దాని కొరకే కదా ఇక్కడ కాపురం పెట్టవలసి వచ్చింది."

"భోజనాలు ఎట్లా చేస్తున్నారు? వంట చేయిస్తున్నారా? హోటలేనా?"

"వంట చేసేవాళ్ళు దొరకడం లేదు. నీవు చేసే పనేముంది? వంట చేసిపెట్ట కూడదూ రోజూవచ్చి" అన్నాడు ఆమె కళ్ళలోనికి చూస్తూ.

"తప్పకుండా! మీరడగాలికానీ, రోజూ వస్తాను. ఇప్పుడు చేయమంటారా?" అంటూ లేచింది.

"వద్దులే! కూర్చో! లోపల మావాడు ఒకడు పాలుకాచుకొని తాగుతూ ఉంటాడు. ఉన్నపాటున నీవు లోనికి పరిగిడుతే, వాడు హడలిపోతాడు" అన్నాడు నవ్వుతూ.

"భోజనం చేశారా? ఇంకా లేదా?"

"ఒంటి గంటే కదా అయింది. ఇంకా చేయలేదు."

"అయ్యో! ఒంటిగంటవరకూ భోజనం చేయకుంటే ఆరోగ్యం పాడుకాదూ. లేవండి వెళ్దాం" అంది.

లేచి బయటకువచ్చాడు. వీరిని చూసి ఖాదర్ లేచి, కారువద్దకు సాగి డోర్ తెరచి పట్టుకున్నాడు.

"మలబార్ రెస్టారెంటుకు పోనీ!"

అతని కళ్లలోనికి చూస్తూ కూర్చుంది నాగిని. కనకారావు బయటకు చూస్తూ ఆలోచిస్తున్నాడు.




"'నాగినికి హీరోయిన్ పాత్ర ఇద్దాం" అన్నాడు కనకారావు పైకప్పు వంక చూస్తూ, సిగరెట్ పీలుస్తూ.

ఎదురుగా రామారావు కూర్చున్నాడు. శివరావు వీరితో తనకు పనిలేదన్నట్లు పుస్తకం తెరిచి పట్టుకున్నాడు. నిజానికి ఏం మాట్లాడతారో విందామనే ఆసక్తిగా ఉన్నాడు.

"నాగినికంటే నా దృష్టిలో స్వర్ణ బాగుంటుంది. నాగినికి కూడా ఒక పాత్ర ఇద్దాం. నాగిని మరీ పొట్టిగా కన్పిస్తున్నది" అన్నాడు రామారావు.

"మరేం ఫర్వాలేదు. పొట్టి అయినా నటించగల స్థాయి కావాలి తన నటనతో ప్రేక్షకులను ఆకట్టుకోగలగాలి. అయినా మరీ పొట్టి కాదుగా! పైగా మణ్యం మొదట్లో మనకు కొంత సహాయం చేశాడు. అతను చెప్పిన మాటలు మనం వినలేదని విరమించుకున్నాడు. అతను చేసిన కనీస సహాయానికి అతని కూతురుకు ఇద్దామని నా ఉద్దేశం!"

"అందుకు నేను వ్యతిరేకించాల్సిన అవసరం లేదు. కానీ, నటించగల స్థాయి ఉందా అని! ఇక్కడ మన తన పనికిరాదు. ఏమాత్రం పొరపాటున కాలు వేసినా దబ్బ తింటాం."

"ఇప్పటికే దాదాపు ఐదారు చిత్రాల్లో నటించింది."

"రెండో హీరోయిన్‌ను ఎవర్ని బుక్ చేద్దాం?"

"రంగన్న కూతుర్ని చేద్దాంలే!" అన్నాడు కనకారావు. అనవసరంగా పోట్లాడుకోవటం కంటే పంపకం చేసుకోవడం మేలనిపించింది అతడికి.

"స్వర్ణ విషయం ఏం చేద్దాం?"

"ఆ అమ్మాయి కనీసం నా కంటే ఐదేండ్లు పెద్దగా కన్పిస్తున్నది. ఆమె తమ్ముడికి పిల్లలు పుట్టారంటే నీవే ఆలోచించు. మేకప్ మీద మనిషి ఆ విధంగా ఉందేకానీ, ఫీల్డులో ఆ అమ్మాయి పనికి రాదు. పోతే సరోజను మొదటి హీరోయిన్ తల్లిగా వేయిద్దాం. మొదటి హీరోయిన్ హరిజన కాబట్టి, దారిద్ర్యంతో తల్లి సన్నగా ఉన్నట్లు చూపించవచ్చు. మనకు ఆడ పాత్రలలో హీరో తల్లి, అక్క అవసరం. ప్రధానమైన ఈ రెండు పాత్రలూ బుక్ చేయిస్తే చిన్నచిన్న పాత్రలు జూనియర్ ఆర్టిస్టులతో వేయించవచ్చు" అన్నాడు కనకారావు.

స్వర్ణకు అవకాశం ఇవ్వక పోవడం ఆశాభంగం అనిపించినా, కనకారావు చెప్పినట్లు ఆమెకు పాతికేళ్ళకు పైగానే ఉన్నాయి. ఇరవైఏండ్ల అమ్మాయి అమ్మమ్మ పాత్ర వేస్తుంటే, పాతికేళ్ళ వ్యక్తిని హీరోయిన్‌గా ఆలోచించడం మంచిదికాదని సర్దుకున్నాడు రామారావు.

"మరి వీరికి డబ్బు విషయం ఏం చేద్దాం?" అన్నాడు రామారావు.

"చేసేదేముంది? మనది లోబడ్జెట్ చిత్రమని ముందే చెప్పాము. పైగా హీరోకే ఐదువేలు ఇస్తున్నప్పుడు, అందుకు తగినట్లే వీరి మార్కెట్ కూడా

ఉంటుంది. అంతేగానీ, వారు కోరినంత ఇస్తామా?"

"సరే! పిలిపించి మాట్లాడదామా? వెళ్ళి చెప్పి వద్దామా?"

"మనం ఎవరి కాళ్ళ వద్దకూ వెళ్ళకూడదు. రమ్మంటే వాళ్ళే పరుగెత్తుకుంటూ వస్తారు. ఫోన్‌చెయ్యి" అన్నాడు కనకారావు. ఫోన్‌విని నాగిని వెంటనే వచ్చింది. వివరాలు చెప్పాడు రామారావు.

"మరీ తక్కువగాకుండా నీకు కూడా నాలుగువేలు ఇద్దామనుకుంటున్నాము. ఎక్కువ ఇవ్వడం మాకు సాధ్యంకాదు. ఇష్టమయితేనే అగ్రిమెంటు రాసుకుందాం" అన్నాడు.

నాగిని హీరోయిన్ పాత్ర దొరుకుతున్నందుకు ఎంత సంతోషించిందో ధర తగ్గించడంతో అంతగా ఆశాభంగంగా భావించింది. అయినా వస్తున్న అవకాశం వదులుకోవాలనిపించలేదు. ఒకసారి హీరోయిన్‌గా కన్పిస్తే తర్వాత అవకాశాలు దొరకవచ్చు. భవిష్యత్తు ఆశాజనకంగా ఉండవచ్చు. ఈ హీరోయిన్ పాత్ర పోగొట్టుకుంటే, ఇంటిదగ్గర గోళ్ళుగిల్లుకుంటూ కూర్చోవడమే! వచ్చినంతే చాలనుకుంది.

"మీయిష్టం! హీరోయిన్‌గా అవకాశం ఇస్తున్నందుకు నాకు సంతోషంగా ఉంది. డబ్బు విషయంలో మీరుచెప్పినట్లే చేద్దాం"

ఐదురూపాయల స్టాంపు మీద అగ్రిమెంటు పూర్తవుతుండగానే మోహిని సుడిగాలిలా దూసుకు వచ్చింది. వరుసగా నమస్కారాలు చేసింది కూర్చుంటూ.

"మోహినీ! నిన్ను సెకండ్ హీరోయిన్‌గా బుక్ చేయాలనుకున్నాము. ఇష్టమేనా ?" అన్నాడు రామారావు.

తల ఊపింది మోహిని ఆనందంతో కళ్ళు మిలమిల మెరుస్తున్నాయి. కంపెనీ కొరకు పిలిచాడనుకుందిగానీ, ఆమాట వింటూనే ఉత్సాహంతో ముఖంవిప్పారింది.

"మొదటి హీరోయిన్‌కు నాలుగువేలు ఒప్పందం జరిగింది. సరే! మరీ తగ్గించడం బాగుండదు. అయినా తేడా ఉండాలికదా! నీకుమూడువేలు ఇద్దామనుకున్నాం"

"రెండుపాత్రలూ ఒకటేకదా!ఎందుకు తగ్గించడం?" అంది రామారావు కళ్ళలోకి చూస్తూ.

"పాత్రలు రెండూ ఒకటేఅయినా బరువైన పాత్ర మొదటిది. ఎక్కువ డైలాగ్స్ నటన ఉన్నాయి. నీ పాత్రకు అంతబరువైన రసపోషణ అవసరం లేదు. అయినా మూడు నెలల్లో సినిమా పూర్తి చేయాలనుకున్నాము. నెలకు వెయ్యి రూపాయలు చాలవా ?

తల ఊపింది మోహిని "మీ యిష్టం" అంది చిన్నగా. నాగిని ముందే, తనకు ఆమెకంటే వెయ్యిరూపాయలు తక్కువ అనడం చిన్నతనంగా భావించింది. అయినా అవసరం తనది. అన్నింటినీ దిగమింగాలనుకుంది.

ఆమెతో కూడా కాంట్రాక్ట్ ఫారం రాయించుకున్నారు.

సరోజ డ్యూటీలో లేదు గనుక ఆమె అందుబాటులో లేదు. తర్వాత ఆమెకు చెప్పాలనుకున్నారు.

మిగిలిన మూడు పాత్రలకు బుక్‌చేయడం కూడా త్వరలో పూర్తవుతే, షూటింగ్ ఏర్పాట్లు చూడాలనుకున్నారు.

సాయంత్రం ఐదు గంటలప్పుడు, సదానందం సుడిగాలిలా వచ్చాడు. ఆ సమయానికి రామారావు ఒక్కడే ఉన్నాడు. శివరావు ఉన్నా లేనట్లే లెఖ్ఖ!

"కూర్చోండి" అన్నాడు సదానందాన్ని ఆహ్వానిస్తూ.

"అమ్మాయి విషయం ఏమయింపండి?" అన్నాడు కూర్చుంటూ. ఆపాటికే అమ్మాయిని ఇష్టపడలేదని అతనికి తెలిసింది. అందువల్లే స్వయంగా వచ్చాడు తెలుసుకోవాలని.

"ప్రస్తుతం అవకాశం సాధ్యం కాదంటున్నారండీ మావాళ్ళు. ఎందుకంటే ఆమె వయస్సు చాలా పెద్దదిగా కనిపిస్తున్నదట."

సదానందం కస్సుమన్నాడు. "అదేంటయ్యా! సినిమాలలో అవకాశం ఇస్తామని ఆశచూపి, ఆడపిల్లల లోబరుచుకుని నాశనం చెయ్యడమేనా మీ పని? ఇది మర్యాదకరంగా ఉందా?"

రామారావు జవాబివ్వలేదు.

"రాత్రంతా ఆ అమ్మాయితో గడిపావు. వయసులో ఉన్న అమ్మాయి జీవితాన్ని నాశనం చేశావు. ఏదో సినిమాలో అవకాశం దొరుకుతుందన్న ఆశకొద్దీ మేమూ నోరెత్తలేదు. మీరు ఈ విధంగా



మోసం చేస్తారనుకోలేదు. కేసు పెడితే మీ బతుకులు ఏమవుతాయో తెలుసా? సినిమాల పేరుతో ఆడపిల్లల జీవితాలతో చెలగాటమాడుతున్నారు."

రామారావు కంటగింపుగా చూశాడు అతనివైపు. "సదానందం గారూ! మర్యాద ఇచ్చి పుచ్చుకోవడం మంచిది. మిమ్మల్ని గురించి నేను ఏమీ తెలియనివాడినికాదు.



మీ కూతురు తనంతకు తాను నామీద పడుతున్నప్పుడు, నేను నోరుమూసుకొని కూర్చోవాలా? పైగా మీరందరూ బీచ్‌కు వెళ్ళడానికి ఎందుకు మా ఇద్దరికి అవకాశమిచ్చారో కూడా తెలుసు. తల్లిదండ్రులు మీరే ఈవిధంగా లోబరుచుకోవడానికి, ఆడపిల్లల్ని ఎగతోలుతున్నారు. కేసు పెట్టి నీవు ఏమీ చేయలేవు. ఆ స్తోమత నాకూ ఉంది. మర్యాదగా ప్రవర్తించడానికి ప్రయత్నించండి. ఇదిగో! మీ కూతుర్ని ఒక రోజు వాడుకున్నందుకు నీకు కావలసిన డబ్బు తీసుకో! ఇదికూడ ఒక స్నేహితుని సోదరికి అవమానం జరగకూడదనే ఇస్తున్నాను." అంటూ టేబుల్ సొరుగులోనున్న మనీపర్స్ టేబిల్‌మీద వేశాడు కోపంగా. సదానందం రామారావునీ, పర్సునూ మార్చి మార్చి చూసి, చివరకు అందులోనుండి ఐదు వందల రూపాయల కాగితాలు తీసుకొని, లేచి తలవంచుకుని బయటకు నడిచాడు.

తీసుకుపోతున్న కాగితాలవంక చూస్తూ "ఒక్క రోజుకు ఆడదాని ఖరీదు ఐదువందలా?" అన్నాడు ఆదుర్దాగా శివరావు.

"నీవు నోరు మూసుకోరా వెధవా!" అన్నాడు కోపంగా రామారావు.

"ఒరేయ్! డబ్బంతా మీ తిరుగుళ్ళకు ఖర్చు పెట్టి, చివరకు నాకు బొచ్చె చేతికిచ్చేటట్లున్నారు. మీరు తీసేది సినిమా కాదురా నాయనా! ఆడపిల్లల జంఝాటం!" అన్నాడు తల పట్టుకుని శివరావు.

రామారావు జవాబివ్వలేదు ఫైళ్ళు చూసుకుంటూ. ఫోన్ గణగణ మోగుతే చేతికి తీసుకున్నాడు. కన్నమ్మ ఫోన్ చేస్తున్నది.

"నేను రామారావుని మాట్లాడుతున్నాను" అన్నాడు.

"ఆడవాళ్ళ పాత్రలకు సెలెక్ట్ అయిందటగా!"

"ఎవరు చెప్పారు నీకు?"

"ఎవరో ఒకరు! ఒక నిర్మాత ఎవరెవరిని తీసుకున్నాడన్న విషయం, కంట్రాక్టు అయిన రెండు గంటల్లోనే అందరికీ తెలిసిపోతుంది. మరి సరితకు ఏం చేశావు? నీ మీద అది ఎంతో ఆశ పెట్టుకుని ఉంది."

ఇంతవరకూ సరితను గురించి తాము ఆలోచించనే లేదనుకున్నాడు.

"ఏం చేశావు?" అంది కన్నమ్మ తిరిగి.

"ఆలోచించలేదు. ఇక్కడికి పంపించు. మాట్లాడతాను."

"సరే!"

ఫోను కింద పెట్టాడు. సరిత! మద్రాసులో మొదటగా తారసపడ్డ వ్యక్తి తనకు. 'మూడు పాత్రల్లో ఏదో ఒకటి ఇస్తే సరిపోతుంది. వచ్చిన తర్వాత ఆలోచిద్దాం' అనుకున్నాడు.

సరిత వచ్చి నమస్కారం చేసింది. చాలా సాధారణంగా కన్పిస్తున్న గుడ్డలలో ఉంది.

"కూర్చో!"

ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"మీ అమ్మగారు పంపారా?"

తలూపింది తల వంచుకునే.

"చెప్పుమరి. ఏమిటి విశేషాలు?"

"ఏదయినా పాత్ర కొరకు ప్రయత్నించమని అమ్మగారితో చెప్పాను. మీ దగ్గర ప్రయత్నిస్తానని చెప్పింది."

"ఏ ఊరు నీది?" ఆమె ముఖంలోకి చూస్తూ అడిగాడు.




"కడప జిల్లా పెద్దపసుపుల మాది. మా గ్రామంలోనే చదువుకున్న అబ్బాయి సినిమా ఆశ చూపించి, ఇంటి నుండి నగలతోసహా నన్ను ఇక్కడికి తెచ్చాడు. ఆ రావడం సరాసరి కన్నమ్మ వద్ద పడ వేశాడు. కన్నమ్మ పెద్ద డైరెక్టరు భార్య అనీ, ఆమె వద్దనే కొంతకాలం వుంటే తప్పకుండా అవకాశం దొరకుతుందనీ నచ్చచెప్పి ఉడాయించాడు. నాకు సిని మాలలో ఛాన్సుకు బదులు, వ్యభిచారంలో అనుభవం నేర్పుతున్నది. గతిలేక, విధి లేక, వెనుతిరిగిపోయి అల్లరి పట్టనూ లేక ఇక్కడే పడిఉన్నాను."

కళ్లనుండి కారిన నీరు తొడల మీద పడి చీర తడుస్తున్నది. ఇది మరో రకం కేసుగా అనిపించింది. మద్రాసులో సినిమా మోజుతో వచ్చిన ఆడపిల్లల కేసులు ఎన్నున్నాయో!

"కన్నమ్మ వ్యభిచారంకొంప నడుపు తున్నట్లు మొన్న వచ్చినప్పుడే నాకు తెలిసింది. నీ నగలన్నీ ఏమయ్యాయి?"

"ఏమో? వారికి లంచమిచ్చాను, వీరికి లంచమిచ్చాను, ఇదిగో సినిమాలో అవకాశం దొరుకుతుంది అనేది. మొదట్లో నమ్మాను కానీ, ఇప్పుడు నమ్మకం పోయింది. తన సొంతమనిషి దగ్గరే వేషం ఇప్పించలేని మనిషి మరొకరి దగ్గర ఏం ఇప్పిస్తుంది? ఇంటి దగ్గర లేచిరావడంతో గ్రామమంతా అల్లరి పట్టించి ఉంటారు నా పేరు. తిరిగి అక్కడకు వెళ్ళి బతకడం సాధ్యం కాదు. నేను పెద్దగా చదువుకోలేదు. అందువల్ల ఆమె చూపించిన మార్గంలోనే నడువ వలసివచ్చింది ఇష్టం లేకున్నా!"

"రోజుకు ఎంత రాబడుతుంది?"

"అవకాశాన్నిబట్టి ఐదొందలకు తగ్గ కుండా రాబడుంది?"

"నీవు వచ్చి ఎన్ని నెలలవుతుంది?"

"ఇరవై రోజులయింది. వచ్చిన వారం వరకు బాగా చూసింది. ఆ తర్వాత బల వంతంగానే దించింది. దిక్కూ దివాణం లేదు కాబట్టి లొంగిరాక తప్పలేదు."

"నీవు గాక ఇంకా ఉన్నారా ఆమె చేతికింద?"

"మరో నలుగురు ఉన్నారు. వారి చరిత్రలూ ఇంతే! వాళ్ళు వచ్చి నెలల తరబడి అయింది. పైగా వారినుంచి ఆమె డబ్బురూపంగా ఏమీ పొందలేదు. నా నుండి నగల రూపంలో పదివేల రూపా యలు పైగా పొందింది. నన్ను మా గ్రామంనుండి తెచ్చినవాడికి ఖర్చుల కొరకని సగం ఇచ్చానని చెప్పింది. మీలాంటి కొత్తవారు ఫీల్డులోకి వస్తే ఊరించి, మమ్మల్ని తార్చి డబ్బు లాగు తుంది. వేషాలు ఇవ్వమని మిమ్మల్ని అడుగుతుంది. ఎలాగూ ఇవ్వరని ఆమెకూ తెలుసు. మమ్మల్ని నమ్మించ డానికి ఆమె చేసే నటన అది. ఆ విధంగా మా కొరకు శ్రమపడుతున్నట్లు మేము భావించడానికే! ఆరోగ్యరీత్యా ఇంకా నేను నాశనం కాలేదు. గనుక నన్ను ఈ రోజు ముందుకు తోస్తున్నది. ఫలితం ఆమెకూ, నాకూ తెలుసు. వెళ్ళమన్నది కనుక వచ్చాను."

"నీ బతుకు నీవు బతకాలంటే స్వేచ్ఛగా ఎక్కడికయినా ఇటే వెళ్ళిపోవచ్చు కదా? ఆ మురికికూపంలో ఎందుకు ఉండాలి?"

బాధగా పెదవులు కదలించి నవ్వింది. "ఎక్కడికి పోయినా ఇంతే! అందరూ ఈ బ్రోకరేజీతోనే డబ్బు సంపాదిస్తు న్నారు. మరి ఎవరయితే ఏం? ఈ నగరం విడిచి పారిపోవాలంటే, నేను చెప్పాగా

నాకా తెలివితేటలు, చదువూ లేవని."

"మేం పాత్రఇస్తామనుకో! నటిస్తావా?"

సంతోషంగా తలెత్తి అతని కళ్ళల్లోకి చూసింది. కన్నీళ్లతో నిండిన ఆ ముఖంలో వెలుగు రేఖలు చూశాడు.'అమాయకురాలు' అనుకున్నాడు. కనీసం మద్రాసుకు వచ్చినందుకు ఒక ఆడపిల్ల జీవితాన్నయినా బాగుచేయడం మంచిదేమో ననుకున్నాడు. పైగా అమాయకురాలుగా ఉంది. చదువు పెద్దగాలేదు. ఇటువంటి వ్యక్తిని అడ్డుపెట్టుకుని, దొరికిన ప్రతి రోజూ ఐదు వందలు పైగా సంపాదిస్తోంది కన్నమ్మ. ఉడిగిపోయి సినిమాల నుండి విరమించిన ప్రతి ఆడదీ,అమాయక ఆడపిల్లల్ని చేరదీసి, సినిమా ఛాన్సు పేరుతో కట్టిపడవేసి, బ్రోకరేజీ వ్యాపారం చేసుకుంటారని గతంలో తాను విన్నాడు. కానీ ఈ రోజు నిజంగానే చూస్తున్నాడు.

శివరావు ఆ అమ్మాయి చరిత్ర వింటూ బాధపడుతూ కూర్చున్నాడు.

"కొత్తవాళ్ళకు పాత్ర ఇవ్వాలంటే కష్టం! అసలే నీవు అమాయకంగా ఉన్నావు. ఎంతవరకు నటించగలవు? అంతో ఇంతో అనుభవం ఉండి కనీసం చిన్న పాత్ర వేసినా అవకాశం ఇచ్చేవాడిని. అలాగే కొందరికి ఇచ్చాను కూడా! మరి నీకు ఏమీ అనుభవంలేదు గదా"

సరిత మాట్లాడలేదు. తలవంచుకుని గోళ్ళు గిల్లుకుంటున్నది.

"పోనీ! ఈ పాడు జీవితం ఎందుకు? మీ యింటికి పంపించే ఏర్పాటు చేయిస్తాను. ఈమె చెర నుండి విడిపిస్తాను. ఇంటికి వెళ్ళు."

తల అడ్డంగా ఊపింది. "మావాళ్ళ కందరికీ అపకీర్తి తెచ్చాను. చావలేకనే ఇలా బతకడం గానీ సినిమాలలో అవకాశం దొరుకుతుందని కాదు."

నౌకరు వచ్చి లైట్లు వేశాడు. చీకటిని పారదోలుతూ ట్యూబ్‌లైట్లు వెలిగాయి. పాలగిన్నె తెచ్చి శివరావుకు అందించాడు. శివరావు పాలగిన్నె తీసుకొని లోనికి వెళ్ళాడు. పోతున్న అతన్ని చూస్తూ "అతడు వంటమనిషా?" అంది ఆశ్చర్యంగా. దుస్తులు చూస్తే బ్రహ్మాండంగా ఉన్నాయి.

రామారావు నవ్వాడు. "వంటమనిషి కాడు. వెర్రిబాగుల బ్రాహ్మణుడు. సినిమా రంగంలో నిష్ఠ పనికిరాదురా అంటేవినడు. వాడి నిష్ఠ, జపతపాలు ఇక్కడ కూడా చేస్తూ మా ప్రాణాలు తీస్తున్నాడు. ఒకసారి డైరెక్టర్ మణ్యం ఇంట్లో కూడు తినడానికి వాడి తల పగిలిపోయినంత పనయింది. ఇంటికి వచ్చి, పుళ్ళీ శుద్ధి చేసుకునేదాకా వాడు మమ్మల్ని తిడుతూనే ఉన్నాడు. ఏం చేస్తాం? వాడి వంట వాడే చేసుకుంటున్నాడు"

"ఈ కాలంలో కూడా ఇటువంటివాళ్లు ఉన్నారా?" అంది ఆశ్చర్యంగా.

"బోలెడు మంది."

"మీ భోజనాలు ఎలాగ చేస్తున్నారు?"

"హోటల్లలో! పైగా ఎప్పుడు ఇంటికి వస్తామో పోతామో తెలియని పనులు. అందువల్ల వంటమనిషిని ఇంకా ఏర్పాటు చేసుకోలేదు."

"నన్ను ఉండమంటారా?" అంది ఆశగా తలెత్తి చూసి. ఆ మాటకొరకు ఎదురుచూడని రామారావు క్షణకాలం ఆమె కళ్ళల్లోకి చూసాడు. చూపు మరల్చుకుంది. ఆలోచించాల్సిందే అనుకున్నాడు. ఆ విధంగానయినా ఆమెకు విముక్తి కలిగిస్తే బాగుంటుంది.

"చూద్దాం! మావాడు రానీ! ఇంటికి





వెళ్తావా? నేను కూడా బజారు వెళ్ళాలి'' అన్నాడు లేస్తూ. సరిత లేచి నిలబడి కొంగుతో ముఖం తుడుచుకుంది.

ఇద్దరూ బయటకు వచ్చారు. టాక్సీ పిలిచి ఎక్కించి, ఆమెను పంపేశాడు. మరో టాక్సీని పిలిచి మాంబళం వైపు తీసుకపొమ్మన్నాడు.

● ● ●

కళింగ వచ్చాడు ఆఫీసుకు. ఆ సమయానికి శివరావు హాయిగా పడుకున్నాడు రేడియోలో పాటలువింటూ.

"ఎవరూ లేరా ఏమిటి?" అన్నాడు కూర్చుంటూ.

"వస్తారు. భోజనానికెళ్ళారు" అన్నాడు శివరావు లేచి కూర్చుని. మరో పావు గంటలో రామారావు వచ్చాడు.

"షూటింగ్ ప్రారంభానికి అన్నీ సిద్ధం చేయబడుతున్నాయి. కొంతమంది జూనియర్ ఆర్టిస్టులను కూడా సిద్ధం చేసుకుంటే జాతర ఊరేగింపు పాట తీయవచ్చు" అన్నాడు కళింగ.

"మాట్లాడదాం. బ్రోకర్ను పిలిపిస్తాను" అంటూ ఫోన్ చేశాడు. మరో పావుగంటకు బ్రోకర్ వీరయ్య వచ్చాడు. అందరికీ నమస్కారాలు చేసి ఎదురుగా నిలబడ్డాడు.

"ఎంతమంది కావాలి?" అన్నాడు రామారావు కళింగను చూస్తూ.

"కనీసం పదిమంది మగవాళ్ళు, ఆరుగురు ఆడవాళ్ళూ కావాలి. ఔట్ డోర్ షూటింగు గనుక, వీరి వెనుక జనాన్ని నిలబెడితే సరిపోతుంది."

వీరయ్య వైపు చూశాడు రామారావు.

"ఛార్జీ ఎలా వసూలు చేస్తున్నారు?"

"మనిషికి కాల్‌షీటుకు యాభై రూపాయలు వసూలు చేస్తామసార్!" అన్నాడు వీరయ్య.

"తగ్గింపులు ఏమీ ఉండవా?"

"అక్కడికే గిట్టదు సార్! అందరూ అదే రేటుతో ఇస్తున్నారు."

"మనకు ఎప్పుడు కావాలి కళింగ గారూ!"

"రేపు ప్రారంభోత్సవంతో పాటు, కొంత ఇన్‌డోర్ షూటింగ్ తీద్దామనుకోండి. మంగళవారానికి పూర్తిగా ఔట్ డోర్‌లోనికి వెళ్ళితే, జాతర షాట్‌తో పాటు ఇంకా కొన్ని డ్యూయెట్లు కూడా పూర్తి చేద్దాం. మంగళవారం నుండి వారం రోజులపాటు ఏర్పాటు చేయవయ్యా!" అన్నాడు కళింగ వీరయ్యతో.

"అడ్వాన్సు ఏమైనా ఇస్తారా?" అన్నాడు వీరయ్య.

రామారావు కళింగ వైపు చూశాడు. కళింగ కనుసైగ చేయడంతో వంద రూపాయలు చేతిలో పెట్టాడు.

"కనకారావుగారు ఎక్కడికి వెళ్లారు?"

"ఆయనగారు ఫిల్మ్‌రోల్ కొరకు ఇంకా తిరుగుతూనే ఉన్నాడు. బ్లాక్‌లో కొనక తప్పడం లేదట. విపరీతమైన రేట్లున్నాయట."

"రేపటికి అందర్నీ సిద్ధంగా ఉండమని చెప్పారా?"

"అదంతా మా మేనేజరు చూసుకుంటున్నాడు. మేనేజరును కూడా నియమించాము. ఆ బాధ్యతలు అతడే చూసుకుంటాడులెండి."

"కొత్త వాళ్ళను నియమించుకోకకండి. ఇండస్ట్రీలో అనుభవం లేకుంటే ఆర్టిస్టులతో పని చేయించలేరు" అన్నాడు కళింగ.

కళింగ వెళ్ళిపోయాడు. ప్రారంభోత్సవ కార్యక్రమాలు చురుకుగా సాగు

న్నాయి.

"ఏరా! నువ్వు కూర్చోవడమేనా? ఏదైనా పని చేస్తావా?" అన్నాడు శివ రావుతో.

"నేను ఏ పనీ చేయలేను. చూస్తూ కూర్చుంటాను. డబ్బు పెట్టుబడి పెట్టినం దుకు ఇది గుణపాఠం నాకు..."అన్నాడు శివరావు.

అతని వైపు తిరస్కారంగా చూసి బయటకు వచ్చాడు రామారావు. కారు వద్దకు వచ్చి కూర్చుంటూనే, ఖాదర్ వచ్చి కారు ఎక్కాడు.

రాయ్ డిస్ట్రిబ్యూటర్ ఆఫీసు వద్ద దిగి పైకి వెళ్ళాడు. అంతకు ముందే పరిచయాలు అయివుండటం వల్ల ఆఫీసు మేనేజర్ లేచి కరచాలనం చేశారు.

"రేపు మా పిక్చర్! ప్రారంభోత్సవం. మీరు రావాలి" అన్నాడు ఇన్విటేషన్ కార్డు అందిస్తూ.

"తప్పకుండా!" అన్నాడు అందుకుని "పేరేమిటి పెడుతున్నారు?"

"నిర్ణయించలేదు. తర్వాత ఆలో చించుకోవచ్చు."

దిగివచ్చి కారెక్కాడు. మణ్యం ఇంటికి వచ్చాడు. ఆపాటికి మణ్యం హాలులో కూర్చొని విసురుకుంటున్నాడు ఆయాసంతో. ఆయనకూ ఇన్విటేషన్ అందించి రేపు తప్పక రావలసిందిగా ఆహ్వానించాడు రామారావు.

"తప్పకుండా వస్తాను. నేనే డైరెక్ట్ చేయవలసింది కదా! సరే! తప్పిపోయింద నుకో!" అన్నాడు.

నాగిని వచ్చి సమస్కరించింది. ప్రతి నమస్కారం చేసి; పెందలకడనే రమ్మని చెప్పి దిగివచ్చాడు.

ఇన్విటేషన్‌లు పంచడం పూర్తిచేసి ఆఫీసుకు వచ్చేసరికి, కనకారావు ఆఫీసు లోనే ఉన్నాడు.ఐదారు బాక్సులు హాలు మధ్య ఉన్నాయి. చాలామంది ఆఫీసులో అటు ఇటు తిరుగుతున్నారు. శివరావు రంగు కాగితాలు అంటించే పత్రవాళ్ళ వద్ద కూర్చుని సలహాలిస్తున్నాడు.

"ఇన్విటేషన్స్ పూర్తయ్యాయా?" అన్నాడు కనకారావు. తలూపాడు రామారావు.

"కలర్ రోల్స్ స్టాకులేవు. పది దొరి కాయి. వాటితో ప్రారంభిద్దాం. ఔట్‌డోర్ షూటింగ్ సమయానికి మిగతావి అందిస్తా మంటున్నాడు ఏజెంటు" తలూపాడు రామారావు. ఫోన్ వద్దకు వచ్చి ఫోన్ చేశాడు కన్నమ్మకు.

"నేను రావాలనుకున్నాను; రాలేక పోయాను. ఇన్విటేషన్ మీకు ఇచ్చారా?"

"ఆ! ఇచ్చాడు. రేపేగా! తప్పకుండా హాజరవుతాను" అంది కన్నమ్మ.

"మాకు ఇంట్లో ఎవరూ లేరు. ఇక్కడ అతిథుల సౌకర్యాలకొరకు ఆడమనిషి కావాలి. సరితను పంపుతారా?"

"రేపా, ఇప్పుడా?"

"ఇప్పుడే పంపాలి. ఇప్పటి నుండీ అవసరమే కదా!"

"సరే! పంపుతాను" అంది.

ఫోన్ పెట్టేసి కనకారావు వద్దకు వచ్చాడు.

"సరితను పంపుతానందా?"

"పంపుతానంది. షూటింగ్ ఇన్‌డోర్ అంతా ఈ ఇంటిలోనే తీయవచ్చునంటు న్నాడు కళింగ. స్టూడియోలలో విప రీతంగా అద్దె చెల్లించాలి. పైన, కింద విశాలమైనహాలు, రూములు ఉన్నాయి గనుక ఇదే సరిపోవచ్చునట. ఆలోచిస్తే




మంచిదేమో?" అన్నాడు.

కనకారావు తలూపాడు. "ఆలోచించాల్సిందే!" అన్నాడు.

మేనేజరు గురవయ్య వచ్చాడు. "సంగీత దర్శకుని వాయిద్యాలతో సిద్ధంగా రమ్మని చెప్పాను సార్!" అన్నాడు వారిదగ్గర నిలబడుతూ.

"వస్తార్లేగానీ, ప్రొడక్షన్ విషయాలు జాగ్రత్తగా చూసుకోండి. మాకు తెలియనివి చాలా ఉంటాయి ఏ మాత్రం ఆలస్యం జరిగినా మీదే బాధ్యత" అన్నాడు కనకారావు.

"ఆ బాధ్యతలు నాకు విడిచిపెట్టండి" అన్నాడు గురవయ్య. రామారావు మేడ మీదకు వెళ్ళి, తన రూంలో కూర్చున్నాడు లెడ్జర్స్ ముందువేసుకుని. ఇప్పటికే విపరీతంగా ఖర్చయింది. ఇక ఇప్పటి నుండీ సక్రమంగా ప్రవర్తిసేగానీ కుదరదు. తెచ్చిన మూడు లక్షల్లో లక్షకుపైగా ఖర్చయింది. కనీసం డిస్ట్రిబ్యూటర్ నుండి డబ్బురాబట్టాలన్నా ఐదారు రీళ్ళు పూర్తి చేయాలి. అందువల్ల మిగిలిన మొత్తంతో జాగ్రత్తగా ప్రవర్తించాలి.

కనకారావు పైకి వచ్చాడు. పదివేలు తీసుకుని దిగి వెళ్ళిపోయాడు. కరెంటు షార్ట్‌లో ఉన్నట్లుంది. డిమ్‌గా ఉన్నాయి లైట్లు.

తలుపు దగ్గర అలికిడి కావడంతో తలెత్తి చూశాడు. తలుపు వద్ద నిలబడి సమస్కారం పెట్టింది సరిత.

"రా!" అన్నాడు తలూపుతూ.

వచ్చి అతడి ఎదురుగా నిలబడింది.

"మీ అమ్మగారు చెప్పారా ఎందుకు నిన్ను పిలిపించామో?"

"చెప్పిందండి" అంది తలూపుతూ.

"ఈ రాత్రి ఎవరూ ఇక్కడ నిద్రపోలేరు. ఏదో ఒక పనిలో తిరుగుతూనే ఉంటారు. రేపు అందరికీ టీ, ఫలహారాలు సప్లయి చేయాలి. సప్లయి కొరకే నిన్ను పిలిపించాను. ఈ తొందర తగ్గిపోయిన తర్వాత నీ విషయం ఆలోచిస్తాను" అన్నాడు.

"మీ ఇష్టం! చెప్పిన పని చేస్తాను" అంది సరిత. శివరావును పిలిచి "వంటగది ఆమెకు అప్పచెప్పి, ఆమె చెప్పే వస్తువులు తెప్పించేదానికి ప్రయత్నం చేయి. ఈ రెండు రోజులు ఆమెకు తోడుగా ఉండు. తర్వాత ఆమే సర్దుకుంటుంది" అన్నాడు. శివరావు తలూపి, కింది దిగి వెళ్ళాడు. ఇద్దరూ వెళ్ళిపోయిన తరువాత లెడ్జర్ మూసి బీరువాలో పెట్టి మంచం మీద వాలాడు. విసుగ్గా,అలసటగా ఉంది శరీరం! ఈరాత్రి అన్ని ఏర్పాట్లు జరిగి రేపు ఉదయం ఎనిమిది గంటల నుండీ ప్రారంభోత్సవ కార్యక్రమంజరగాలి.

కణతలు అదురుతున్నాయి. తల నొప్పిగా ఉంది. అతిగా ఆలోచించడంతో తల తిరుగుతున్నట్లనిపించింది.

ఎవరో తట్టి లేపుతుంటే లేచాడు. ఎదురుగా కనకారావు.

"ఇదేమిట్రా? ఎనిమిది గంటలకే పడి నిద్రపోతున్నావ్!"

"తలనొప్పిగా ఉండి పడుకున్నాన్లే!"

"టాబ్లెట్స్ వేసుకోకూడదూ?"

జవాబివ్వకుండా లేచి కూర్చున్నాడు.

"ఎవరితో క్లాప్ కొట్టిద్దాం?" అన్నాడు కనకారావు.

"శివరావు గాడితో కొట్టించు. వాడికీ తగిన గౌరవం ఇవ్వడం మన బాధ్యత" అన్నాడు రామారావు.

"అది కాదురా! మంచి పెద్ద డైరెక్టరు

చేతనో, లేకుంటే హీరో, హీరోయిన్ బాగా పేరు తెచ్చుకున్నవారితో కొట్టిస్తే బాగుంటుందికదా!''

కోపంగా చూశాడు కనకారావు వైపు.

"ఈ చచ్చు సినీపద్ధతులు నాదగ్గర పనికిరావు. ఈ వెధవలతో మనం డబ్బు ఖర్చు పెట్టించి కొట్టించడ మెందుకురా! బ్రహ్మాండంగా పేరు సంపాదించుకొని ఉండవచ్చు గానీ అంతకంటే బ్రహ్మాండంగా చెడతిరిగిన జాతి ఇది అన్న విషయం గుర్తుంచుకో! ఎవరూ వద్దు. చాలా నీతిమంతురాలంటున్నావు కదా! సరోజ చేతనే చేయించు. అంతేగానీ, వెధవలనందర్నీ గౌరవించవద్దు.''

"సరోజమ్మాత్రం ఎందుకు ? ఎవడూ కొట్టవద్దులే! శివరావు గాడి పూజతో కార్యక్రమం ప్రారంభిద్దాం.''

పకపక నవ్వాడు రామారావు. "మనం దేవుడు లేడనే ఇతివృత్తం తీసుకున్నాం. ప్రారంభంలో దేవుడికి పూజచేయిస్తున్నాం. అదికూడా నిఖార్సయిన బ్రాహ్మణుడిచేత. ఒరే నాయనా! సినిమా జీవితానికీ, ఆచరణకూ తేడాఅంటే ఇదేరా! నా ఆశయాలు చంపేయకురా!''

"నీ ఆశయాలు నీవు చాంబ్‌చానల్‌లో దుమకంండ్రా! జనం దృష్టిలో పడకుంటే మన సినిమా సీన్మగా మారుతుంది. శివరావుతో పూజ చేయించాలి.''

"ఏదో ఒకటి ఏడువు!" అన్నాడు రామారావు విసుక్కుంటూ. లేచి కింది



హాలులోకి వచ్చాడు. బయట కాగితపు తోరణాలు కడుతున్నారు వరుసలుగా ! లోపల కిటికీలకు, తలుపులకు కొత్త కర్టెన్స్ వేశారు. హాలును షూటింగ్ కొరకు మారుస్తున్నారు. ఒకవైపు వేదిక ఏర్పాటు చేశారు. వేదికమీద సీతారాముల విగ్రహాలు. వెనుక లక్ష్మణుడు. కాళ్ళవద్ద ఆంజనేయుడు. వేదిక దిగువ పీఠంమీద పూజాది కార్యక్రమాలకొరకు వస్తువులు. హాలులో టేబుల్స్, కుర్చీలు సర్దుతున్నారు. ప్రొడక్షన్ మేనేజరు సరిచూస్తున్నాడు. శివరావు అటు ఇటు తిరుగుతున్నాడు.




ఉదయం ఎనిమిది గంటలకే కెమేరాలు తీసుకువచ్చారు. వాయిద్యాల్నీ, మనుషుల్నీ వెంటపెట్టుకు వచ్చాడు సంగీత దర్శకుడు శంకర్. కెమేరామన్ పూజావేదిక దగ్గర కెమేరా ఏర్పాటు చేశాడు షాట్ తీయ డానికి అనువుగా. కళింగ డైరెక్షన్స్ ఇస్తు న్నాడు—ఏ పొజిషన్‌లో తీయాలో, ఎలా తీస్తే బాగుంటుందో! ఫొటోగ్రఫీ డైరెక్టర్ వింటూ, సలహాలనుకూడా అందిస్తున్నాడు. కెమేరామన్ డైరెక్టరు చెప్పే విధంగా ప్రవర్తిస్తున్నాడు. ఆహ్వానితులు ఒక్కొ క్కరే వస్తున్నారు. రంగు రంగుల చీరలు, జాకెట్లతో, వివిధ రకాల జుట్టు ముడులతో వస్తున్న వారిని కనకారావు చిరునవ్వుతో ఆహ్వానిస్తున్నాడు. మంత్రి గారి కొరకు రామారావు కారుతీసుకెళ్లాడు. శివరావు వచ్చినవారిని కూర్చోపెట్టడానికి ప్రయత్నిస్తున్నాడు. లోపల టీ మరగ బెట్టడంలో మునిగిపోయింది సరిత !

పదిగంటలు పూర్తయిన తర్వాత మంత్రిగారు అట్టహాసంగా సపరివార సమేతంగా విచ్చేశారు. కార్లు వచ్చి గేటుముందు ఆగాయి. మంత్రిగారు వచ్చిన వార్తవిని, వచ్చినవారందరూ బయటకు వచ్చి మూగారు. డైరెక్టర్ కళింగ గేటుకు ముందు పెద్ద రిబ్బన్ కుర్రాళ్ల చేత కట్టిం చాడు.

మంత్రిగారు చేతులూపుతూ, సకిలించి ఒకచేత పంచె కుచ్చెళ్లు పట్టుకొని గేటు ముందుకువచ్చాడు. అతడి పొట్ట చూస్తూ నిల్చున్నాడు శివరావు తదేకంగా!

కలర్ పేపర్లు కటింగ్‌చేసి అక్కడే పారేసిన కత్తెరను బట్టతో శుభ్రంగా తుడిచి పళ్ళెంలో పెట్టుకొని వచ్చాడు అసిస్టెంటు డైరెక్టర్. దాన్ని అందు కున్నారు మంత్రిగారు – మాంచాల చేతి నుండి ఖడ్గం అందుకున్న బాలచంద్రుడిలా! అంతకు ముందే కాగితాలు కత్తిరించి అరిగి, లూజు అయిన కత్తెరతో ఐదు సార్లు పండ్లు బిగబట్టి ఎట్టకేలకు తెంచాడు రిబ్బన్. అందరూ చప్పట్లు కొట్టారు. లోనికి వచ్చి పై హాలులోనికి వెళ్ళారు. టేబుల్స్, బల్లలు, కుర్చీలు అక్కడ అమ ర్చారు. మొత్తం వందమందిదాకా ఉన్నారు అతిథులు. కుర్చీలలోకూర్చున్నారు. సరిత- కుర్రవాళ్లు పెద్ద స్టీల్ తట్టలో ప్లేట్లు పెట్టు కుని నడుస్తుంటే, వారిముందు నడుస్తూ అతిథులకు స్వీట్ ప్లేట్లు అందించింది. నవ్వుకుంటూ, ఛలోక్తులు విసురుకుంటూ తినడంలో మునిగారు అతిథులు. కనకా




రావు మంత్రివద్ద కూర్చుని తినడానికి సిద్ధపడుతున్నాడు. శివరావు అతిథుల మధ్య కుర్చీ చిక్కించుకుని కూర్చున్నాడు. రామారావు అటూ ఇటూ తిరుగుతూ కుర్రవాళ్ళకు పని పురమాయిస్తున్నాడు. కళింగ దగ్గరగా వచ్చి "నాదో అయిడియా!" అన్నాడు.

ఏమిటన్నట్లు చూశాడు రామారావు.

"మంత్రిగారితోనే క్లాప్ కొట్టిస్తే?"

"వాడి క్లాపూ వద్దు, కాళ్లూ వద్దులే. ఎవడూ క్లాప్ కొట్టకపోతే వచ్చే నష్టం ఏమైనా ఉందా?'' అన్నాడు కటువుగా.

కళింగ నీళ్ళు నమిలాడు "లేదనుకోండి. సరే! మీ యిష్టం!" అన్నాడు.

క్లాప్ కొట్టడం చూద్దామన్న అతిథులకు ఆశాభంగం కలిగింది. మరో ప్రోగ్రాం ఉందని మంత్రిగారూ, ఆయన పరివారమూ లేచి వెళ్ళిపోయారు. అందరూ లేచి శుభాకాంక్షలు తెల్పి ఇళ్లకు వెళ్ళిపోయారు. ప్లేట్లనూ, టీ గ్లాసులనూ తీయించి శుభ్రం చేయించింది సరిత! టేబుల్స్, కుర్చీలు తెచ్చిన చోటికి పంపాడు మేనేజరు. హాలులో డెట్టాల్ చల్లి శుభ్రంగా తుడిపించింది సరిత. సరిత పనిచేస్తుంటే చూస్తూ కూర్చుంది కన్నమ్మ. తన ఇంటిలో నెల రోజులనుండీ కూర్చుని తినడానికి విసుగుపడే సరిత ఇక్కడ చాకిరీ చేస్తున్నది.

"ఇహ! వెళ్ళిపోదామా సరితా?" అంది కన్నమ్మ అంతా అయిపోయాక. తల ఊపింది సరిత. 'ఈ ఇరవైగంటలూ స్వేచ్ఛగా ఉంది ప్రాణానికి. తిరిగి ఆ యమకూపంలోపడి, సింగారించుకుని వచ్చేవారికి ఎదురుచూడాలి. ఇంతేనా జీవితం' అనుకుంది. హాలు తుడుస్తుంటే, ఇంటి దగ్గర తన ఇల్లు తుడుస్తున్న రోజులు జ్ఞాపకం వచ్చాయి.

కింద షాట్ తీయడానికి ప్రయత్నాలు ఆరంభించారు. మొదటి షాట్ హీరో నిద్రపోతూ ఉండటం. ఇంట్లో అందరూ నిద్రపోతూ ఉండగా, నిద్రనుండి లేచి అర్ధరాత్రి చెరువుగట్టు వైపు వెళ్ళడం. నిద్రపోవడం, లేవడం, బయటకు వెళ్లడం వరకూ అక్కడ పూర్తిచేసుకోవచ్చు.

హీరో రాంగోపాల్‌కు మేకప్ వేశారు. అతడి తండ్రి పాత్రకూ, తల్లి పాత్రకూ, అన్న పాత్రకూ జూనియర్ ఆర్టిస్టులకు మేకప్‌చేశారు. అందరూ పడుకుని నిద్రపోతున్న సమయం. తలుపులువేసి చీకటి కల్పించి, లైట్లువేశారు. కెమెరామెన్‌తో పాటు, కెమెరా డైరెక్టర్ కెమెరాలెన్స్ సరిచూస్తున్నారు. లెన్స్‌కు సరిగ్గా సరిపడే విధంగా సుద్దముక్కతో గీతగీస్తున్నారు. అందులోకి వచ్చేటట్లు మంచాలు లాగుతున్నారు.

డైరెక్టర్ కళింగ వాతవరణం చూసుకున్నాడు. కెమెరా యాంగిల్స్ చూశాడు. పాత్రధారులు నటించే విధానం అంతకు ముందే చెప్పిఉండటంవల్ల 'ప్రొసీడ్' అంటూ అరిచాడు.

అర్ధగంట తంటాలుపడి ఆరుషాట్స్ తీశాడు. ఆపాటికే కళింగ కంఠం పగిలిపోయింది అరవలేక. నిన్నటిదాకా జూనియర్‌గా పడిఉన్న హీరోకు సరిగ్గా అర్థం కావడంలేదు. డైరెక్ట్ చేయడం అసలు ఇతడికే అర్థం కాలేదనుకున్నాడు రాంగోపాల్. ఒక షాట్‌లోనే కట్ చేసి, తిరిగి చెప్పడంలోనే తేడా చూపించి చెపుతున్నాడు. ఒక షాట్‌లోనే రెండు రకాలుగా చెప్పడంతో రాంగోపాల్ తికమక పడుతున్నాడు – ఏ విధంగా నటించడమాని.

ఎలాగయితే ఏం, నిద్రపోతూ ఇంట్లోనుండి బయటకువెళ్తున్నట్లు తీశారు.



అంతటితో ఆ రోజు విరమించుకున్నారు. హీరోయిన్ పాత్రగానీ, ఇతరుల పాత్రలు గానీ లేకపోవడంవల్ల అంతకుముందేవాళ్లు వెళ్ళిపోయారు.

కెమెరా డైరెక్టర్, అతని పరివారం కెమెరాతోసహా వెళ్ళిపోయాక, కళింగ విసుక్కుంటూ "నేను కెమెరా తిప్ప మన్నట్లు తిప్పడానికి బదులు, వాడి ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నాడు" అన్నాడు.

"డైరెక్టరుగా నీహక్కు చెప్పవయ్యా! అలాఎందుకుచేస్తాడు? ఆవిధంగా అయితే మరొకరిని ఏర్పాటు చేసుకుందాం" అన్నాడు కనకారావు.

"చూద్దాం. ఇలా అయితే పనిసాగదు. ఈరోజువరకూ ఫర్లేదనుకో. అరగంటలో ఆరుషాట్స్ లాగగలిగాము. ఇంకా ఇంత కంటే వేగంగా మనం కదిలిపనిచేయాలి" అన్నాడు కళింగ.

"ఈరోజు పాటల రికార్డింగ్ కార్య క్రమం తీసుకుందామా ?" అన్నాడు కనకారావు.

"ఈరోజు రెస్ట్ తీసుకుందాం. రేపటి నుండీ నిర్విరామంగా పనిచేద్దాం. ఔట్ డోర్ షూటింగ్ మనదానిలో పెద్దగా లేదు లెండి. ఇన్‌డోర్ షూటింగే ఎక్కువ. ఈ ఇంట్లోనే హాయిగా తీసుకోవచ్చు. ఇన్‌డోర్ షూటింగ్ వల్ల డబ్బింగ్ ఖర్చు తగ్గిపోతుంది" అన్నాడు కలింగ.

మిగిలినవాళ్లు కూడా ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. కన్నమ్మ కనకారావు వద్దకు వచ్చి "మేం వెళ్ళిపోతున్నాము. సరితనుకూడా తీసుకెళ్తున్నాను. పనేమీ లేదుకదా!" అంది.

"నేను పంపించమంటే పంపావా?ఎవరు పంపించమన్నారో వాళ్లనే అడుగు పని ఉందో లేదో !" అన్నాడు నవ్వుతూ కనకారావు.

"అలాగే అడుగుతాను కానీ, దానికి ఏదయినా వేషం ఇవ్వకూడదూ అభివృద్ధి లోకి వస్తుంది."

"అన్నీ పూర్తి చేశాము. అందువల్ల సాధ్యంకాదు. అయినా ఆ అమాయకు రాలు సినిమాలో నటించి పేరు తెచ్చు కుంటుందో లేదో గానీ నీలాంటి వాళ్ళకు మాత్రం ఉపయోగ పడుతుంది."

కోపంగా చూసింది కన్నమ్మ.

"నీ చచ్చిన కూతలు చాలా విన్నా లేరా నాయనా!" అంటుండగానే రామా రావు వచ్చాడు. తిట్టటం ఆపి "సరితతో ఇక పనిలేదు కదా బాబూ! తీసుకెళ్తాను" అంది అతనివైపు చూస్తూ.

రామారావు సరితవైపు చూశాడు. తల వంచుకుని నిలబడింది! 'నిన్నరాత్రి ఇక్కడ విశ్రాంతి తీసుకుంది. తిరిగి ఆ అందం మళ్ళీ కుళ్ళిపోతుంది' అనుకు న్నాడు. ఎలాగూ వంటమనిషి అవసరం. ఈ సినిమా అయిన తర్వాత విషయాలు ఆలోచించుకోవచ్చు; అంతవరకూ కనీసం సుఖంగా బతుకనీ అనుకున్నాడు.

"ఈ రోజు ఉండనివ్వు! ఏమంత తొందర? సామాన్లు ఏమున్నాయో, ఏవిలేవో వాడిన అమ్మాయికే తెలుస్తాయి గానీ మాకు తెలియవు కదా! అవన్నీ సరిచూచి ఉదయం పంపిస్తాను" అన్నాడు కన్నమ్మ వైపుచూసి నవ్వుతూ.

తన ఛార్జీ అడుగుదామనుకుంది కన్నమ్మ. తర్వాతయినా ఇవ్వకుండా పోరనే ధైర్యంతో "మీ యిష్టం. సరే! రేపే పంపు" అంటూ వెళ్లింది. సరిత తలెత్తి కృతజ్ఞత నిండిన కళ్ళతో అతని వైపు చూసింది.

"నీపని చూసుకోసరితా!లోనికివెళ్ళు!" అన్నాడు రామారావు.

"తప్పటడుగు వేస్తున్నావేమో! ఆలోచించుకో!" అన్నాడు కనకారావు వెళ్తున్న సరితను చూస్తూ.

"కాదనుకుంటాను. అయినా ఈ సినీ ఫీల్డులో ప్రవేశించిన ప్రతివాడూ తనకో ప్రియురాలును ఏర్పాటు చేసుకునే కాలం గడుపుతున్నాడు. అది అబద్ధం కాదని నీకూ తెలుసు. అందులో నీవూ సరోజను ఆవిధంగానే ఉంచుకున్నావు. సరితను నావద్ద ఉంచుకోవడంలో తప్పులేదుగా! పైగా,సరితను నా కాలం గడుపుకోడానికి కాక, సరిత మేలు కొరకే నేను ప్రయత్నిస్తున్నాను."

కనకారావు నవ్వాడు. "నీవుచెప్పింది నిజమేరా! డైరక్టర్లూ, నిర్మాతలూ ఎవరో ఒకరిని తమ వస్తువుగాఉంచుకుంటున్నారు. కాదనడంలేదు. నీవుకూడా ఆ విధంగానే ప్రవర్తించు. అలాగాక నీవు సరితను ఏదో ప్రత్యేకతతో చూస్తున్నావు. ఆ ఆలోచనే కొంప ముంచవచ్చు."

"సరితను గురించి నేను ఆలోచించుకుంటా గానీ, నీవు బాధపడకు. వెళ్ళి పనులు కానివ్వు. ఎల్లుండి ఔట్‌డోర్ షూటింగు ప్రయత్నాలు ఆరంభించు. నేను సెంట్రల్ వరకూవెళ్ళి టికెట్లు రిజర్వ్‌చేసి వస్తాను. ఎన్ని టిక్కెట్లు బుక్ చేయమంటావు?"

"టిక్కెట్లు ఎందుకు? వ్యాన్లలో వెళదాం; రైలు మనం వెళ్లవలసిన చోటికి ఎలాగూవెళ్ళదు. అక్కడినుండి విపరీతమైన అద్దెఇచ్చి వ్యానులు మాట్లాడుకోక తప్పదు. అందువల్ల ఇక్కడి నుండే సరాసరి వ్యాన్లలో వెళదాం" అంటూ బయటకు కదిలాడు.

పైకివెళ్తూ "సరితను పైకిరమ్మను" అన్నాడు రామారావు నౌకరుతో. శివరావు సీతారాముల ఫొటోల ముందు నిలబడి, మంత్రాలు జపిస్తూ ఆలోచిస్తున్నాడు.

సరిత వచ్చి ఎదురుగా నిలబడింది.

"కూర్చో!" అన్నాడు చూస్తూ.

పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంది.

"మీ అమ్మగారు రేపు పంపమన్నారు. వెళ్తావా?" అన్నాడు చూస్తూ.

"మీరు ఎప్పుడు పంపినా వెళ్ళిపోతాను" అంది సరిత తలొంచుకుని.

"నీకు అవకాశం ఇద్దామనుకుంటున్నాను జీవితాన్ని బాగుచేసుకోదలిస్తే! చెప్పు. మీ అమ్మగారి వద్దకు వెళ్ళితే జరిగే సన్మానం నీకు తెలుసు. నీ ఒళ్ళు అమ్మి ఆమె డబ్బుసంపాదించుకుంటుంది. చివరకు ఆరు నెలలకో, సంవత్సరానికో ఇక నీ శరీరం పనికిరాదనుకున్నప్పుడు బయటకు తరిమేస్తుంది. ఆ రోజు బజారు పాలయినా కూడు దొరకదు. ఇప్పుడే ఇంటికి వెళ్ళలేనిదానివి ఆ రోజు ఎలా పోతావ్? నీవు స్వక్రమంగా ఉండి బతకదలిస్తే ఈ చెర ముందు విడిపిస్తాను. సినిమాల్లో వేషాల కోసం పగటి కలలు కనకు. అవకాశం దొరకక కుళ్ళిపోయే వాళ్ళ గురించి పక్కకు పెట్టి, అవకాశం దొరికిన జూనియర్ ఆర్టిస్టులనే చూడు. రోజుకు యాభైరూపాయలు ఇచ్చినా, బ్రోకర్ చెయ్యిదాటి వారికి చేరేటప్పటికి ఇరవై రూపాయలే! అదీ రోజూ ఉండదు. నెలకు పది రోజులు; రెండు వందల రూపాయలు. ఆ డబ్బు పై షోకులకూ, ఇంటి అద్దెకూ చాలదు. ఇక శరీరం అర్పించకుంటే కూడు దొరకదు. ఇదీ సినీ తారల చరిత్ర! పెద్ద నటి కూడా అందరికీ పూల పాన్పులాగా తయా

రవుతేనే ఫీల్డులో ఉంటుంది. ఎవరి పక్కలోకి రాకున్నా పడిపోయి సాని కొంప పాలవుతుంది. ఈ ఫీల్డు గురించి పగటి కలలు కని, ఇంత దూరం వచ్చావు. వచ్చినందుకు దొరికిన గౌరవం చూశావు. ఇప్పటికయినాసరే గతంలో ఇంటి వద్దలాగే బతుకదలచితే, ఇక్కడే మాకు వంట చేసిపెట్టు ఈ మూడు నెలలూ! ఆ తర్వాత నీ బతుకు తెరువుకు ఏదో ఒకి అవకాశం కల్పిస్తాను. లేదా మీ ఇంటికి వెళ్తానంటే సలక్షణంగా పంపగలను. ఆలోచించుకో!" అన్నాడు.

సరిత కళ్ల నుండి నీళ్ళు కారుతున్నాయి. రెండు చేతులు ముఖానికి అడ్డు పెట్టుకొని వెక్కివెక్కి ఏడుస్తున్నది. ఏడ్చి ప్రశాంత పరిస్థితికి వచ్చే వరకూ మాట్లాడకూడదనుకున్నాడు. ఈ ఇరవై రోజులలో మద్రాసు సినీ జీవితం, ఒక్కొక్కరి దగ్గర కన్నమ్మ ఒక్కో విధంగా నటించడం, సినీఫీల్డులో అవకాశం ఇస్తానని ఆశ చూపి దొరికిన పదివేల రూపాయల నగలు స్వాహా చేయడం, వారం రోజుల నుండీ తన శరీరాన్ని అమ్మి డబ్బు సంపాదించడం—అన్నీ తెలుసుకుంటున్నా ఈ మురికి కూపంలో నుండి పారిపోయి ఇంటికి చేరడానికి ధైర్యం లేదు. మరో విధంగా పారిపోతే, మరో మురికి కూపంలో పడవలసి వస్తుందేమో? పైగా ఎవరూ ఈ మహానగరంలో తెలియదు. స్వంత వ్యక్తి సుబ్బయ్య దగ్గరే తనకు అవకాశం ఇప్పించని వ్యక్తి మరొకరి దగ్గర ఇప్పిస్తుందనే నమ్మకం లేదు. అలా అడిగినా, కేవలం తనను సంతృప్తి పరచడానికే గాని, నిజంగా వేషం ఇప్పించడానికి కాదని కన్నమ్మ మాటల వల్ల అర్థమవుతున్నది. ఎలాగయినా ఈ తార్పుడు పద్ధతిలోనే తన శరీరం మీద డబ్బు సంపాదిస్తుందని, ఇంతవరకూ ఆమె వద్ద పడి ఉన్నవారు చెప్పే చరిత్రలబట్టి తెలుస్తున్నది. ఈ పరిస్థితిలో ఇరుక్కున్న తనకు ఇంకా సినిమామోజు ఉండడం సాధ్యంకాదు. ఇప్పుడు కావలసింది సినిమాలలో నటించడంకాదు. ఇంతటితోనయినా శరీరాన్ని నాశనం చేసుకోకుండా కాపాడుకోవడం. సహకారం చేస్తాడనే ఆశ రామారావు మొదట మాట్లాడినప్పుడే కలిగింది. వారం రోజులుగా తనను కలిసి ఎవరూ తన జీవిత చరిత్ర గురించి అడుగలేదు. వారికీ తెలిసి ఉంటుంది ఈ చరిత్రలు మామూలేనని! రామారావు ఆ వ్యక్తులలాగా కాకుండా, అహంకారం లేకుండా తనతో ప్రవర్తించడం చూసి అతడి ద్వారా బయట పడతాననే ఆశ కలిగింది.

ఆవేశం తగ్గి, హృదయభారం తగ్గి, ఏడుపు తగ్గింది. కొంగుతో ముఖం తుడుచుకుంది.

"ఇంకా సినిమా మీద అభిలాష ఉందా? ఉంటే చెప్పు. నీకు తప్పకుండా అవకాశం కలిగిస్తాను ఈ సినిమాలో వరకూ! ఆ తర్వాత నీవు నీ బతుకు బతుకవచ్చు" అన్నాడు.

"నాకు సినిమా మోజు చచ్చిపోయింది. మీరిస్తారు. ఆ తర్వాత మళ్ళీ మీరు చెప్పినట్లే ఈ జూనియర్ ఆర్టిస్టుల లాగా బతుకక తప్పదు. ఆ బతుకు నేను బతుకలేను. ఇంటి దగ్గర ఎంతో గౌరవంగా బతికాను. ఆ బతుకు ఇక ఎలాగూ రాదు. కనీసం మర్యాదగా బతకడానికి అవకాశం దొరికితే కష్టం చేసుకొని




బతుకుతాను"

"సరే! మూడు నెలలు నా దగ్గిరే మాకు వంటచేసి పెడుతూఉండు. ఆ తర్వాతయినా నిన్ను బజార్లో వదిలేసి వెళ్ళను. నా వెంటనే తీసుకెళ్ళి బతకడానికి మార్గం చూపిస్తాను. లేదా మనసు మార్చుకుని ఇంటికి వెళ్తానంటే పంపిస్తాను"

"ఇంటికి వద్దండీ! వాళ్ళ గౌరవం, అభిమానం ఇప్పటికే దెబ్బతీశాను. మళ్ళీ నేను ఆ ఊరిలో తిరగడమంటే వాళ్ళు తల ఎత్తుక తిరుగుతారా? పల్లెటూళ్ళ గురించి మీకూ తెలుసు. అందువల్ల సాధ్యంకాదు. మీకిష్టమయితే ఇక్కడే ఉంటాను. కన్నమ్మ వెంట ఊబిలోకి పోవాలనుకోవడం లేదు"

"తొందరపాటు లేకుండా బాగా ఆలోచించుకో! కన్నమ్మ ద్వారా రేపు హీరోయిన్ పాత్ర దొరకవచ్చునేమో?"

"నాకు ఇక ఏదీ వద్దు! ఉన్న ఆశ చచ్చిపోయింది" అంది ఏడుస్తూ.

"సరే! కన్నమ్మకు నేను ఫోన్‌చేసి చెప్పుతాను. ఇక్కడినుండి నా అనుమతి లేనిది బయటకు వెళ్ళకూడదు. చివరకు కన్నమ్మ పిలిచినా సరే! అది నీ రక్షణకే చెప్పుతున్నాను."

తల ఊపింది సరిత. లేచి బయటకు వచ్చాడు. ఫోన్‌చేసి కన్నమ్మతో తాను వస్తున్నట్లు, ఇంట్లోనే ఉండమని చెప్పాడు. వెంటనే బయటకు వెళ్ళి టాక్సీలో వెళ్ళాడు. 'రేపటినుండి ఇతర కార్యక్రమాలున్నాయి. పైగా సరితను ఔట్‌డోర్ షూటింగుకు తీసుకెళ్ళాలి. ఇక్కడ సరితను పెట్టి తాను ఔట్‌డోర్ షూటింగుకు వెళితే బెదరించో, లాలించో తిరిగి సరితను తీసుకుని పోతుంది. అందువల్ల ముందుగానే ఆమెకు తెలియచేసి సరిత జోలికిరాకుండా చేయడం ఉత్తమం' అనుకున్నాడు.

కన్నమ్మ ఎదురుచూస్తూ ఉంది రామరావు కొరకు. ఇంతకు రెండు గంటల ముందు మాట్లాడాడు. సరిత అక్కడే ఉంది. అర్జంటుగా ఎందుకు వస్తున్నాడో ఆమెకు తెలియక ఆశ్చర్యపడుతున్నది. వచ్చి కూర్చుని సరిత వివరాలు, సరిత నిర్ణయం వివరంగా చెప్పాడు.

అంతా విన్నతర్వాత ఆవేశంగా అంది కన్నమ్మ "నాకు ఎసరు పెట్టావన్న మాట! అందువల్ల నీకు లాభమేమిటి? చెడిన ఆడది ఏ గంగలో దూకితేమాత్రం నీవు పట్టించుకోవడమెందుకు? ఆ పిల్ల నీ అవసరాలకు కావాలంటే ఇక్కడికిరా! నేను వద్దనలేదు కదా! తద్దినాన్ని నెత్తిన పెట్టుకోకు బాబూ!"

"అవన్నీ ఆలోచించాకే ఒక నిర్ణయానికి వచ్చాను. నా అవసరాల కొరకే అయితే ఇక్కడికి రావచ్చు. లేదా ఈ మహానగరంలో సవాలక్ష అవకాశాలూ ఉన్నాయి. నా అవసరం కొరకు గాక, సరిత అవసరం కొరకే ఈ పని చేస్తున్నాను. పైగా సరితపోతే, సరిత అమ్మ లాంటిది మరొకరు నీకు దొరకకపోరు. సరిత పోతే నష్టమేముంది?"

"దాన్ని గురించి నేను ఆలోచించడం లేదు. అదిపోతే మరొకటి. నిన్ను గురించి ఆలోచిస్తున్నాను. బంగారంలాంటి జీవితం ఆ చెడినదాని కొరకు పాడుచేస్తున్నావు" అంది అతన్ని చూస్తూ.

ఆ ఓదార్పు మాటలు తనను వెనక్కు నడిపించడానికేనని అతడికి తెలుసు. అందువల్ల జవాబివ్వలేదు.

"సరిత ఇక్కడికి వచ్చేటప్పటికి పది

వేల రూపాయల నగలున్నాయట! అవి నీవద్దనే ఉన్నాయట!" అన్నాడు.

"దాని దర్రిద్రం కూలా! పదివేలా పాడా! మహాఉంటే నాలుగు వేలుంటాయి. అవి కూడా దాన్ని తీసుకవచ్చినవాడు తీసుకెళ్ళాడు. ఈ ఇరవై రోజులూ దానికి తిండీ, మద్రాసంతా తిప్పడానికి ఖర్చు నా తలమీద పడ్డాయి."

ఆమె ఇవ్వదని ముందే తెలుసు. అయినా తెలుసుకుందామని అడిగాడు.

'ఆమెను బెదరించి రాబట్టడానికి ఇది తన జిల్లా కూడా కాదు. ఈ ప్రాంతంలో రౌడీలతో కూడా వీళ్ళకు సహకారాలుంటాయి. డబ్బుపోతేపోయింది. సరితను విడిచి పెడితే చాలు' అనుకున్నాడు. అక్కడి నుండి లేచి ఇంటికి వచ్చాడు.

కనకారావు, శివరావు ఆలోచిస్తూ కూర్చునున్నారు.

"వాళ్లను మాట్లాడావా?" అన్నాడు కనకారావు.

''ఎల్లుండి సాయంత్రం బయలుదేరడానికి ఇప్పటి నుంచే ఎందుకు? అప్పటికి దొరుకుతాయి. యూనిట్ సిద్ధంగా ఉందా?"

"ఎవరి బాధ్యత వారికి అప్పచెప్పాను. మేనేజరు అందర్నీ కలిసిచెప్పివస్తున్నాడు సిద్ధంగానే ఉంటారులే" అన్నాడు కనకారావు. ''ఎక్కడినుండి రావడం? కన్నమ్మ ఇంటినుండేనా?''

"అవును. నీకేలా తెలుసు?" అన్నాడు అతన్ని చూస్తూ.



"ఫోన్‌చేసింది ఇప్పుడే! ఆ విషయం గురించే శివరావుతో మాట్లాడుతున్నాను. వివరాలుచెప్పింది. బాధపడకుండా సరితను వదిలివేసుకొమ్మని కన్నమ్మకు చెప్పాను. ఎగిరి పడింది. కానీ చివరకు తగ్గిందిలే!"

'ఈ వెధవలిద్దరూ చెరొకదాన్ని వెంటేసుకొని నా డబ్బుతో జల్సాగా తిరుగుతున్నారు' అనుకుంటున్నాడు శివరావు. అతడికి ఎలాంటి అవకాశాలూలేవు. వచ్చిన వాళ్లు కూడా ఈ ఇద్దరితోనే మాట్లాడతారు. శివరావు కూడా ఒక పార్ట్‌నర్‌గా గుర్తించరు.




ఔట్‌డోర్ షూటింగు ప్రొద్దుటూరుకు నాలుగు మైళ్ళ దూరంలో ఉన్న గ్రామం వద్ద ఏర్పాటు చేశారు. వాళ్ళకు సినిమా షూటింగులంటే ఏమిటో తెలియదు. అయినా స్థానికంగా సంబంధాలు ఉండటం వల్ల, అదే బాగుంటుందన్నారు రామారావూ,కనకారావు కూడా.

జూనియర్‌లందరినీ, చిన్నవర్కర్లనూ రైల్లో ఎర్రగుంట్లకు పంపారు. అక్కడి నుండి ప్రొద్దుటూరుకు బస్సులో వస్తే, ప్రొద్దుటూరు నుండి వ్యానులో తీసుకువెళ్ళవచ్చని ఆలోచించారు. ముఖ్యుల కొరకు రెండు బస్సులు మాట్లాడుకున్నారు.

వాళ్ళు ప్రొద్దుటూరు చేరడమే బుధవారం చేరుకున్నారు. బుధవారం నుండీ తీయదలచిన షూటింగు సాధ్యం కాదనుకున్నారు. ఉదయం ఐదు గంటలకు అందరూ ప్రొద్దుటూరులో కలిశారు. రెండు బస్సులూ వెళ్ళి అందులోనున్న వారిని విడిచి, తిరిగి వచ్చి మిగిలినవారిని చేర్చి, కిరాయి తీసుకొని వెళ్ళిపోయాయి. అది పెద్ద గ్రామం కాదు. ఏడు, ఎనిమిది వందల జనాభా. అక్కడ ఏ కులానికీ నలభై ఇళ్ళకు మించిలేవు. ప్రొద్దుటూరు దగ్గిరే ఉన్నా నాగరికత లేదు. ఇప్పుడిప్పుడే అభివృద్ధిపొందుతున్నది. పశ్చిమం వైపు వంద ఎకరాల విశాలమైన చెరువు, పెద్ద కోనేరు,చెరువుకు పడమటివైపు మరో గ్రామం ఉంది. అది పెద్ద గ్రామం. అన్ని కులాల వాళ్లు అక్కడ ఉన్నారు.

ఊరికి తూర్పువైపు ఉన్న శివలింగం పురాతనమైంది. ప్రస్తుతం శిథిలమైపోయింది. గుడి నామరూపాలు లేవు. పక్కన అంకాళమ్మ దేవత గుడి కూడా శిథిలమయి ఉంది. కథ ఆ ప్రాంతానికే చెందింది కావడంవల్ల అక్కడే సినిమా తీయాలనుకున్నారు. పైగా సన్నివేశాలకు తగినట్లు పెద్ద చెరువు ఉంది. చెరువు నిండా నీరుంది. చెరువుకు తూర్పువైపు పెద్ద చెట్లున్నాయి. ఔట్‌డోర్ షూటింగ్ మొత్తం అక్కడే తీయడానికి అనుకూలం. అందువల్లనే ఎన్నుకోవడం జరిగింది. ముందుగానే మేనేజరు వచ్చి ఏర్పాట్లు చేశాడు.కోనేటివద్దనున్న సత్రం, కోనేటికి ఉత్తరం వైపునున్న మరోసత్రం బాగుచేయించాడు.వాటిలో జూనియర్స్‌ను, ఉంచారు. ఒక సత్రంలో టెక్నీషియన్లను సాధారణ వర్కర్లను ఉంచారు. డైరెక్టర్ స్థాయిలాంటి వ్యక్తులకు గ్రామంలో




ఇండ్లు మాట్లాడి పెట్టారు.

జాతర ఊరేగింపు షూటింగు ఉందని తెలిసి చుట్టుపట్ల జనంకూడా ఉత్సాహ పడ్డారు. వీరి పుణ్యమా అని నిలిచి పోయిన జాతర మళ్ళీ చేయవచ్చని గ్రామ పెద్దలు సంతోషించారు. జాతరకు కావల సిన అన్ని సౌకర్యాలు గ్రామస్తులే చేశారు అంకాళమ్మ దేవత పూజారి గ్రామం వెలుపల వేప మండలతో అలికించాడు. ఊరేగింపు తర్వాత నరకడానికి పొలం మీదపడి మేస్తున్న దేవర దున్నపోతును పట్టి తెచ్చేరు. ఊరేగింపు ఖర్చు కూడా నిర్మాతలమీద పెద్దగా పడలేదు. స్థానికులే చాలావరకూ సమకూర్చారు. తాళలు, పల కలు వాయించడానికి హరిజనులు ఉత్సాహంగా ముందుకు వచ్చారు.

జనాన్ని చూసి దిమ్మెరపోయారు సినీ నటులు, నటీమణులు. వేల సంఖ్యలో ఉన్నారు జనం. అసలే కొత్త ఆర్టిస్టులు. ఈ జనాన్నిచూసి బెదరి, నటించకుండా అల్లరి పడతారేమోనని డైరెక్టరు భయపడు తున్నాడు. వాతావరణం చూస్తుంటే సీను అద్భుతంగా ఉంది. వాళ్ళ పరిస్థితి చూస్తే ఇట్లా ఉంది.

కనకారావు వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చాడు కళింగ.

"ఈ దెబ్బతో మన సినిమా సక్సెస్ అయినట్లే! సీనరీస్ అద్భుతంగా వస్తాయి. ఈ కొత్త నటీనటులు భయపడకుండా ధైర్యం చెప్పాలి. ఇదే పాత నటీనటు లయితే అద్భుతంగా వచ్చేది" అన్నాడు

"ఇప్పుడయినా ఫరవాలేదులే!అందరికీ హెచ్చరికగా చెప్పండి. షాట్స్ తీసే టప్పుడు ప్రతి షాట్‌నూ జాగ్రత్తగా ఆలోచించి, ప్రస్ఫుటంగా ఉండే విధంగా తీయండి" అన్నాడు కనకారావు.

జూనియర్సుకు మేకప్‌లు వేసి ఊరే గింపుముందు పెట్టారు వారిని. ప్రజలను వెనుకకు నెట్టారు. స్థానికులే వలెంటీర్స్‌గా ఏర్పడి, జనాన్ని దూరంగా తోస్తున్నారు.

జాతర ఆరంభమయింది. ఆసాది పాటలు పాడుతున్నాడు. పూనకం వచ్చిన మనిషి ఊగిపోతూ వేపకొమ్మలతో చిందులేస్తున్నాడు. కొందరు దున్నను మోకులతో కట్టి అటుఇటు పట్టుకున్నారు. గణగణమంటూ వెర్రెత్తిపోయేలా పలకలు, తాళాలు వాగుతున్నాయి. కావి కొమ్ము భయమంటూ మోగుతున్నది. బాండు వాయిద్యాలు శ్రవణానందకరంగా మోగు తున్నాయి. పూజారి, ఆసాదివేషాలలో ఉన్న జూనియర్స్ ఉత్సాహంగా నటిస్తున్నారు.

మూడు కెమేరాలు మూడు వైపుల నుండీ సరిచూసుకుంటున్నారు. ఒక్క కెమెరాతో ఆ షాట్స్ తీయడం సాధ్యం కాదు. పైగా నిదానంగా టేక్, కట్ పదజాలంతో అసలేనడవదు. యాం గిల్‌ను బట్టి కెమెరా తిరుగుతూ పనిచేయ వలసిందే గానీ, కెమెరా లెన్స్ కొరకు అక్కడ నిలబడడం అసాధ్యం. కాబట్టే కెమెరాలుబండ్లమీద అమర్చి దగ్గరగానూ, దూరంగానూ బండ్లునడుపుతూయాంగిల్స్ తీసుకోవలసి వస్తున్నది. కొంత కష్టమైనా అదే మేలనుకున్నారు. ఒక్కో కెమెరా ముందు నిలిచి, ఒక్కోషాటు తీస్తూ కాలం గడపా లంటే అక్కడ ఎలాగూ సాధ్యంకాదు. కాకపోతే మరో రెండు రోల్స్ ఫిల్మ్ ఎక్కువ ఖర్చు అయినా భరించవచ్చను కున్నారు.

ఈ అరుపులకూ, తొక్కిళ్ళకూ దున్న బెంచుకుంది. దున్నను పట్టుకున్న వారు పరుగెత్తడం ప్రారంభించారు. దున్న కాలు

దువ్వి, తలతో భూమిని పొడిచి ఆసాది మీదకు దూకింది. ఆసాది భయంతో నేల మీదపడి బల్లిలా భూమినికరుచుకున్నాడు. జనం గగ్గోలెత్తి పరుగెత్తడం ఆరంభించారు. కళింగ 'టేక్ టేక్' అంటూ అరుస్తున్నాడు. దున్న తెంచుకుని పరుగెత్తడం అతనికి ఉత్సాహంగా ఉంది. ఈ సీను రేపు ప్రజలను బ్రహ్మాండంగా ఆకట్టుకుంటుందని ఆలోచించాడు.

ఈలోగా జనం దాన్ని ఆటకాయించి, పట్టితీసుకవచ్చారు. ఊరి వెలుపల బస్తా అన్నం రాసిపోసి ఉన్నారు. ఎదురుగా మూడు ముక్కోణం రాళ్లు కడిగి పసుపు కుంకమ పూసి పెట్టారు. ఆ రాళ్లముందుకు తెచ్చి దున్నకు బొట్టు పెట్టారు. దున్న బుసలుకొడుతున్నది. చాకలి ముందుకు వచ్చాడు వేట కొడవలితో! అమ్మవారిని తలుచుకుంటూ నరికాడు. రక్తం పట్టి అన్నంలో కలిపారు. అన్నం చేటలకు ఎత్తుకొని పొలిచల్లడానికి పొలం మీదకు పరుగెత్తారు. ఆతర్వాతపిల్ల హీరో మూత్రం పోయడానికి వెళ్తే జనం ఒప్పుకోలేదు. అట్లాచేస్తే తంతామన్నారు. చివరకు పిల్లవాడివీపు మాత్రమే షాట్ తీసి, ఆ తర్వాత షాట్ లో నీళ్ళుచల్లి చూపించక తప్పలేదు. ఎదురుగాతీసి పిక్చర్‌కు హుషారుకలిగిద్దామన్న కళింగ ఆశ నిరాశయింది.

వారం రోజులు ఎడతెరిపిలేకుండా ఔట్ డోర్ షూటింగు తీశారు. రాత్రి లైట్లు చెరువుకట్టమీద వేయించి, రాత్రి దృశ్యాలు చిత్రీకరించారు. ఈషూటింగ్ రామారావు, కనకారావు, శివరావుల తండ్రులు వచ్చి చూసి తమ పుత్రులు డెవలప్‌మెంట్‌లో ఉన్నందుకు సంతోషించారు.

వారం రోజుల తర్వాత తిరిగి మద్రాసుకు ప్రయాణంకట్టారు. ఔట్ డోర్ షూటింగ్‌లో ఇంతా ఖర్చు పెట్టినా యాభైవేలకు మించి కాలేదు. స్థానికంగా అన్ని సహాయాలు దొరకడం, అందులో కొంత ఉచితంగానే దొరకడం జరిగింది. పనిలో పనిగా ఆ గ్రామస్తులు జాతర పూర్తి చేసుకున్నారు. జాతరకంటే ముందు దున్నపోతుది పెద్ద బాధ అయింది. ఎక్కడ పడితే అక్కడ మేస్తున్నది పైర్లను. జాతర దున్నపోతుగనుక ఏమీ అనకూడదు. దాని పీడ ఇంతటితో పోయినందుకు గ్రామస్తులు సంతోషించారు.

• • •

ఔట్ డోర్ షూటింగ్ బ్రహ్మాండంగా తీయగలిగారన్న వార్తవిని, రమేష్ కొరకు డిస్ట్రిబ్యూటర్స్ పరుగెత్తారు. కట్ అయింది పోగా, మిగిలింది పెద్ద ఇంట్రెస్టుగాలేకున్నా మరీనిరాశగాలేదు. కొందరుడిస్ట్రిబ్యూటర్స్ చప్పరించారు. మరికొందరు పెదిమ విరిచారు.

రాయ్ డిస్ట్రిబూటర్స్ వాళ్ళు ఆ సినిమాను డిస్ట్రిబూషన్‌కు తీసుకోవాలని ముందుగానే ఆలోచించి ఉండడం వల్ల, రమేష్ చూసిన తర్వాత జగదీష్‌రాయ్ ఆఫీసుకు వచ్చాడు. ఆ సమయంలో కనకారావు ఒక్కడే కూర్చుని ఉన్నాడు ఆఫీసులో ఫైళ్ళు చూసుకుంటూ. మేనేజర్ రాసుకుంటూ కూర్చున్నాడు. రాయ్‌ని చూసి లేచి నిలబడి ఆహ్వానించాడు కనకారావు.

"ఏమిటి విశేషాలు?" అన్నాడు రాయ్ టేబుల్ ముందున్న ఫొటోల వైపుచూస్తూ.

"ఔట్ డోర్ షూటింగ్ అయిందండీ! ఇక ఇన్‌డోర్ షూటింగ్ ఉంది. ఇప్పటికే చాలాడబ్బు పెట్టుబడి కింద నలిగింది. వీలుంటే అమ్మేద్దామని ఆలోచిస్తున్నాం"




అన్నాడు.

"ఏ పద్ధతిలో! కాంట్రాక్ట్ మీదనా? కమిషన్ బేసిస్ పద్ధతి మీదనా?"

"అవకాశాన్ని బట్టి ఉంటుంది. ఇంకా నిర్ణయించుకోలేదు."

"కమీషన్ పద్ధతిలో అయితే ఆంధ్రా, సీడెడ్ మాకు ఇవ్వండి. తీసుకుంటాం" అన్నాడు రాయ్.

కనకారావు నవ్వి "ఆలోచిద్దాం" అన్నాడు.

నాగిని టాక్సీదిగి లోనికివచ్చింది. కనకారావుకు సమస్కరించి, వచ్చి ఎదురుగా కూర్చుంది. రాయ్ ఆమెవైపే చూస్తున్నాడు.

"ఈవిడే మా హీరోయిన్!" అంటూ పరిచయం చేశాడు. రాయ్ పలుకరింపుగా చిరునవ్వు నవ్వాడు.

"అర్జంటుగా మీతో పనిపడి వచ్చాను. కొంత మనీ అవసరం" అంది అతని కళ్ళ లోనికి చూస్తూ.

"ఎంత?"

"కనీసం వెయ్యి.అంతకు మించి ఎంత యినాసరే!"

"ఏమిటి అంత అవసరం?'' అన్నాడు నవ్వుతూ.

"మా బ్రదర్ సైకిల్ మీదవెళ్తూ యాక్సిడెంటు అయింది. వెనుకనుండి కారు ఢీకొట్టింది. హాస్పిటల్‌లో చేర్చారు."

జేబులోనుండి పది వందరూపాయల కాగితాలు తీసి అందించాడు.

లేచివెళ్తూ "తర్వాతవచ్చి సంతకం చేస్తాను'' అంది.

"యాక్సిడెంటు అంటుంది. నవ్వుతున్నదేమిటి?'' అన్నాడు రాయ్.

"ఇది సినీజీవితం కదా! ఏడవలేక నవ్వడమంటారే! అదే ఇది.''

"కొత్త పిల్లను పట్టేశారే! చాలా బావుంది'' అన్నాడు రాయ్.

''కొత్తదేం కాదు. చిన్న పాత్రలు ధరిస్తూ ఉండేది. డైరెక్టరు మణ్యం కూతురే".

"నాకంత పరిచయంలేదులెండి. పనికి వచ్చే రకమేనా?"

"అంటే?'' అన్నాడు నొసలెగరేసి నవ్వుతూ కనకారావు

"ఏముంది సహజమే! స్త్రీని పురుషుడు దేనికి పనికి వస్తుందంటాడు? అవకాశ ముంటే ట్రై చేయండి" అన్నాడు.

కనకారావు కోపంగాచూశాడు. "నీకూ దానికీ మధ్య నన్ను బ్రోకర్‌గా పని చేయమంటావా! మరోసారి ఇలాంటి మాట లంటే ఆఫీసుదాటి వెళ్ళలేవు. మర్యాద ఇచ్చి పుచ్చుకోవడం మంచిది" అన్నాడు ఆవేశంగా.

రాయ్ అతని వైపు చూశాడు దీర్ఘంగా "ఒక డిస్ట్రిబ్యూటర్‌కు సహకరించలేని నువ్వు రేపు ఫిల్మ్ ఏవిధంగా విడుదల చేసుకుంటావు?"అన్నాడు నిదానంగా.

"ఫిల్మ్ అమ్ముకోవడం కోసం బ్రోకర్. వృత్తి చేయవలసి వస్తే ఫిల్మ్‌ను కాల్చి వేసుకుంటాం గానీ, బ్రోకర్‌గా బతక డానికి సిద్ధంగాలేము."

"మళ్ళీ కలుస్తాను" అంటూ లేచాడు రాయ్. ఆ సమయంలో అక్కడ ఉండ టానికి అతనికి అవమానకరమనిపించింది.

"ఇక రావద్దు దయచేసి ! నీలాంటి వాడికి నేను ఫిల్మ్‌డిస్ట్రిబ్యూషన్ ఇవ్వను. వెళ్లు!" అన్నాడు కఠినంగా. రాయ్ తల వంచుకుని బయటకు వెళ్లాడు.

"బాగా బుద్ధి చెప్పారు సార్ ! ఈ వెధవలు ఫిల్మ్ అమ్ముకోడానికి నిర్మా తలు ఏమయినా చేస్తారని అనుకుంటు

న్నారు. ఒకడి మక్కలు విరగ దన్నితే తర్వాత మర్యాదగా ప్రవర్తిస్తారు" అన్నాడు మేనేజరు.

రామారావు లోనికి వచ్చాడు. చిట చిట లాడుతున్న కనకారావు ముఖం చూసి "ఏమయిందిరా! రాయ్‌గాడు కోపంగా వెళ్తున్నాడు" అన్నాడు.

వివరాలు చెప్పాడు మేనేజరు.

"హోరినీ వెధవా! ఒక కాలు విరిచి వేయకూడదేంరా! తర్వాత వాడినీ, వాడి డబ్బునూ ఓ పట్టు పట్టి చూసే వాళ్ళం కదా!" అన్నాడు నవ్వుతూ.

"వాడిని తన్నాలంటే అదేమంత సమస్య కాదురా! ఆ విధంగా చెడ్డకావ డానికి ఇష్టంలేక. సరే! నేను ఊరికి వెళ్తున్నాను. డబ్బులు ఉన్నప్పుడే వెతు క్కోవడం మంచిది. మళ్ళీ అయిపోయిన తర్వాత బాధ పడటం ఎందుకు?" అన్నాడు.

రామారావు తలూపాడు.

"ఇన్‌డోర్ షూటింగ్ తర్వాత ప్రారం భించవచ్చు. ముందు పాటలు ఆరూ పూర్తిగా రికార్డ్ చేయించండి" అన్నాడు లేస్తూ కనకారావు.

పాటలరికార్డింగ్ కార్యక్రమం ఏర్పాటు చేశారు. సేలంలోని మోడరన్ స్టూడియో, చవగ్గా అద్దెకు ఇస్తున్నారని విని, అక్కడే ఏర్పాటు చేయాలని రామారావు సేలం వెళ్ళి వచ్చాడు. మద్రాసు రేట్లలో సగం రేటు కూడా లేదు సేలం స్టూడియోరేటు. అయినా పోయి, రావడానికి కొంత ఖర్చు ఎక్కువవుతున్నది.

కళింగ "స్టూడియోలలోనే చేయాలని ఏమీలేదు. పైన హాలుకొంత మార్చుకుంటే డబ్బింగ్ రూంగా మార్చుకోవచ్చు. రేపు ఔట్ డోర్ షూటింగ్ సీనరీస్‌కు డబ్బింగ్ ఎలాగూ చేసుకోక తప్పదు. అప్పుడయినా తిరిగి అద్దెలు భరించి స్టూడియోలు తీసు కోవాలి. అప్పుడు ఇప్పుడు అద్దెలు లెక్క కడితే ఇరవై వేలకు తగ్గదు. పదివేలు ఖర్చు పెట్టగలిగితే పైన హాలును డబ్బింగ్ రూంగా మారుద్దాం. ఆలోచించండి" అన్నాడు.

'పదివేల రూపాయలు మిగిలేటప్పుడు తప్పక ఆలోచించవలసిందే!'అనుకున్నాడు రామారావు. సంగీత దర్శకుడు శంకర్‌ను పిలిపించి తమ ఆలోచనలను చెప్పాడు.

"బ్రహ్మాండమైన ఐడియా!" అన్నాడు శంకర్. "ఏ నిర్మాతకు ఆ నిర్మాత స్వంత డబ్బింగ్ ఏర్పాటు చేసుకుంటే, స్టూడియోలు మూసి మెరీనాబీచ్‌లో చుట్టలు తాగుతూ కూర్చుంటారు స్టూడియో వాళ్ళు. ఈవిధంగానే చేద్దాం."

"సౌండ్ సర్వీస్, రికార్డింగ్ విధానం మనకు తెలియదుగా!"

"దాందేముంది సార్! అన్నీ తెలిసిన ఇంజనీర్లు పాండీబజార్‌లో కాఫీ ఎవడు ఇప్పిస్తాడోనని తిరుగుతుంటారు. డబ్బుతో ప్రపంచంలో దొరకనిది ఏదీలేదు. అన్ని పరికరాలు ఆటోమేటిక్‌గా వస్తాయి."

డబ్బింగ్‌రూం ఏర్పాటు చేయించ దలచుకున్నాడు రామారావు. పదివేలని వారంటే, ఇరవైవేలయినా ఖర్చవుతుందని తెలుసు. దింపేటప్పుడు తేలికగా చూపి స్తారు.దిగిన తర్వాత తలబొప్పికడుతుంది. అయినా ఎలాగూ ఇరవైవేలు అద్దెకట్టక తప్పదు స్టూడియోలకు! ఆ ఇరవై వేలు ఖర్చుపెట్టి డబ్బింగ్ ఏర్పాటు చేసుకుంటే ఈ సినిమా సక్రమంగా నడిచి మళ్ళీ సినిమా తీయాలనుకున్నప్పుడు మళ్ళీ డబ్బింగ్‌రూంకొరకు ఖర్చు చేయాల్సిన

పని ఉండదు. నష్టమా? స్టూడియోలకు ఇచ్చే అద్దెవిలువే! కలిసివస్తే, ఆ తర్వాత ఉచితంగా డబ్బింగ్ సౌకర్యం.

కళింగ పదిసంవత్సరాలుగా ఫీల్డ్‌లో పనిచేస్తూ, అన్ని అనుభవాలు ఉండికూడా పైకి రాలేకపోతున్నాడు. ఎలాగయినా దీనితో ఒడ్డున పడాలని అతని కాంక్ష! ఇందులో అతి తక్కువ ఖర్చుతో నిర్మాతలకు బెనిఫిట్ చూపిస్తే, తర్వాత నిర్మాతలు తన దగ్గరకు రాగలరు. అందువల్ల ఈ చిత్రం విషయంలో ఖచ్చితంగానూ, సహకారంగానూ ప్రవర్తించాలనుకున్నాడు.

శంకర్ కూడా ఇంతవరకూ అసిస్టెంటుగా ఉన్నవాడే. ఒక్క శంకరే కాదు మొత్తం టెక్నీషియన్స్ అందరూ అసిస్టెంట్లుగా పనిచేసి, వీరి ద్వారా ప్రమోషన్‌లో పడ్డారు. అందువల్ల కొంత శ్రమతోనే ముందుకు పోవాలని ప్రయత్నం చేస్తున్నారు.

డబ్బింగ్‌రూం కొరకు బలమైన ప్లైఉడ్ అట్టలు, అద్దాలు, కొయ్యసామాను, ఇతర పరికరాలు తెప్పించారు. అంతవరకూ విశాలమైన హాలుగా ఉన్న ప్రాంతాన్ని పెద్దసైజురూముగా మార్చేశారు. లోపల ఉన్నవారికి బయటి మాటలు, బయట వున్నవారికి లోపలిమాటలు విన్పించకుండా కట్టుదిట్టంగా చేశారు. నాలుగు రోజులు శ్రమపడితే రూం తయారయింది. పాతికవేలు ఖర్చయింది.

కనకారావు వచ్చేసరికి వారంరోజులయింది. డబ్బుసమయానికి అందకపోవడం, ఇంటిదగ్గర విసుక్కోవడం జరిగి వాళ్ళకు నచ్చచెప్పి, బెదరించి, లాలించి, లాక్కొచ్చేసరికి తలప్రాణంతోకకు వచ్చినట్లయింది. ఈవిధంగా ఎవరో డబ్బు ఇస్తే సినిమా తీయడం వెర్రివెధవల పనిగా భావించుకున్నాడు. ఇటుచూస్తే మంచినీళ్ళ ప్రాయింగా డబ్బు ఖర్చవుతున్నది. అటు చూస్తే ఇంటివద్ద ఇవ్వడానికి సిద్ధంగా లేరు. తాము గడ్డితిని సంపాదించిన డబ్బు, వీళ్ళు జల్సాగా ఖర్చు పెడుతున్నారని వారు భావిస్తున్నారు. అందువల్ల డబ్బు ఇవ్వాలంటే వారు తటపటాయిస్తున్నారు. మరో రెండులక్షలు లాక్కొగలిగాడు. శివరావు తండ్రి పైసా కూడా ఇవ్వనన్నాడు శివరావు రాసిన ఉత్తరాలు చూపించాడు.

"మావాడికి ఏ స్థాయీ లేనప్పుడు ఎందుకు ఖర్చుపెట్టాలి?" అన్నాడు.

"రేపు నిర్మాతగా తెరమీద వేస్తాం కదా?"

"ఎవడి క్కావాలి పేరు? మీరేమో జల్సాగా తిరుగుతున్నారు. వాడు నోరు మూసుకుని ఇంట్లో కూర్చుంటున్నాడట."

"తిరగమని మేమూ చెప్పాము స్వామీ! ఎప్పుడూ పూజలూ పునస్కారాలంటూ మా ప్రాణం తీస్తూ, వాడి ప్రాణం తీసుకుంటున్నాడు. సినిమాఫీల్డులో చలాకీగా తిరగాలి. వీడు ద్వాపరయుగంలో వసుదేవుడిలాగా ప్రవర్తిస్తే తప్పు మాదా?"

"వాడి పద్ధతి అంతే! మీ యిష్టం! అయిన ఖర్చుచాలు. వాడికయిన ఖర్చు మినహాయించి, మిగిలిన డబ్బులు మా ముఖాన కొడితేచాలు."

గ్రామపెద్దల దగ్గరకు సమస్యవచ్చింది. పెద్దలందరు కూడా కరణాన్నే బలపరచారు. "అమాయకుడు శివరావు. వాడు మీకు తోడు ఎందుకర్రా! మీరు ఎక్కడ పడినా గెలుచుకుని వస్తారు'' అన్నారు కొందరు.

చివరకు పెట్టిన పెట్టుబడిలో ఇరవై



వేలుతీసి ఎనభైవేల రూపాయలు వాపసు ఇవ్వాలని పెద్దమనుషుల తీర్మానం! ఆ డబ్బు కూడా సినిమా విడుదల అయి డబ్బు వచ్చిన తర్వాతే! అంత వరకూ ఇప్పటి నుండీ నెలకు నూటికి రెండు రూపాయల వడ్డీ చెల్లించాలని తీర్మానించారు. అందుకు కరణం కూడా ఒప్పుకున్నాడు.

కనకారావు వచ్చేటప్పటికి మూడు పాటలు రికార్డింగ్ అయ్యాయి. పెట్టిన విపరీతమైన పెట్టుబడి విన్నాడు. కళ్ళతో చూశాడు. డబ్బులేని ఈ సమయంలో దుబారా చేయడం మంచిది కాదేమోనను

కున్నాడు. ఆ మాట పైకి అంటే బాధ పడతారని రామారావుకు తెచ్చిన రెండు లక్షలూ ఇచ్చి, శివరావు విషయం చెప్పాడు. రామారావు ఆశ్చర్యంగా విని "కరణం ఈ విధంగా చేస్తాడనుకోలేదు" అన్నాడు.

"సరే చూద్దాం! రేపు ఆ డబ్బు రాబట్టుకున్నప్పుడు వీడికి తగినశాస్తి చేస్తే సరిపోతుంది. శివరావు గాడిని పంపిద్దామా?" అన్నాడు మళ్ళీ.

"ఇంకా ఎందుకు వాడు? వాడి మీద ఇక పెట్టే ప్రతి పైసా మన ఖర్చే అవుతుంది. ఇరవైమూడు రూపాయలు చేతిలో పెట్టి సెంట్రల్‌కు పంపడమే" అన్నాడు కనకారావు.

శివరావును పిలిచి వివరాలు చెప్పారు. 'ఎప్పుడు విముక్తి కలుగుతుందా!' అని



ఎదురు చూస్తున్నట్లు ఉన్నాడు. "ఈరోజే వెళ్ళి పోతారా?" అన్నాడు.

"వెళ్ళిపో! మధ్యన ఈ విధంగా చేస్తే మేం అల్లరి పడవలసి వచ్చింది" అన్నాడు కనకారావు.

రాత్రి మెయిల్‌కు బండి ఎక్కించాడు రామారావు స్టేషన్ వరకూ వచ్చి. ఉదయం కళింగకు ఫోన్‌చేశాడు. కాకిలా వచ్చి చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

"మిగిలిన మూడు పాటలూ రికార్డింగ్ త్వరగా చేస్తే, ఇన్‌డోర్ షూటింగ్ ఏర్పాటు చేద్దాం. ఆ తర్వాత రెండు డ్యూయట్ ఔట్‌డోర్‌లో తీయాల్సి ఉంటుంది" అన్నాడు.

"డ్యూయట్లు ఒకటి ఇన్‌డోర్‌లోనే తీద్దాంసార్! పడకసీనుగా ఏర్పాటు చేద్దాం. ఒక డ్యూయట్ ఔట్‌డోర్‌లో తీస్తే సరిపోతుంది. అనవసరంగా ఖర్చు అవుతుంది రెండు తీయాలంటే!" అన్నాడు కళింగ.

"వద్దులే! కొంతయినా అట్రాక్షన్ ఉండాలి. ఖర్చుకు భయపడి ముఖ్యమైన షాట్స్ ఇన్‌డోర్‌లో తీస్తే సినిమా పేలవంగా వస్తుంది. పదిరూపాయలు మిగిలించబోతే, పది లక్షలు నష్టమయ్యే పరిస్థితి ఎందుకు? చేసేదేదో బాగానే చేద్దాం."

"మీ యిష్టంసార్! మీరు చేయదలచుకుంటే మేం మాత్రం ఒద్దంటామా?"

కనకారావు వచ్చాడు అక్కడకు. అంతవరకూ టేబుల్ ముందు కూర్చుని రాసుకుంటున్న మేనేజర్ లేచి వీరి వద్దకు వచ్చి "సరోజమ్మగారు మీకు ఫోన్‌చేశారు సార్! మూడురోజులుగా మూడుసార్లు చేశారు. ఈ రెక్కారని చెప్పాను" అన్నాడు.

కనకారావు అతనివైపు తలెత్తి చూశాడు. సాధారణ పరిస్థితులలో అయితే సరోజను పేరుతో కూడా వాళ్ళు పిలవరని కనకారావుకి తెలుసు. అది, ఇది అని సంభోదిస్తూ, క్రిందినుండి పైదాక శరీరాన్ని వర్ణించుకుంటూ మానసికంగా సంతృప్తి పొందడం వారి హాబీ. అయినా ఈరోజు అమ్మగా సంభోదించాల్సిన పరిస్థితి. నిర్మాత ఉంపుడు గత్తెగా తయారు కావడమే కారణం! నిర్మాత ప్రియురాల్ని హీనంగా సంభోదించి, ఉన్న ఆసరా పోగొట్టుకోడానికి ఎవడూ ఇష్టపడడు.

"ఏమిటి కళింగగారూ! మన పనులు చాలా నిదానమవుతున్నాయి. ఔట్‌డోర్ షూటింగ్ జరిగినంత ఉత్సాహంగా జరగడంలేదు" అన్నాడు.

"తొందర పడితే ఎట్లాసార్! అందుకే డబ్బింగ్ రూంల కొరకు స్టూడియోల వద్ద వెయిట్ చేయడం కంటే స్వంతంగా ఉంటే అవసరమైనప్పుడు పని జరుపుకోవచ్చని ఆలోచించి నిర్మించాము. ఇక డబ్బింగ్ కార్యక్రమాలు నిర్విఘ్నంగా జరిపిద్దాం. వాటితోపాటు ఇన్‌డోర్ షూటింగులు కూడా సాగిద్దాం."

"సరే! కానివ్వండి" అంటూ లేచి బయటకు వెళ్ళాడు.

జూనియర్స్ బ్రోకర్ వీరయ్య వచ్చి నమస్కారంపెట్టి, పళ్లికిలించి నిలబడ్డాడు చేతులు కట్టుకుని.

తమ గ్రామాలలో పాలేర్లు కూడా విలువ ఇవ్వరు. ఇక్కడికి వచ్చేసరికి పెద్దమొనగాళ్లు సహితం ఎదురుగా నిలబడి మాట్లాడ వలసి వస్తున్నది. మెహర్బానీ కొరకు నిలబడటమేగానీ, మనిషి వ్యక్తిత్వాన్ని గౌరవించి కాదని రామారావుకి





తెలుసు. డబ్బుకొరకు, అది సంపాదించే మార్గం కొరకు వీళ్ళు అన్ని పద్ధతులూ అవలంబిస్తున్నారు. మొదటఏమైనా అహం భావం, గర్వం ఉన్నా క్రమక్రమంగా అవి హరించుకుపోయి చివరకుబానిసలాగా తల లూపుతూ, చెప్పే అన్ని బ్రోకర్ పద్ధతులూచేస్తూ, మనసులో డబ్బు దొరికితే చాలనే తత్వం జీర్ణించుకుపోతుంది. 'కూటి కొరకు కోటివిద్యలు' అన్నారే గానీ, 'డబ్బుకొరకు దగాకోరు జీవితం' అని ఎవడూ ఇంకా అననందుకు కారణాలు వెతుకుతున్నాడు రామారావు.

కళింగ కలవ తీసుకొని వెళ్ళాడు.

"ఏం వీరయ్యా? ఏం విశేషాలు?" అన్నాడు రామారావు నవ్వుతూ. అతని చేతిలో పేపర్ వెయిట్ గ్లాస్ గుండ్రంగా తిరుగుతున్నది. ఎవరి దగ్గర ఏ విధంగా ప్రవర్తించాలో, భూస్వామ్య కుటుంబంలో పెరిగిన అతనికి పల్లె వాతావరణంనుండే తెలుసు. ఈ సినిమా అనుభవంతో మరింత ధృడం అయిందది.

"మాకు డబ్బురావాలి సార్! ఏమైనా దయ చేస్తారేమోనని!" అన్నాడు చేతులు పిసుక్కుంటూ వీరయ్య.

"ఎంత కావాలి ?"

"ఐదువేలకు పైగానే ఉంటుంది."

టేబుల్ సొరుగులాగి, మూడువేలు తీసి ఇచ్చాడు. అందుకుని జేబులో పెట్టుకున్నాడు.

"ఏం పని చేస్తుంటావు వీరయ్యా! కేవలం ఆర్టిస్టుల సప్లయి చేయడమేనా? మరింకా ఏదైనా ఉందా ?" అన్నాడు లెడ్జర్‌లో నోట్ చేసుకుంటూ.

"చెప్పండి సార్! ఈ ఫీల్డ్‌లో మీకు అనుభవం ఉంది కదా! ముఖమాటం లేకుండా చెబితే తమకు పనిచేసి పెడతాను" అన్నాడు నవ్వుతూ వీరయ్య.

"ఔట్‌డోర్‌లో హీరోయిన్ పక్క నిలబడి ఉంది చూశావా?"

"ఆ! రుక్మిణి! పంపించమంటారా?" ఉత్సాహంగా అన్నాడు. అదే మొదటి సారిగా తన్ని కోరడంతో.

"నలందాకు తీసుకరా! రాత్రి ఎనిమిది గంటల తర్వాత!"

తలూపి వెళ్ళిపోయాడు చేతికి ఇచ్చిన ఇరవై రూపాయల నోటు మడిచి జేబులో పెట్టుకుంటూ. లేచి మెట్లెక్కి పైకి వెళ్ళి, బాత్‌రూంకు వెళ్ళాడు స్నానం చేయడానికి! ఉతికిన గుడ్డల్ని పైన ఆరవేస్తున్నది సరిత. ఆమెను పిలిచాడు. గుడ్డలు దండెం మీద వేసి అతని దగ్గరగా వచ్చింది. ఇంతకు ముందున్న దిగులు ఆ అమ్మాయిలో కన్పించడం లేదు. అన్ని పనులూ ఇంటిలో స్వంతంగా చేసుకుంటున్నది. మిత భాషి కావడంతో ఆమెను రామారావు ప్రియురాలిగా వచ్చే మనుషులు గుర్తించడం వల్లా ఆమెతో మాట్లాడేవారు తక్కువ. ఆమె కూడా తన పనులు చేసుకోవడమే కానీ, ఎవరితోనూ మాట్లాడదు. కనకారావు ఆమెను చూసినా, తలతిప్పుకొని వెళ్ళిపోతున్నాడు. అవసరమైతే తప్ప పలకరించడు.

"భోజనం అయిందా ?" అన్నాడు దగ్గరగా వచ్చిన సరితను చూస్తూ. తల ఊపింది.

"స్నానం చేసివస్తాను. తొందరగా కానియ్ !" అంటూ బాత్‌రూంలోకి వెళ్ళాడు. పక్కగదిలోకి వెళ్ళి అతని గుడ్డలు తెచ్చి గది బయట స్టూల్‌మీద పెట్టి కింపకు వెళ్ళిపోయింది.

స్నానం చేసి గుడ్డలు మార్చుకుని కిందికి దిగివచ్చి డైనింగు రూంలోకి

వెళ్లాడు. టేబుల్ మీద గిన్నెలు సర్దుతున్నది సరిత.

"కనకారావు తినివెళ్లాడా?"

తలూపింది సరిత. ''తినేఉంటాడు అన్నం తక్కువగా ఉందిగా! నౌకరుతో పెట్టించుకుని తింటాడు" అంది వడ్డిస్తూ.

"పోనీలే ! నీకూ శ్రమ తగ్గుతుంది."

సరిత నవ్వుతూ కుర్చీలో కూర్చుంది. సరికొత్త చీరలో మెరిసిపోతూ ఉంది సరిత. ఔట్ డోర్ లో హీరోయిన్‌కు కొన్న చీరలన్నీ సరితకుచెందాయి.

"బాగా పొద్దుపోతున్నదా ? విసుగ్గా ఉందా?"

"ఏం విసుగు? ఉదయం లేచినప్పటి నుండి కాఫీ, టిఫిన్, నాలుగు రకాల కూరలు, భోజనం, గుడ్డలు ఉతకడం అన్నీ అరవచాకిరీగా ఉంది. నౌకరు ఉన్నాడు గనుక హాలంతా చిమ్మి నీళ్ళతో తుడిచి కూరగాయలూ, సరుకులూ తెచ్చి ఇవ్వబట్టి సరిపోయింది. ఒక్కదాన్నే అయితే ఇంకేమన్నా ఉందా" అంది చేతులు తిప్పుతూ.

"విసుగ్గా ఉంటే చెప్పు. పనులు తగ్గే ఉపాయం ఆలోచిద్దాం"

అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది. "వద్దులే! ఈ పనులు చేస్తూ గతాన్ని మరవడానికి ప్రయత్నిస్తున్నాను. పని లేకుండా కూర్చుంటే గతమంతా తలుచుకుంటూ ఏడుస్తూ కూర్చోవాలి"

ఆమె చేతిని నిమురుతూ అన్నం తింటున్నాడు.

"నీవల్ల రోజుకు కనీసం అరవై రూపాయలుమిగిలిస్తున్నాం.డబ్బుసమస్య కాదనుకో! ఈ తిండిహోటళ్ళలో దొరకదు" అన్నాడు.

"కనకారావుగారు ఎప్పుడో ఒకసారి తింటూ ఉంటారు. ఎక్కువగా సరోజ ఇంటివద్దకే వెళ్తుంటాడట కదా నౌకరు చెప్పాడు" అంది అతన్ని చూస్తూ.

"ఎవరి ఇష్టాఇష్టాలు వారివిలెద్దూ !"

భోజనం పూర్తిచేసి లేచాడు. "సాయంత్రంభోజనానికి రాలేకపోవచ్చు. చాలా పనులున్నాయి. నీవు తిని పడుకో! ఉదయం మార్నింగ్‌షోకు వెళ్దాం" అన్నాడు. తలూపింది సరిత. పోతున్న అతన్నే చూస్తూ కనుమరుగయ్యేవరకూ నిలబడింది.

• • •

హోటల్ నలందాలో రుక్మిణిని కలిశాడు రామారావు. మెరుపుతీగలా అర్ధనగ్న శరీరంతో, అందంగా అలంకరించుకున్న రుక్మిణిని చూసి నాగినికంటే హీరోయిన్ పాత్రలో రుక్మిణి అయితే బాగుండేదనుకున్నాడు.

"భోజనం చేశావా?" అన్నాడు ఎదురుగా కూర్చున్న రుక్మిణిని చూస్తూ.

తల అడ్డంగా ఊపింది. "వీరయ్యగారు ఇక్కడికి వెళ్ళమని టాక్సీకి డబ్బిచ్చాడు పది రూపాయలు. వచ్చేశాను" అంది తలవంచుకుని ఓరకంటితోచూస్తూ.

బజర్ మోగిస్తూనే రూంబాయ్ వచ్చాడు.

మెనూకార్డు తీసుకుని అందులో కావలసిన వాటికి గుర్తుపెట్టి అందించాడు. బాయ్ వెళ్ళిపోయాడు.

"ఎన్ని సంవత్సరాలవుతుంది ఫీల్డులోకి వచ్చి?"

"మూడు సంవత్సరాలవుతున్నది"

"ఎన్ని సినిమాలలో నటించావు"

అతడు అమాయకుడేమోనన్నట్లు

ఆశ్చర్యంగా అతనివైపు తలఎత్తి చూసి అంది "మాకు ఇన్ని సినిమాలని ఏమీ ఉండవు. హీరోయిన్‌పక్క నిలబడటమో, గ్రూప్ డాన్స్‌లో ఉండటమో, పెళ్ళి కూతురును అలంకరిస్తున్నట్లు కన్పించడమో, పనిపిల్లగా కన్పించడమో, రాజులకు విసనకర్ర విసిరేవాళ్ళగానో దొరుకుతాయి. రోజుకు, కాల్‌షీటుకు ఇంతని ఇస్తారు. అవన్నీ సినిమాలుగా భావించి ఇన్నింటిలో నటించామని ఎలా చెప్పుకోగలం?"

"ఒక్కో కాల్‌షీటుకు ఎంత ఇస్తారు"

"నిర్మాత ద్వారా మాకు డబ్బు అందదు. ఆరోజు తిండిమాత్రం అందుతుంది. బ్రోకర్ ద్వారా రోజుకు ఇరవై రూపాయలు అందుతాయి"

"బ్రోకర్ మాతో యాభై రూపాయలు తీసుకుంటాడు. అంటే ముప్పై రూపాయలు అతనికి చెందుతాయి. కష్టపడ్డ మీకు ఇరవై రూపాయలేనా?"

"అంతేమరి మాజీవితాలు! కష్టపడటం మావంతు. సంపాదించుకోవడం వారి వంతు."

"బ్రోకర్‌తో పనిలేకుండా సరాసరి మీరే కాంట్రాక్టు ఏర్పరచుకోవచ్చుకదా?"

తల అడ్డంగా ఊపింది. "ఎలా సాధ్యం? ఎంతమంది నిర్మాతల దగ్గరకు తిరగాలి? అందువల్ల తప్పని సరిగా బ్రోకర్‌మీద ఆధారపడటం! అందువల్లే ముందుకు రావటానికి బదులు మా జీవితాలు ఇలాగే ఉన్నాయి" అంది నిట్టూరుస్తూ.

సర్వర్‌తో పాటు బాయ్ వచ్చాడు. ప్లేటులు అక్కడ అమర్చాడు.

ఇద్దరూ టేబుల్ ముందు కూర్చున్నారు. ఆతృతగా రుక్మిణి తింటుంటే చూస్తున్నాడు.

భోజనం ఖరీదు యాభైరూపాయలు. ఆమె కనీసం రెండున్నర రోజులు పని చేస్తే ఒకపూట ఈ భోజనం వస్తుంది. ఇటువంటి వారి బతుకులు కుక్క చింపిన విస్తరిలాగ ఉంటాయనుకున్నాడు. 'అయితే మాత్రం ఏం లాభం! ఒక వైపు జాలిపడుతూనే ఇంకో వైపు వారి వద్ద సుఖం పొందడానికి ఎగబడుతున్నాను' అనుకున్నాడు. తాను రాకున్నా మరో వ్యక్తి దగ్గరికి ఆమె పోకా తప్పదు. కనుక, వచ్చే సుఖాన్ని వదులుకోడానికి తాను ఇష్టపడటం లేదు. ఎలాగయినా చిరిగిన విస్తరే!

కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ లేచి, కుర్చీ దూరంగా జరుపుకుని కూర్చుంది. బాయ్ వచ్చి ప్లేటుతీసి, శుభ్రం చేసి డెట్టాల్‌తో తుడిచి వెళ్ళాడు. లేచి తలుపువేసింది అతని చూపుల్ని అర్థం చేసుకున్నట్లుగా.

తెల్లవారుఝాము మూడు గంటలకు లేచి వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు. రుక్మిణి డ్రస్ చేసుకుంటున్నది. నలిగి పోయిన ఆమె శరీరాన్ని చూస్తూ 'పాపం' అనుకున్నాడు.

"ఎంత?"

"మీ ఇష్టం !" అంది తలవంచుకుని.

వంద రూపాయలు చేతిలో పెట్టాడు.

"ఇందులోకూడాబ్రోకర్‌వాటాఉంటుందా?"

తల ఊపింది. "సగం అతనికి ఒప్పచెప్పాలి ?"

"ఎలా తెలుసుకుంటాడు ఇంత ఇచ్చినట్టు ?"

"అది మా నైతిక బాధ్యత. ఒకవేళ తక్కువ చెప్పామనుకోండి. ఎప్పుడైనా గుర్తుపడితే ఆ రోజు మామీద అన్నిరకాల దౌర్జన్యాలు చేస్తారు ఈ బ్రోకర్లు. అందు

వల్ల ఉన్నది ఉన్నట్లు చెప్పక తప్పదు."

"ఇప్పుడు ఎంత ఇచ్చినా అంతేనా?"

"ఈ రూం దాటి వెళ్ళేలోపల ఎంతున్నా చెరిసగమే! తప్పదుమరి!"

వంద రూపాయలనోటు లాక్కుని ఇరవైరూపాయల నోటు చేతిలో పెట్టాడు. ఆశ్చర్యంగా అతని ముఖంలోకి, ఇరవై రూపాయలనోటు వైపు చూస్తున్నది.

"ఎంత ఇచ్చినా అంతే అయితే వాడు లాభపడటమెందుకు ? వాడిభాగం పది రూపాయలు ఇచ్చెయ్యి!" అన్నాడు నవ్వుతూ.

"నమ్మడు" అంది తగ్గు స్వరంతో విచారంగా.

"నన్ను విచారించమని చెప్పు. నేను నిజంచెప్పేస్తాను. ఇక నీవంతు ఆ బ్రోకర్ గాడితో పనిలేకుండా మా ఆఫీసులో ఈరోజు మధ్యాహ్నం కలుసుకో!" అన్నాడు. తల ఊపింది రుక్మిణి నోటు హాండ్ బాగ్‌లో పెట్టుకుంటూ.

టాక్సీ పిలిచి ఆమెను పంపించి, మరో టాక్సీ తీసుకుని ఇంటికి వచ్చాడు.

ఆలోచిస్తూతలుపుతట్టాడు. మూడు సార్లు తట్టిన తరువాత తలుపు తెరిచింది సరిత నిద్రమత్తుతో ఆవలిస్తూ.




ఇన్‌డోర్ షూటింగ్‌కు ఏర్పాట్లు చేశారు.



కింది హాలునే సెట్‌గా తయారు చేశారు. విశాలమైన హాలు. పైగా, ఇతర గదులు ఉన్నాయి. అవసరానికి పైన మరికొన్ని గదులు.

ఆ రోజు పాత్రధారులకు రిహార్సల్ చేస్తున్నాడు కళింగ. చిన్న కుటీరంలాగా అందులో సెట్ వేశారు. మద్రాసులో గడ్డి దొరకడం కష్టమయింది. విపరీతమైన రేటు. పదిమోపులు తెచ్చి అలాగే కప్పారు. హరిజనవాడ గుడిశె అది. అందులోనే కనీసం యాభైషాట్స్ లాగాల్సి ఉంది. సినిమాకు ఆద్యంటేజి అది. ఆ తర్వాత మిగిలిన సీనరీస్‌లో హరిజనవాడా కన్పించదు; హరిజన ఇళ్లూ కన్పించవు; హరిజనులు అంతకంటే కన్పించరు. ఆ ఒక్క సెట్ కొరకు బయట ఏర్పాటు చేయడం విపరీతమైన డబ్బు ఖర్చవుతుందని లోపలే ఏర్పాటు చేశారు.

హీరోయిన్ రామి తల్లి హీరోయిన్‌కు నీతిబోధ చేయడం, తండ్రి ఆమెను బెదరించడం, తనకు కడుపు రావడానికి కారకులెవ్వరో తెల్పడానికి ఆమె నిరాకరించడం, ఆమెను తండ్రి కొట్టడం, తల్లి వారించి విడిపించడం సీను అది. అందులో పాత్రలు రామి తండ్రి, తల్లి, మరో ముగ్గురు బయటి వ్యక్తులు, రామి పాత్రధారి నాగిని, తల్లి పాత్ర సరోజ, తండ్రి పాత్ర వెంకయ్య అనే యువనటుడు, మిగిలిన ముగ్గురు జూనియర్ ఆర్టిస్టులు.

"ఈ విధంగా రూప కల్పన విడగొట్టడం నా సినీ జీవితంలో ఇదే మొదటిసారి" అన్నాడు కళింగ ప్రశంసిస్తూ. మనసులో మాత్రం 'ఈ వెధవలు దర్శకులకు విలువే లేకుండా చేస్తున్నారు' అని సణుక్కున్నాడు.

ఏ విధంగా నటించాలో వారికి తెల్పి, కెమెరామన్‌ను సిద్ధపరచి సంగీతదర్శకుని

కూడా సిద్ధపడమన్నాడు. పదిగంటలనుండి ప్రారంభిస్తే సాయంత్రం ఐదు గంటల లోగా ఆ షాట్స్ మొత్తం తీసేయాలని నిర్ణయించు కున్నారు.

కెమెరా డైరెక్టరు వచ్చి కెమెరాను పొజిషన్‌లో పెట్టి, టేపుతీసి కొలిచారు. లెన్స్‌పడేదూరం గుర్తిస్తూ సుద్దముక్కతో చుట్టారు. మొదటి షాటుకు సిద్ధపరచారు.

తల్లి, తండ్రితో కూతుచు కడుపు గురించి చెవిలో గుసగుసలాడటం ఫస్ట్ షాట్. ఆందోళనగా, ఆతృతగా తల్లి ముఖంలో ఫీలింగు. వీలుంటే కండ్లల్లో నీళ్ళతో. కండ్లల్లో నీళ్ళ ఎలాగూ తెప్పించడం సాధ్యమే; ఫీలింగు మాత్రం రావాలి. ఏ విధంగా ప్రవర్తించాలో సరోజకు నాలుగుసార్లు ఓపికగా చెప్పాడు కళింగ. సుద్దముక్కతో గుర్తు పెట్టినచోట నిల బెట్టారు ఇద్దరినీ. వెనుక వంట చేసుకో డానికి పనికివచ్చే మట్టి కుండలు చిందర వందరగా పడేశారు.

మూడ్‌లోనికి రావలసిందిగా అరిచాడు కళింగ. సినిమా షూటింగు ఎప్పుడూ చూడని సరిత ఆసక్తిగా చూస్తున్నది. ఔట్‌డోర్ షూటింగుకు వెళ్ళినా, ఆ ఉత్స వంలో ఈ షూటింగు ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు; అందుకు అవసరమైన వాళ్ళ తప్ప. ఈరోజు ఉత్సాహంగా చూస్తున్నది. తిరిగి ఆమెలో ఆశ తనకూ అవకాశం దొరికితే బాగుంటుందని.

సరోజ ముఖంలో విషాదం, ఆతృత, ఆందోళన ఫీలింగ్ తెచ్చుకోడానికి సతమతమవుతున్నది. ఆమె కొన్ని నాటకాలలో నటించింది. నాటకాలలో మూడ్ తెచ్చుకున్నట్లు తెచ్చుకోవడానికి, ఇది సంభాషణాకాదు. ఎదుటి వ్యక్తి నటనా కాదు. తనంతకుతాను, అంతకు ముందు ఏమీ జరుగకుండానే మూడ్ తెచ్చుకోవాలంటే ఆమెకు సాధ్యం కావడం లేదు.

మొదటి షాట్ తీశాడు. రెండో షాట్ తల్లి, కూతురును నిద్రలేపడం. నులక మంచం మీద హీరోయిన్ ముడుచుకుని పడుకుని ఉంది. ముఖం మీద కొంగు కప్పుకుని సాదా మాసిన చీర, రవిక. చలికి వణకుతున్నట్లు నటన! నటించ డానికి సిద్ధపడింది నాగిని. సరోజ తట్టి లేపడానికి కెమెరా పొజిషన్ మార్చి, తిరిగి లెన్స్ చూసుకుని గీతలు కొట్టాడు అసిస్టెంటు. సరోజ దగ్గరగా వెళ్ళి నాగినిని తట్టింది. 'కట్' అన్నాడు కళింగ.

షాట్ మారింది. కూతురు దిగ్గున లేవడం వరకూ ఆ షాట్ అయింది. తండ్రి మీదకు కెమెరా పొజిషన్ రావాలి. తిరిగి లెన్స్ సరిచూశారు. తండ్రి కోపంగా మండి పడుతున్నాడు. ఆవేశంతో కూతురు దగ్గరకు రావాలి. వెంకయ్య ముఖంలో ఫీలింగ్ బాగానే ఉందనుకున్నాడు. ఆ షాట్‌కు కూడా ఓకే చెప్పాడు డైరక్టర్.

మరో షాట్‌లో ముగ్గురూ దగ్గరలో నిలబడి ఉంటారు. తండ్రి కూతుర్ని తిడుతూ, కడుపుకు కారకుణ్ణి చెప్పమని దండిస్తున్నాడు. కూతురు తల వంచుకుని చెప్పడంలేదు. తల్లి అనునయిస్తున్నది. తండ్రి కొడుతుంటే విడిపిస్తున్నది. ఆ షాట్స్ అంతా కలిసే ఉండటంతో సులభంగా తీశారు. 'సరోజ ముఖంలో ఫీలింగ్ రావడం లేదు. నాగిని అద్భు తంగా నటిస్తున్నది' అనుకున్నాడు కళింగ. సరోజను దండించే స్థాయిలో లేదు కళింగ. 'ఈ నిర్మాత వెధవలు ఒక్కోదాన్ని ఉంచుకుని, వాళ్ళముందు

మమ్మల్ని గడ్డిపోచగా చేస్తారు' అని తిట్టుకున్నాడు.

భోజనమయిన తర్వాత తిరిగి షూటింగు ఆరంభించారు. పొరుగువాళ్ళు వచ్చి విడిపించడానికి ప్రయత్నించడం, కూతుర్ని బయటకు తోసి తండ్రి తలుపు వేయడం, తల్లి ఏడుస్తూ భర్త కాళ్ళు పట్టుకొని పిల్లను ఇంటిలోనికి రానివ్వమని కోరడం, చివరకు తలుపు తీసి కూతురుని కౌగిలించుకుని ఏడుస్తూ ఇంట్లోకి తీసుకురావడం. పాత్ర అంత వరకూ బరువుగానే ఉంది. సరిగ్గా నటించకుంటే ఆ షాట్స్ మొత్తం నాశనమవుతాయని కళింగకు తెలుసు. వ్యతిరేకించే ధైర్యం లేదు గనుక, ఎదురుగా కూర్చోబెట్టుకుని ఎంతో ఓపికగా చెప్పాడు. బెంబేలు పడుతున్న సరోజ 'ఎందుకు కోరానా ఈ సినిమా నటన?' అనుకుంది చిరాగ్గా. 'హాయిగా ఉద్యోగం చేసుకుని బతకక ఎందుకీ బాధ?' అనుకుంది.

కెమెరా డైరెక్టర్ రడీ అనగానే అందరూ లేచారు. గీతలో తల్లి, తండ్రి, కూతుర్ని నిలిపారు. తలుపు వద్ద ముగ్గురు నిలబడ్డారు. వారు లోనికి వస్తున్నట్లు చూపడానికి కెమేరా ఎదురుగా తిప్పాడు. ఓ.కే. అన్నాడు కళింగ.

సాయంత్రం నాలుగు గంటలనుకున్నది ఐదు గంటలయింది. షూటింగు ఆపేసిన తరువాత ముఖాలు కడుక్కోడానికి ఆర్టిస్టులు బాత్‌రూంలలోనికి వెళ్ళారు. ఒక్కొక్కరే ఇండ్లకుసాగారు. గుడిసె పీకించి గడ్డి, కట్టెలు బయట పారేయించారు. అమ్మివేయమని మేనేజరుకు చెప్పాడు కనకారావు. వాటితో ఇక అవసరం లేదు.

"ఎందుకు ముఖంలో ఫీలింగు రావడంలేదు" అంది సరిత.

"నేను ప్రయత్నం చేశాను. మరి ఎందుకు సాధ్యం కాలేదో" అంది.

"అయినా మీరు చాలా కష్టపడ్డారు" అంది ప్రశంసగా చూస్తూ సరిత. సరోజ నవ్వి కనకారావువద్దకు వచ్చింది.

ఖాదర్‌ను పిలిచి ఆమెను విడిచి పెట్టి రమ్మన్నాడు. అవమానకరంగా ఫెయిలయిపోతున్న సరోజనుచూస్తూ నిలబడ్డాడు. నిజానికి అందరికంటే ఎక్కువ ఫెయిలయింది సరోజ. సెట్‌నుచూసి భయపడిందా? అంటే ఆ భయం కన్పించడం లేదు. కానీ ముఖంలో ఫీలింగ్‌రావడంలేదు.

సరోజకే కాదు – ఆ ఫెయిల్ కనకారావుకీ బాధగానే ఉంది. సరోజను గాక మరొకరిని ఆ పాత్రకు నియమించి ఉంటే అద్భుతంగా రావలిసిన సీను అది. సరోజ వల్ల పూర్తిగా గాకున్నా కొంతవరకూ ఫెయిలయింది. అది రేపు మొత్తం సినిమా మీద చూపిస్తే దెబ్బతింటుంది.

రామారావు పైకి వెళ్తూ సరితను పిలిచాడు. అతడితో పాటు పైకి వెళ్లింది.

"సరోజ ఫెయిలయిపోయిందేమిటి? అంది విచారంగా సరిత.

"సరోజ ఫెయిలవడంకాదు; ఆమె ఫేస్ ఫెయిలవుతున్నది. సరోజలో నటించే స్థాయి బాగానే ఉంది. కానీ ముఖంలోకి రావడంలేదు."

"అంటే?" ఆశ్చర్యంగాచూస్తూ అంది.

"కొంత మంది కడుపులో భగ భగ మంటలు పుడుతున్నా, ఆ మంట మనస్సు మీద ప్రభావం ఉన్నా, అది ముఖం మీద ప్రస్ఫుటంగా కన్పించదు. అదే ఫొటోజెనిక్ అంటే! నిజానికి సరోజ బాగా నటించింది. నాటకమయితే ఆ హావ




భావాలతో రక్తికట్టించేది. నాటకంలో ఫేస్ ముఖ్యం కాదు. హావభావాలే ముఖ్యంగా కన్పిస్తాయి కనుక! అదే తెరకు వచ్చే టప్పటికీ హావభావాలకంటే ముఖ్యం మనోభావాలు ముఖం మీద ప్రస్ఫుటంగా కనిపించాలి. ఆమె ఎంత ప్రయత్నించినా ఆ ఫీలింగ్ రావడంలేదు. అది ఆమె తప్పు కాదు. శరీర లోపం! ఆమె మాత్రం ఏం చేస్తుంది. పోనీ, ఆ పాత్ర నువ్వు నటిసావా? తిరిగి రీటేక్ చేయిద్దాం?"

చేతులు ఎత్తి దండం పెట్టింది. "నాకు వద్దు బాబూ! కళ్లతో చూస్తున్నాను సరోజబాధ! ఉదయం 'నాకు అవకాశం లేక పోయిందే!' అని బాధ పడ్డాను. సాయంత్రానికల్లా అవకాశం దొరక నందుకు సంతోష పడ్డాను. ఇటువంటి బాధలు నాకెందుకు? ఇన్ని బాధలు పడితే బజార్లలో ప్రతి ఒక్కరితో అది, ఇది అంటూ తిడుతూనే పొగుడుతుంటారు. బయట కన్పిస్తే రాళ్లతో సత్కారం చేస్తారు. ఈ బాధలన్నీ పడేకంటే వంట చేసి బతకడం తేలిక, ఆనందంగా కూడా ఉంటుంది" అంది నవ్వుతూ.

అమాయకంగా కన్పిస్తున్న ఆమె ముఖం చూస్తూ "నీలాగే అందరూ చెడక ముందే తెలుసుకుంటే, మద్రాసుకు రాకుండా ఇండ్ల వద్దనే నాలుగు డబ్బులు పారేసి, సినిమాచూసి ఆనందించవచ్చు ఇందులోకి వస్తే ఏముంది? అందరితో చీత్కారింపులూ' అవహేళనలూ, అల్లరి పట్టడం, శరీరం నాశనం తప్పితే!" అన్నాడు ఆలోచనగా.

ఈ సినిమా అవకాశం తప్పిపోయి నందుకు దేవుడికీ, శరీరాన్ని నాశనం గాకుండా కాపాడినందుకు రామారావుకీ మనసులోనే కృతజ్ఞతలర్పించింది.




హోటల్ నలందా పార్కులోనికి వచ్చి, టాక్సీ పార్కుచేశాడు డ్రైవరు. కనకారావు దిగుతూ వుండగానే ఖాదర్ పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఖాదర్‌ను చూసి నిలబడ్డాడు కనకారావు.

"మీకోసం అన్ని హోటల్స్ వెతుకు తున్నాను సార్! గుప్తాస్ లాడ్జివద్దకు వెళితే 'ఇప్పుడే వెళ్ళార'ని చెప్పారు. బుహారీ దగ్గర అడిగాము. రాలేదన్నారు. ఇక్కడ ఉండవచ్చని వచ్చాను" అన్నాడు ఆందోళనగా.

"ఏమంత అర్జంటు? చెప్పాను కదా ఉదయం వస్తానని" అన్నాడు చిరాకుగా.

"పోలీసులు, సి. ఐ. డి. ఆఫీసర్లు వచ్చారు. వెంటనే మిమ్మల్ని తీసుకు రమ్మని రామారావు గారు చెప్పారు. గంటసేపయింది మీకొరకు తిరుగుతూ వున్నాను"

కనకారావు ఆశ్చర్యపోయాడు. పోలీసులు రెడ్‌చేయవలసిన పరిస్థితి ఏమీలేదు. బ్లాక్‌మనీలేదు. బ్లూ ఫిలింలేదు. వ్యభిచార కొంపా కాదు. పైగా సి.ఐ.డీ.లు రావడం!

"విశేషాలు ఏమిటసలు?" అన్నాడు ముఖం చిట్లించి కారు వైపు నడుస్తూ.

కారులో కూర్చుంటూనే కారు కదలింది.

"నాకు కూడా ఏమీ తెలియదుసార్!"

"ఎవరెవరున్నారు?"

"సుబ్బయ్యగారిభార్యకూడావచ్చింది. మరో ముగురు ఆంధ్రుల్లాగున్నారు. నలుగురు పోలీసులు, ఇన్‌స్పెక్టరు, ఇద్దరు సి.ఐ.డీ.లు ఉన్నారు".

"సరితను తీసుక పోవడానికి ఈ పద్ధతి మీద వచ్చిందేమో?" అంది సరోజ అతన్ని చూస్తూ. కనకారావు జవాబివ్వ లేదు.

ఇంటిపద్దకు వచ్చేసరికి లోపల తర్జన భర్జనలు జరుగుతున్నట్లున్నాయి. దిగి లోనికి వెళ్ళాడు.

కన్నమ్మ ఒక్కతేకాదు ఇంకా చాలా మంది ఉన్నారు. డైరెక్టరు సుబ్బయ్య బలగం కూడా అక్కడ ఉంది. దూరంగా సరిత కూర్చుని వీరివైపే చూస్తున్నది. నవ్వుతున్న రామారావును చూసి ఆందోళన తగ్గించుకున్నాడు కనకారావు.



"సరిత తండ్రి వచ్చాడు. పట్టినే కాకుండా సి. ఐ. డి. ఎంక్వయిరీ చేయించి, సరిత ఎక్కడున్నదీ ఆరా తీయించి మరీ వచ్చారు. వాళ్ల గ్రామం అంతా కమ్యూనిస్టులట. ఏకుల దగ్గర నుండి మేకుల వరకూ తెచ్చారు. సరితను తెచ్చిన వాడిని పట్టి బాదితే కన్నమ్మ పేరు, అడ్రసు ఇచ్చాడు. ఇక్కడి కమ్యూనిస్టులను తోడు తీసుకొని ఆ కన్నమ్మ అడ్రసు తెలియక రెండురోజుల నుంచి గాలించి పట్టుకున్నారు. కన్నమ్మ తప్పుకోవడానికి మన అడ్రసు చెప్పింది. అయినా విడువకుండా ఆమెను వెంట పెట్టుకొని ఇక్కడకు తీసుక వచ్చారు. వచ్చీరావడంతోనే నన్ను బెదిరించారు అరెస్ట్ చేస్తామని! నేనేంచేయాలి? పైగా మనకున్న సంబంధం ఏమిటి? సరితను తెచ్చివారి ముందు నిలిపి నిజాలు వాళ్లనే తెలుసుకోమన్నాను."

"సరిత చెప్పిందా?"

"ఎందుకు చెప్పదూ? సరితకు మనం ద్రోహం చేయలేదు. మరి మనకు ద్రోహం చేస్తుందని నేననుకోను. ఏం చెప్పిందో నాకు తెలియదు. నన్ను మేడపైకి వెళ్ళమన్నారు. వెళ్ళిపోయాను. మేనేజరును ప్రశ్నిస్తున్నారు. గంట తర్వాత దిగి రమ్మంటే తిరిగి వచ్చాను. ఇప్పుడే మీరూ వచ్చారు."

"సరితతో మాట్లాడావా?"

"లేదు. వాళ్ళు అటు పోనివ్వడంలేదు. సరితను ఒక్కదానినే కూర్చోబెట్టారు."

"అనవసరంగా మనం బురదపూసుకున్నాం" అన్నాడు విచారంగా కనకారావు.

వారి వద్దకు వచ్చి తనను పరిచయం చేసుకున్నాడు.

ఇన్‌స్పెక్టరును పక్కకు పిలిచి, సుబ్బయ్య ఏదో మాట్లాడుతున్నాడు. కన్నమ్మ తలుపు వద్ద, కాలు తలుపుకు ఆన్చివంచి నిలబడింది తలవంచుకుని.

"సినిమా రంగమంటే చాలా బాగా ఉందయ్యా! దేశంలోని ఆడపిల్లల్ని అల్లరి లేపి, వారి జీవితాలు నాశనం చేయడానికి బాగా ఉపకరిస్తుంది" అన్నాడు అతడు తమిళంలో. కనకారావుకి అర్థమవుతుంది కనుక విన్నాడు. రామారావుకి అర్థం కాదు గనుక అతడి ముఖంలో భావాల్ని చదువుతున్నాడు.

"మీరు పొద్దిపాడు ప్రాంతానికి షూటింగుకి వెళ్ళారా?" అన్నాడు పక్కనున్నవ్యక్తి తెలుగులో.

"వెళ్ళాము."

అక్కడికి దగ్గరే ఐదుమైళ్ళదూరంలో ఉంది పెద్ద పసుపుల. సరిత కూడా షూటింగుకు వచ్చింది కదా! కనీసం మీలో నిజాయితీ ఉన్నా మాకు అప్పగించవచ్చు కదా వచ్చి" అన్నాడు అతడు ఆవేశంగా.

"క్షమించాలి.మా పనుల ముమ్మరంలో మేమున్నాము. పైగా అక్కడే ఆ గ్రామం ఉందని మాకు తెలియదు. తెలిసి ఉంటే తప్పకుండా వచ్చేవాళ్ళం. పైగా సరిత కూడా చెప్పలేదు. ఆ పల్లెలు ఆమెకు తెలిసే ఉంటాయి.తమగ్రామం దగ్గరలోనే ఉండి వెళ్ళడానికి ఆమె ఆసక్తి చూపకపోతే మేం ఏం చేయగలం?" అన్నాడు కనకారావు తగ్గు స్వరంతో.

"మీ పేరేమిటి?" అన్నాడు అతడు.

"నా పేరు కనకారావు"

"నా పేరు సిద్ధారెడ్డి. సరిత నా కూతురు"

ఆశ్చర్యంగా అతన్ని చూసి నమస్కారం చేశాడు.

"సరిత విషయంలో మా తప్పు ఏమీ లేదండీ ! సరిత జీవితాన్ని బాగు చేద్దామనే అక్కడినుండి ఇక్కడకుతెచ్చాం. సరిత ఆ విషయం మీకుచెప్పిఉంటుందను కుంటాను."

సిద్ధారెడ్డి తలూపాడు. ఇన్‌స్పెక్టర్ సిద్ధారెడ్డిని పిలిచాడు. వరండాలో వారి మధ్య తర్జన భర్జనలు జరుగుతున్నాయి.

అందరూ బయటకు వెళ్ళారు. కార్లు వెళ్లిపోతున్నాయి. వెళ్ళిపోతున్న కార్లను చూస్తూ ఖాదర్ లోనికి వచ్చి వెళ్లినట్లు చెప్పాడు.

సరిత వారి దగ్గరగావచ్చింది.కళ్ళు వాచి ఉన్నాయి ఏడ్పుమూలంగా!

"ఏం చెప్పావు సరితా?"

"ఉన్న విషయాలు చెప్పాను. ఇక్కడ ఎందుకున్నదీ చెప్పాను. అక్కడ నుండి చెర తప్పించుకోడానికి ఇక్కడికి వచ్చానన్నాను. ఇక్కడ నాకు స్వేచ్ఛగా ఉందనీ, ఎట్టిఅడ్డూ, బాధాలేదనీ చెప్పాను" అంది ముఖంతుడుచుకుంటూ.

"భయపడకు. మీ నాన్న వచ్చాడుగా! ఇక ఇంటికి వెళ్ళవచ్చు."

"ఇంటికా? తలఎత్తుకొని ఊర్లో తిరుగ గలనా? పోయి ఏ పెన్నానదిలోనో పడి చావక'' అంది ఏడుస్తూ. "నేనుఎక్కడికీ పోను, ఇక్కడే ఉంటాను" అంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

రామారావు, కనకారావు ఆమెను చూస్తూ నిలబడ్డారు. మేనేజర్ భయం భయంగా నిలబడ్డాడు టేబుల్‌మీద చేతులు ఆన్చి! ఖాదర్ తలుపువద్ద నిలబడ్డాడు విచారంగా చూస్తూ.

"ఇంటికి వెళ్ళండి" అన్నాడు కనకారావు మేనేజరును చూస్తూ.

తలూపి అతడు బయటకువెళ్ళాడు. ఖాదర్‌ను పిలిచి, డబ్బుఇస్తూ భోజనం తీసుకరమ్మన్నాడు.

"నన్ను పంపిస్తారా?'' అంది పడక గదిలోకివచ్చి సరిత.

"నీయిష్టం! మీనాన్న ఇష్టం! ముందు మా నెత్తికి అభాండాలు రాకుంటే చాలను కుంటున్నాను" అన్నాడు రామారావు.

''మీ మీదకు ఎందుకువస్తాయి? వాళ్ళతో అన్నీ చెప్పాను. మీరు లేకుంటే కన్నమ్మ నా జీవితాన్ని ఇలాగే నాశనం చేసేదని చెప్పాను. మీరు చేసిన పని మంచిదే నని మానాన్న వెంట ఉన్నతనుకూడా అన్నాడు."

"సరే! చూద్దాం పరిస్థితి. కన్నమ్మ ఇంటి వద్దకు వెళ్ళినట్లున్నారు. ఏంచేసుక వస్తారో చూద్దాం"

"కన్నమ్మను జైలుకు తీసుకువెళ్లారా'' అంది అతని ముఖంలోకి చూస్తూ. రామారావు నవ్వాడు.

ముఖ్యమంత్రినుండి మద్దతు పొందగల శక్తి ఆమెకూ, ఆమె ప్రియుడికీ ఉంది. కాకపోతే కొంత డబ్బు వదులుతుంది. అటువంటివారిని ఎవరూ ఏం చేయలేరు. అంతే!"

"నేను ఇక్కడే ఉంటాను. మా గ్రామం వెళ్ళి తలఎత్తుక తిరుగలేను. పైగా మిమ్మల్ని విడిచిపోవాలనుకోవడంలేదు. ఎక్కడికి వెళ్ళినా ఇంతకంటే సుఖమైన జీవితం ఏముంటుంది? అందువల్ల ఇక్కడే ఉంటాను.''

"నిన్ను ఉంచుదామనే ఇక్కడికి తెచ్చాను. మీనాన్న వ్యతిరేకించి తీసుకెళ్ళవచ్చు. తీసుకెళ్ళి పెళ్ళి చేస్తాడు"

తన శరీరం వైపు చూసుకుంది విచారంగా సరిత. "ఇంకేం పెళ్ళి ? చేసుకునే

వాడు మాత్రం నా జీవితం తెలిసి ఎలా చేసుకుంటాడు? డబ్బుకొరకు చేసుకున్నా తర్వాత తన్ని పంపితే, నిలువ నీడ లేకుండా పోతుంది. నాకు అన్నీ మీతోనే! ఇక్కడే మీతో కలిసి ఉంటాను. నన్ను దూరం చేయకండి" అంది ఏడుస్తూ అతన్ని కౌగిలించుకుని. ఆమె వీపు నిమిరి మంచం పైన పడుకోబెట్టాడు. వెక్కుతూ పక్కకుతిరిగి పడుకున్నది. సరిత తండ్రి ఏం తెలియనివాడై, వెతక్కుండా మానుకున్నాడని భావించాడు రామారావు. అతడు ఈకతో పాటు తోలు కూడా పెరికేవాడని ఇప్పుడు తెలుసుకున్నాడు. ఈస్థితిని బట్టి చూస్తే తనకంటే అతడే బలవంతుడుగా కన్పిస్తున్నాడు. సరిత పోతే చేసేదేంలేదు. ఉంటానంటే అతడు ఉంచుతాడా? కూతురు చెడు జీవితాన్ని తన గ్రామంలో చూపకుండా ఉండడానికి ఇక్కడే ఉంచుతాడా? అతడే ఆలోచించాలి. అతడు తీసుకుపోతానంటే, రాననే శక్తి సరితకూ ఉండదు. వ్యతిరేకించే స్థాయి తమకూ లేదు. అతని నిర్ణయమే చివరి నిర్ణయం. ముందు కన్నమ్మ వద్ద వివరాలు తెంచుకుని రావాలి. ఆ తర్వాత ఇక్కడ నిర్ణయం చేస్తాడనుకున్నాడు.

పదకొండుగంటల సమయంలో టాక్సీ, టాక్సీలో సుబ్బయ్య అసిస్టెంటువచ్చాడు. తలుపు తట్టి లేపి సరితను తీసుకరమ్మన్నారని చెప్పాడు. కనకారావు కూడా లేచి వచ్చాడు. సరోజను ఇంట్లోఉంచి, సరితతో పాటు రామారావు, కనకారావు వెళ్ళారు.

వీరు వెళ్ళేసరికి పోలీసులు ఎవరూ లేరు. కన్నమ్మ, సుబ్బయ్యలతోపాటు సిద్ధారెడ్డి, మరికొందరు కూర్చుని ఉన్నారు. సరితను చూసి, "నీ నగలు ఏమేమిటో చెప్పమ్మా!" అన్నాడు సుబ్బయ్య.

సరిత దండకంలా చెప్పింది వరుసగా. మూడు నెలల తర్వాత కూడా ఇంకా జ్ఞాపకం పెట్టుకున్న ఆ అమ్మాయిని చూస్తూ కూర్చుంది కన్నమ్మ.

ఆ అమ్మాయి నగలు ఆ అమ్మాయికి ఇప్పించారు. అందులో కొన్నిలేవు. వాటికి బదులుగా ఇతర వస్తువులు ఇప్పించారు. ఆ అమ్మాయి జీవితం నాశనం చేసినందుకు నష్టపరిహారంగా యాభైవేలు ఆ అమ్మాయికి ఇప్పించారు. కేసు పెట్టకుండా, అల్లరి పట్టకుండా బయటపడడానికి ఇంత కంటే మార్గం కన్పించలేదు కన్నమ్మకూ, సుబ్బయ్యకూ.

వస్తువులు, అంత మొత్తం సిద్ధారెడ్డి సాధించడం గొప్ప విషయంగా కన్పించింది కనకారావుకి. సుబ్బయ్య స్థాయి పెద్దది. ఆ స్థాయితో అందరినీ ఆకట్టుకోగలడు. అతని ఉంపుడుగత్తెగా ఆమెకు అండ ఉంది. ఎంతమందిని ఏంచేసినా ఆమెను అడిగే దిక్కులేదు. ఈరోజు ఆమెకు తల వంపులుగా తయారయింది. సిద్దారెడ్డి రాజకీయంగా తీసుకవచ్చాడు. మద్రాసు స్టేట్ లో వారికున్న బలాన్ని బట్టి, సుబ్బయ్యను ఆంధ్రకు కట్టగట్టి పార్సిల్ చేయగలరని అతనికి తెలుసు. కన్నమ్మ బతుకు ఏం చేసినా దిక్కుండదు. అవన్నీ ఆలోచించే ఈ రాజకీయవాదులో తల గోక్కోవడంకంటే యాభైవేలు నష్టపోయినా బాధలేదనిఇవ్వడానికినిర్ణయించుకున్నారు.

రాత్రి ఒంటిగంటకు సంప్రదింపులన్నీ పూర్తయి, డబ్బు తీసుకుని బయటపడ్డారు. అక్కడినుండి టాక్సీలు తీసుకుని కనకారావు ఆఫీసుకు వచ్చారు. సిద్ధారెడ్డి ఏదో మాట్లాడబోయినా "ఉదయం మాట్లాడుకుందాం లెండి" రెస్టు తీసుకోండి !"

అన్నాడు కనకారావు. సిద్ధారెడ్డిని మేడ మీద పరుండబెట్టి, సరోజనూ, సరితనూ కనకారావు రూంలో పరుండబెట్టి, కనకారావు, రామారావు హాలులోనిసోఫాల మీద నడుం వాల్చారు. గోడ గడియారం అర్ధ గంట కొట్టింది. తలెత్తిచూస్తే ఒకటిన్నర అయింది.

• • •

రాత్రి సరిగా నిద్రపట్టని సరిత, ఉదయం అందరికంటే ముందులేచి ఫలహారం చేయడానికి స్టవ్ ముందు కూర్చుంది.

నౌకరు పాలతో వచ్చేటప్పటికి ఫలహారం పూర్తి చేసింది. పాలు పొయ్యి మీద పెట్టి నలుగురినీ లేపింది. ఆలస్యంగా పడుకోవడంతో ఇంకా నిద్రమత్తు వదలలేదు. అయినా, మళ్ళీ భాగోతం చాలా ఉందని లేచాడు కనకారావు. ఈ రోజు మిగిలిన మూడు పాటలు పూర్తి చేయాలనుకున్నారు. రికార్డింగ్ పూర్తవుతే ఔట్ డోర్ షూటింగ్ మరో రెండు డాన్స్ ప్రోగ్రామ్స్ పూర్తి చేయవచ్చను కున్నారు. సిద్ధారెడ్డి లేచి కిందికి దిగి వచ్చాడు. రాత్రి ఉన్నంత కోపతాపాల మీద లేడు మనిషి. ముఖం కడుక్కుని అందరూ ఫలహారం చేశారు. సరిత పైకి వెళ్తూ తండ్రిని పిల్చింది. సిద్ధారెడ్డి పైకి వెళ్ళాడు.

"నేను ఇంటికి వచ్చి తల ఎత్తుకుని తిరుగలేను నాన్నా! నేను రాను" అంది ఏడుస్తూ.

"నిన్ను చూడకుంటే మీ అమ్మ బతకదు. అందుకే ఎంత డబ్బు ఖర్చయినా తిరిగి పోరాడాను. ఎవరేమను కుంటే మనకేం?" అన్నాడు సిద్ధారెడ్డి.

అతడికి తెలుసు ఆడపిల్ల జీవితం బజారున పడ్డ తర్వాత చినిగిన విస్తరి సామెతలా గుంటుందని. అయినా ఇంటికి తీసుకు వెళ్ళే తర్వాత ఏదో మార్గం ఆలోచించ వచ్చు. అటువంటి వ్యక్తిని తెలిసి పెళ్ళి చేసుకోడానికి ఎవరూ ముందుకు రారని కూడా తెలుసు. పెళ్ళి చేయడానికి ప్రయత్నించినా 'గంతకుతగ్గ బొంత'లా ఎవడో డబ్బు కొరకు గడ్డితినేవాడికి అంటగట్టవలసి ఉంటుంది. అంటగట్టినా, వాడికి ప్రతి నిముషం పెళ్ళాం మీద అనుమానమే! ఆ కాపురం చేయాలంటే ఆడదానికి సాధ్యంకాదు. ఇవన్నీ రాత్రి ఆలోచిస్తూనే ఉన్నాడు. తీసుకు వెళ్ళ కుండా ఎక్కడ పెట్టాలి? ఆ తర్వాత జీవితం ఏమిటనేది అతని సమస్య!

"అమ్మను రమ్మను ఇక్కడికే! కొంతకాలం ఉండి వెళ్తుంది."

"నీవు ఇక్కడే ఉంటావా? ఇంకా ఈ సినిమా జీవితం మీద ఆశ ఉందా?"

"సినిమా జీవితం మీద ఆశ ఎప్పుడో చచ్చింది. అది నాకు వద్దు కూడా. రామారావును చూశావుగా! ఆయనే ఆ చెర నుండి విడిపించి ఇక్కడ ఉంచాడు. ఈ నెలలో ఇంతవరకూ ఒడిదుడుకులు లేకుండా హాయిగా జీవితం గడిచి పోతోంది. వారితోపాటే నాకూ ఇంటి వ్యక్తిగా విలువ ఇస్తున్నారు. ఇక్కడి నుండి పోతే మాత్రం ఇంతకంటే సుఖం ఏం అనుభవించగలను? పైగా అన్న దమ్ములు ఇద్దరూ మర్యాదగలవారు. నేనంటే ఆప్యాయతా, అభిమానం వుంది. నన్ను భరించేందుకు ఆయన సిద్ధంగా ఉన్నాడు. మళ్ళీ మన ఊరు వచ్చి, తల ఎత్తుకుని తిరుగలేక కుళ్ళిపోతూ బతకడం కంటే, ఇక్కడ దొరికిన గౌరవాన్ని నిలబెట్టుకుని బతకడం మంచిది

కదా?"

"భ్రమలో పడుతున్నావు నువ్వు! ఈ సినిమా తీసేవరకూ నిన్ను అడ్డుపెట్టుకుంటారు. సినిమా పూర్తయితే వాళ్ళ తోవ వాళ్ళు వెళ్తారు. అప్పుడు మరింత దిగజారేది నువ్వే! ఆ భ్రమలు పెట్టుకోకు. మన ఊరిలో లేకపోతే మరో ఊరిలో ఉందువుగానీ! ఒక విధంగా నాశనమై మరో విధంగా బురదలో ఇరుక్కోవడం మంచిదికాదు."

"లేదునాన్నా! అయన్ను మోసగాడుగా నేను భావించడంలేదు. వాళ్ళ ఊరుకు తీసుకెళ్తానన్నాడు. నీవే అడిగి చూడు ఏమంటాడో! నాకు విశ్వాసం, నమ్మకం ఉంది. నీవు నాకు పెళ్ళిచేసినా ఈ స్థాయి సంపాదించుకోలేను. నీవే అడిగి నిర్ణయించు. ఇంతటితోనయినా నేను బాగుపడతాను" అంది సరిత తల వంచుకుని ఏడుస్తూ.

సిద్ధారెడ్డి రామారావును ఏమీ అడుగ



లేదు. ఆరోజు కూడా అక్కడే ఉన్నాడు. పాట రికార్డింగ్ చూస్తూ ఉన్నాడు. రాత్రి పదకొండుగంటలదాకా పోరాడి పాటలు పూర్తి చేశారు.

రేపు తిరిగి ఇన్‌డోర్ షూటింగు కొనసాగించాలన్నాడు కళింగ. వరుసగా నాలుగు రోజులు ఇన్‌డోర్ షూటింగు, ఆ తర్వాత రెండు రోజులు ఔట్‌డోర్, మళ్ళీ ఇన్‌డోర్ వరుసగా కార్యక్రమాలు తీసుకోవాలని నిర్ణయించుకున్నారు.

మూడవ రోజు వెళ్ళడానికి సిద్ధపడుతూ రామారావునూ, సరితనూ పిలిచాడు సిద్ధారెడ్డి.

"అమ్మాయి ఇక్కడే ఉంటానంటున్నది. నీ యిష్టం ఏమిటి?'' అన్నాడు. రామారావు సరిత వైపు చూశాడు. సరిత తలుపువైపు చూస్తూ నిలబడింది.

"మీ యిష్టం! సరిత ఇష్టం. ఇందులో నా యిష్టమేమిటో సరితకు ఇంతకు ముందే తెలుసు. మళ్ళీ చెప్పడమెందుకు?" అన్నాడు.

"సినిమావాళ్ళలాగే ఆ అమ్మాయి జీవితం మీరు మాత్రం నాశనం చేయరని నమ్మకమేమిటి?"

"వాటికి నేను జవాబివ్వను. నేను ఆశ చూపించలేదు. చూపించను. ఆ విషయాలన్నీ సరితకు బాగా తెలుసు. అందువల్ల ఏం నిర్ణయించుకున్నా మీరిద్దరే నిర్ణయించుకోవాలి" అన్నాడు అక్కడి నుండి వెళ్తూ.

"ఇంత కఠినంగా మాట్లాడే వ్యక్తితో రేపు నీకే కష్టం!" అన్నాడు సిద్ధారెడ్డి. సరిత చిన్నగా నవ్వుతూ "ఆయన అలాగే మాట్లాడుతాడు. ఆయన మనస్సు నాకు తెలుసు నాన్నా! నాకు ఇదే రక్షణ స్థలం అన్న నమ్మకం ఉంది. ఇంతకంటే విలువా, రక్షణా ఎక్కడా దొరకదు. అందువల్ల నీవు బాధపడవద్దు. అమ్మను పంపించు. పది రోజులపాటు ఉండి వెళ్తుంది" అంది.

"డబ్బేమైనా కావాలా?"

"నాకెందుకు? తీసుకెళ్ళు! నగలు మాత్రం ఇచ్చి వెళ్ళు! అవి తీసుకెళ్ళినా అక్కడ ఎవరు పెట్టుకుంటారు? నేను సుఖంగా ఉన్నానని అందరితో చెప్పు. చెడి బతకడంలేదని కూడా చెప్పు. అమ్మకు ధైర్యం చెప్పి పంపు. అమ్మ కొరకు ఎదురుచూస్తాను" అంది అతని ముఖంలోకి చూస్తూ కళ్లు తుడుచుకుని.

బాగ్ తెరచి నగలపెట్టె తీసి ఇచ్చాడు. డబ్బుకూడా కొంత ఇవ్వడానికి ప్రయత్నించాడు. సరిత వారించింది. "అవసరమైతే తెలుపుతానుగా! నీకంటే నాకెవరున్నారు అడగడానికి? ఇప్పుడు అవసరంలేదు" అంది.

ఆరోజు పదకొండు గంటలకు జనతాలో వెళ్ళిపోయాడు.

మెట్లుదిగి వంటింటిలోకి వెళ్తున్న సరితను చూస్తూ కూర్చున్నాడు కనకారావు. ఇంతకు ముందులాగా ఓ సాధారణమైన వ్యక్తిగా చూడడానికి అవకాశం లేనంతగా ఎదిగిపోయిందనుకున్నాడు. ఆమె తండ్రి బలమేమిటో కళ్ళతో చూసి ఆమెను ఓ సాధారణ వ్యక్తిగా భావించడం ఇక సాధ్యంకాదు. ఈ ఇంటిలో గౌరవం పెంచుకుంటున్నది అనుకున్నాడు.

తిరిగి షూటింగుకు కావలసిన పరికరాలను సమకూర్చుకోవడంలో, ఆఫీసు మేనేజరు, ప్రొడక్షన్ మేనేజరు తలమునకలయ్యారు. కళింగ తనకు కావలసిన వస్తువులన్నీ లిస్ట్ రాయించాడు. కారుతీసుకొని,




రోడ్డుమీద పడ్డారు వాటికోసం.

కనకారావు ఫిల్మ్ రోల్స్ కొరకు వెళ్ళాడు. అక్కడినుండే గుప్తాస్ లాడ్జి వద్దకు వసాసనీ, ఇద్దరూ కలిసి ఆఫీసుకు రావాలనీ ఫోన్‌చేశాడు సరోజకు. ఈ రెండు నెలలూ సరోజ కూడా ఉంటే కొంత పనులు సానుకూలమవుతాయి. కొత్తవారి మీద ఆధారపడడంకంటే, నమ్మకస్తులమీద, విశ్వాసం ఉంచేవారి మీద ఆధారపడడం మంచిదనుకున్నాడు. పైగా డబ్బు ఖర్చు చేయవలసిన అవసరం లేకుండా వచ్చి పనిచేసే వ్యక్తి. గ్రాడ్యుయేట్! అకౌంటు పుస్తకాలు ముందేస్తే, అన్నీ ఆమే సర్దుకోగలదు. ఈ టాక్సుల బాధ ఒకటి తలనొప్పి. వీటన్నిటికీ దొంగ బిల్లులు, తక్కువ మొత్తం ఇచ్చి ఎక్కువ ఇచ్చినట్లు సృష్టించడం; ఈ తలనొప్పి ఆమెమీద వేస్తే భరిస్తుంది. ఎలాగూ మధ్యాహ్నం ఒంటిగంటవరకూ డ్యూటీ ఉండదు. తిరిగి ఏడు గంటలకు డ్యూటీ అయిపోతుంది. మిగిలిన పద్దెనిమిది గంటలూ ఇక్కడ పెడితే సరిపోతుందనుకున్నాడు. పైగా సరిత అతడికి పులిలాగా ఉంది. ఆమెతో సపర్యలు చేయించుకునేస్థాయి తనకు లేదనుకున్నాడు.

మూడులక్షలకు పైగా అయింది. సగం కూడా ఇంకా పనికాలేదు. ఇకనయినా ఖచ్చితంగా ప్రవర్తించాలి. డిస్ట్రిబ్యూటర్ల కొరకు ప్రయత్నిస్తే ముందుకురావడంలేదు. అందరూ కొత్త నటులే! పెట్టుబడి వస్తుందని డిస్ట్రిబ్యూటర్స్ ఆశించడంలేదు. పైగా ఎవరు చెప్పినా వినకుండా ఒంటెత్తుపోకడగా తిరుగుతున్నారు. దీనికితోడు ఈ సంఘటనలతో సినీరంగంలో సుబ్బయ్య తన హోదా ఉపయోగించి, సరితను తమవద్ద ఉంచుకున్నందుకు ప్రతీకారంగా డిస్ట్రిబ్యూషన్ దొరక్కుండా చేస్తాడు. అప్పుడే ఒకరిద్దరు డిస్ట్రిబ్యూటర్స్ అన్నారు 'అతడితో మీకెందుకు వైరం' అని.

ఈ స్థితిలో మిగిలిన రెండు లక్షలతో ముగించుకుంటే ఇంటికి వెళ్ళినా మళ్ళీ డబ్బు అందిస్తారన్న నమ్మకంలేదు. రాత్రింబగళ్ళు నిర్విరామంగా పోరాడి పూర్తి చేయాలనుకున్నారు.




ఉదయం ఏడుగంటలకే సెట్ సిద్ధమయింది. ఇన్‌డోర్ షూటింగు కనుక, డబ్బింగ్ కూడా కలిసివస్తుంది. పెద్దగా సెట్ వేయడం ఏమీలేదు. ఉన్న హాలునే సరిపుచ్చారు.

కెమేరాలు పొజిషన్‌లో పెట్టారు. బయటజనం ఎవరూ లేరు. హీరో, తండ్రి, తల్లి, ఇద్దరు జూనియర్ ఆర్టిస్టులు అన్నలుగా నటిస్తున్నారు. టెక్నీషియన్స్ అందరూ సిద్ధంగా ఉన్నారు. చద్ద ముక్కలు గీసిన ప్రాంతంలో మంచాలు వేశారు. సీను షాట్ ఆరంభమయింది. హీరో రాంగోపాల్ బాగా నటిస్తున్నాడనుకున్నాడు కనకారావు. అతని పరిస్థితి చూస్తే వృద్ధిలోకి వచ్చే విధంగా

కన్పిస్తున్నాడు. అందులో ఫీలింగు చూపించవలసింది అతడి ఒక్కడిదే! మిగిలినవారు నిద్రపోతుంటారు. అందువల్ల కెమేరా అతని మీదనే ప్రతిష్ఠాత్మేనా పనిచేసింది. అద్భుతంగా చిత్రీకరణ జరిగింటనుకున్నాడు కళింగ! ఇక తన ప్రమోషన్‌కు ఢోకాలేనట్లు అతడు భావించాడు..

ఆ సీను పూర్తయ్యేసరికి పదకొండు గంటలయింది. అందరినీ రెస్టు తీసుకోమన్నాడు కళింగ.

"సీను మీకు నచ్చిందా?" అన్నాడు కనకారావు వద్దకు వచ్చి.

"నచ్చవలసింది మాకు కాదు; డిస్ట్రిబ్యూటర్‌కు. వాడు తీసుకోకుంటే బాధపడాలి."

"అదేం మాటసార్! ఈ వెధవలకు డిస్ట్రిబ్యూషన్ ఇచ్చేకంటే జిల్లాలవారీ అమ్ముకోవడం మంచిది. పర్సెంటేజి ఎక్కువ లాగుతారు.డబ్బులు సక్రమంగా ఇచ్చిచావరు. చిన్న డిస్ట్రిబ్యూటర్స్ అయితే ఎప్పటి కప్పుడు ఇస్తారు" అన్నాడు.

"పూర్తి అయిన తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు కనకారావు.

భోజనాలు చేసివచ్చిన తరువాత రెండో సీనుకు సమాయత్తమయ్యారు. రాత్రి ఏడు గంటలదాకా చెమటలు కక్కుతూ షాట్స్ తీస్తూనే ఉన్నారు కళింగ డైరెక్షన్‌లో.

ఏడు గంటలకు పూర్తి చేసి,అందరూ ఇళ్ళకు వెళ్ళారు. వెళ్ళిపోతున్న నాగినిని పిలిచి, "రేపు పెందలకడనే రా తల్లీ! నీతోనే ఆలస్యం అవుతున్నది" అన్నాడు కళింగ. నవ్వుతూ కారులో వెళ్ళిపోయింది నాగిని.

రేపు వర్క్ గురించి తిరిగి తర్జన భర్జన సాగించారు. రేపుకూడా ఈ రోజులాగే రెంగుసీన్లు పూర్తిచేసి, సాయంత్రం ఎవరినీ వెళ్ళనివ్వకుండా అర్ధరాత్రి అయినా సరే డబ్బింగు కొనసాగించాలని నిర్ణయించాడు కళింగ.

సరోజ టేబుల్‌మీదున్న అకౌంటు పుస్తకాలు, ఫైలులో ఉన్న లెక్కల చిత్తుకాగితాలు తీసుకుని ఎంటర్ చేయడానికి ప్రయత్నిస్తున్నది. కళింగకూడా ఉదయం ఏడు గంటలకు వస్తానని వెళ్ళిపోయాడు.

''లాడ్జిలో ఉద్యోగం, ఈ పనీ నువ్వేం చేస్తావు? ఆ ఉద్యోగానికి రిజైన్ ఇవ్వకూడదూ?" అన్నాడు కనకారావు ఆమె ముందు కూర్చుంటూ. తలఎత్తి అతని ముఖంలోకి చూసింది.

"నాబాధ నేను పడతాను మరో అవకాశం దొరికినప్పుడే దానికి రిజైను. అంత వరకూ లేదు" అంది పరిహాసంగా నవ్వి.

"నీ బాధ చూస్తుంటే నాకూ బాధగానే ఉంది"

"అందుకే తొందరగా ఏదయినా నాకు మార్గం చూసి పెట్టి బాధ తగ్గించుకోండి. అప్పుడు ఎవరమూ బాధపడవలసిన పని లేదు."

"మరో పదిరోజుల్లో ఊరు వెళ్ళి రావాలి. అక్కడ ట్యుటోరియల్ పెట్టే అవకాశం గురించి ఆలోచిద్దాం" అన్నాడు కనకారావు ఆమె చేతివేళ్ల వంక చూస్తూ.

అకౌంటు బుక్‌లో చకచక రాసుకుంటూ, అతని మాటలు వింటున్నది. కదులుతున్న ఆమె వేళ్ళవంకా, అటు ఇటు ఊగుతున్న రింగులవైపూ చూస్తూ కూర్చున్నాడు.

తలఎత్తి అతని ముఖంలోకి చూసింది. "ఏమిటలా చూస్తున్నారు?" అంది.

"నీ చెవులకున్న రింగులవైపు. అందులో ఏదో మంత్రం ఉన్నట్లుంది. అవి చూపిస్తూనే నన్ను ఆకర్షిస్తున్నావు'' అన్నాడు నవ్వుతూ.

జవాబివ్వలేదు. నవ్వుతూ తనపని కానిస్తున్నది.

ఆరోజు ఖర్చు వివరాలన్నీ రాసి కూడిక వేసింది. దస్త్రాలు తీసి, బల్ల సొరుగులో తోసి తాళంవేసి, తాళంచెవి అతడికి ఇచ్చింది.

''గుమస్తాను పెట్టుకోకూడదూ?'' అంది ఒళ్ళు విరుచుకుంటూ.

"నువ్వేవుండు. బాగా పనికివస్తావు?"

''జీతం బత్తెం లేకుండా పనికివస్తాను కదా!"

సరిత అక్కడకు వచ్చింది. సరితను చూస్తూ కూర్చుంది సరోజ. సరిత అందం ముందు తన అందం ఏమీలేదని సరోజకు తెలుసు.

''కూర్చో సరితా!" అంది ఆమెను చూస్తూ. ఆమె పక్కనే కూర్చుంది సరిత.

"భోజనాలు కానిద్దాం ! మరీ పొద్దు పోవడమెందుకు?'' అంది సరిత.

తల ఊపింది సరోజ. ఆకలవుతున్నది. సాయంత్రం వస్తూ కాఫీ తాగి వచ్చింది.

''మీరు లేచి కాళ్ళు కడుక్కోండి. ఆయనను లేపుకొస్తాను.పడుకున్నట్లుంది" అంది సరిత మేడపైకి వెళ్తూ. వెళ్తున్న సరితను చూస్తూ, "సరిత ఏదో సాధారణ వ్యక్తి అనుకున్నానేగానీ వెనుక ఇంత బలగం ఉందనుకోలేదు" అంది సరోజ.

కనకారావు పలుకలేదు. లేచి బాత్‌రూం వైపు సాగాడు. వెళ్ళుతున్న అతన్ని చూస్తూ కూర్చుంది సరోజ.

వుదయం ఏడు గంటలకు సరిగ్గా టాక్సీ దిగాడు కళింగ. అతనితో పాటు సంగీత దర్శకుడు శంకర్, అతని పరివారం కూడా వచ్చారు. అందరూ వచ్చేటప్పటికి ఎనిమిది గంటలయింది. కళింగ విసుక్కున్నాడు.

''అనవసరంగా మీరు లేటు చేస్తున్నారు. తొందరగా పూర్తికానివ్వాలి"

ఆరోజు రంగన్న కూడా సెట్ మీదకు వచ్చాడు. ఇంతవరకూ కథ పరిపోవడంతో అతన్ని ఎవరూ పరామర్శించలేదు. తిరిగి అతడితో అవసరమయింది. పైగా రామారావు కథ చూసుకునే స్థితిలో లేడు. బాధ్యతలన్నీ నెత్తిన పడ్డాయి. అందువల్ల రంగన్ననే సరిచూసుకోమన్నాడు.

మధ్యాహ్నం పదకొండు గంటలదాకా లాగించాడు కళింగ. భోజనాలు అక్కడే ఏర్పాటు చేయించి, మరో గంటలో సీనుకు రెడీ కావాలన్నాడు. అతనితొందర చూస్తుంటే 'రేపే సినిమా విడుదల చేసి, డైరెక్టరుగా పేరు సంపాదిద్దామనుకుంటున్నాడు' అనుకున్నారు కొందరు.

పన్నెండు గంటలకు అందర్నీ తరిమి తరిమి సిద్ధంచేశాడు కళింగ. హీరో వ్యాపారం చేయడం. అందులో క్రమక్రమంగా మెట్టుమెట్టుగా అభివృద్ధి సాధించడం, మంచి రచయితగా పేరు సంపాదించుకోవడం...బిట్స్, బిట్స్‌గా షాట్స్ లాగించవలసి వచ్చింది. అయినా ఒక్కడి మీదనే ఆధారపడి బిట్స్ ఉన్నాయి గనుక బాధపడకుండా లాగించారు.

సాయంత్రం నాలుగు గంటలకు ముగించారు. కళింగ ఇంకా లాగించాలను

కున్నాడు. కానీ సెకండ్ హీరోయిన్ లేదు. ఆమెగారిని పిలిపించే సరికి పొద్దు పోతుంది. ఇంతటితో షూటింగ్ ముగించి డబ్బింగ్ కార్యక్రమం కొనసాగించాలను కున్నారు.

మ్యూజిక్ పార్టీని రూంలోకి పంపాడు. ఔట్ డోర్‌లో హీరో హీరోయిన్ మాటలు, జాతర యొక్క వాయిద్యాల సవ్వడి, కొమ్ముల మోత, కేకలు— అన్నీ డబ్బింగ్ చేయాలను కున్నారు. తలనొప్పిగా ఉందని హీరో వెళ్ళిపోతానన్నాడు. కళింగ బతిమాలి, ప్రాథేయపడి నిలబెట్టాడు. తలనొప్పి బిళ్లలు, ఆయింట్‌మెంటు తెచ్చి ఇచ్చారు. 'పీడు ప్రాణాలు తీస్తాడు' అనుకున్నాడు హీరో కళింగను చూసి. కాదు, కూడదని వెళ్ళేదమ్ము రాంగోపాల్‌కు ఏర్పడలేదు. దొరికిన ఈ అవకాశంలో అవకతవకలుగా ప్రవర్తిస్తే, రేపు అసలే ఛాన్సులు దొరకకపోవచ్చు.

మేడపైన డబ్బింగ్ రూంలో కూర్చు న్నారు. సంగీత దర్శకునిది ఇక్కడ ప్రధాన బాధ్యత కావడం వల్ల, శంకర్ అందరికీ వివరంగా చెబుతున్నాడు. తాను కూడా చూడాలని ఉందని సరిత చెప్పడంతో, ఆమెకూ కుర్చీవేసి లోపల కూర్చోబెట్టారు. తలుపులు పూర్తిగా బిగించారు.

జాతర వాయిద్యాలు మోగు తున్నాయి. ఎదురుగా తెరమీద నెగెటివ్ ప్రదర్శన. ప్రదర్శనకు అనుకూలంగా వాయిద్యాలు, బొమ్మతోపాటు, కాళ్ళతో పాటు శబ్దం సృష్టిస్తున్నారు.

రాత్రి తొమ్మిది గంటలదాకా ఆ రూం లోనే పని చేశారు. తొమ్మిది గంటలకు కిందికి దిగి వచ్చి వెళ్ళిపోయారు. నాగిని వచ్చి ఆఫీసు రూంలో కూర్చుంది. ఆఫీసు రూంలో సరోజ తన పని చేసు కుంటున్నది వచ్చి కూర్చుని. సరోజను చూస్తూ ఎదురుగా కూర్చున్నది నాగిని!

కనకారావు లోనికి వచ్చాడు. "ఎప్పు డొచ్చావ్ సరోజా!" అన్నాడు పలక రింపుగా. తలెత్తి చూసి నవ్వి "ఎనిమిది గంటలకు వచ్చాను. నౌకరును అడిగితే డబ్బింగ్ రూంలో ఉన్నారని చెప్పారు. నా పని చేస్తున్నాను" అంది.

ఆమె పక్కనున్న కుర్చీలో కూర్చుంటూ "ఏం నాగినీ విశేషాలు?" అన్నాడు.

"డబ్బేమయినా సర్దుతారని కూర్చు న్నాను" అంది నాగిని నవ్వుతూ.

"నీ పాత్ర అయిపోయిందిగా! మర్చి పోయాను సరోజా! పుస్తకంతీసి నాగినికి ఎంత ఇవ్వాలో చూడు" అన్నాడు. సరోజ పేబుక్ తీసింది. నాగిని పేరు తీసి, ఇచ్చిన మొత్తం సరిచూసి, "పది హేను వందలివ్వాలి" అంది.

జేబులో నుండి పదిహేను వందలు తీసి ఇచ్చాడు. సరోజ స్టాంపులు అంటించి రశీదు నాగిని ముందుకు జరిపింది. నాగిని సంతకం పెట్టి లేచి "అవసరమయితే పిలిపించండి, తప్పక వస్తాను" అంది అతని కళ్ళల్లోకి చూసి.

ఖాదర్‌ను పిలిచి ఆమెను ఇంటివద్ద విడిచి రమ్మన్నాడు. నాగిని వెళ్ళి పోయింది.

మరుసటి రోజు సెకండ్ హీరో యిన్‌తో షూటింగు. హీరోయిన్ దైవభక్తి చూపించేదానికి పటాలు కావాలి. ఆ యింటిలో కాగడాతో వేసి వెతికినా ఒక్కటీ డైరెక్టరుకు దొరకలేదు. బజారు నుండి అద్దెకు తెప్పించారు. సెట్టుకు కావల




సిన వస్తువులు లిస్టు ప్రకారం ఉన్నాయో లేవో సరిచూసుకున్నాడు. అందరూ కలిసేసరికి ఎనిమిదిన్నర అయింది. రోజు రోజుకూ ఆలస్యంగా వస్తున్నందుకు విసుక్కున్నాడు.

రంగన్నతోపాటు మోహిని కూడా వచ్చిందది. ఆమెను కూర్చోబెట్టి షాట్ విధానం, సీను వివరాలు విపులంగా చెప్పి ఏ యాంగిల్‌లో నిలబడాలి, ముఖంలో రావలసిన భావం వివరాలతో చెప్పుతున్నాడు. మోహిని శ్రద్ధగా వింటూ తల పంకిస్తున్నది అర్థమవుతున్నట్లుగా.

షూటింగు ప్రారంభమయింది. రోజు లాగే ఉరుకు పరుగులతో తీయడం సాధ్యంకాలేదు. మోహినికి కొత్త కావడం వల్ల, గత అనుభవం పెద్దగా లేకపోవడం వల్ల ప్రతి షాట్‌కు ఒకటి, రెండుసార్లు కట్ అవుతూనే ఉంది. సాయంత్రానికి వచ్చీ చెడి యాభై షాట్స్ తీయడం గగనమయింది. మోహినిని ఒంటరిగా పిలిచి "నీవు సరిగా నటించడంలేదు" అంటూ కోప్పడ్డాడు కళింగ.

"ఇకముందు ప్రయత్నించి సక్రమంగా నటిస్తాను" అంది మోహిని.

డబ్బింగ్ కార్యక్రమాలు ఏమీ లేకపోవడంవల్ల ఏడుగంటలకే అందరూ వెళ్ళిపోయారు.

మరో పది రోజులు నిర్విరామంగాతీసి ఇన్‌డోర్ షూటింగు పూర్తి చేశారు. ఔట్‌డోర్‌లో రెండు డ్యూయెట్‌లు చిత్రీకరిస్తే పని పూర్తవుతుంది. అంతటితో ప్రింటుకు విడుదల చేయవచ్చనను కున్నాడు కనకారావు.

ఔట్‌డోర్ షూటింగు తిరుపతి-రేణిగుంట్ల మధ్య తిరుచానూరు ప్రాంతాల లోనే నిర్మించాలనుకున్నారు. ఖర్చు తగ్గుతుంది, దగ్గరగా ఉంటుంది. మరో నాలుగు రోజులు పోరాడి ఔట్‌డోర్ కూడా పూర్తిచేసి ఇళ్ళకు చేరారు.

ఎవరికి రావలసిన డబ్బులు వారికి ఇచ్చి పంపించారు. నెగెటివ్ మొదటికాపీ సిద్ధపరచి సెన్సార్ చేయించడానికి ప్రయత్నాలు ఆరంభించారు. మొదటి కాపీ పూర్తిగా తయారయ్యేసరికి చేతిలో డబ్బు ఖర్చయిపోయి వేలమీద ఉంది. తొందరగా రిలీజ్ చెయ్యాలి. జిల్లాల వారీగా అమ్మకాలు సాగించాలనుకున్నాడు.

• • •

సిద్ధారెడ్డి వెళ్లిన పది రోజులకు అతడి భార్య వచ్చింది. వస్తున్నట్లు ముందే తెల్పడం వల్ల స్టేషన్‌కు కారులో వెళ్ళింది సరిత, రామారావుతో కలిసి. మెయిల్‌లో వచ్చింది ఉదయం ఐదున్నర గంటలకు. అందరూ కలిసి ఇంటికి వచ్చారు.

కూతురు చలాకీతనంలో అప్పటికీ ఇప్పటికీ తేడాలేదనుకుంది. అప్పటిలాగే అన్నిపనులూ తనవేనంటూ చేసుకుంటూ పోతున్నది. కాఫీ కాస్తున్న కూతుర్ని చూస్తూ గడపలో కూర్చున్నది.

"ఆరోగ్యం బాగుందా?" అంది కాఫీ ఇచ్చిన కూతురితో. తల ఊపింది సరిత నవ్వుతూ.

"గ్రామం విశేషాలేమిటే?" అంది కాఫీ తాగుతూ.

తల్లి వివరాలు చెబుతుంటే వింటూ, ఊకొడుతున్నది.

సరోజ ముఖం తుడుచుకుంటూ వచ్చి, కొత్త వ్యక్తిని చూసి ఆగింది.

"రా సరోజా! ఈమే మా అమ్మ. ఈరోజు వస్తుందని చెప్పాగా!" అంది

లేస్తూ

దగ్గరగా వచ్చి నమస్కారం పెట్టింది సరోజ. "మనమ్మాయే. ప్రస్తుతం ఇక్కడే ఉంటున్నది." అంది సరోజను తల్లికి పరిచయం చేస్తూ.

"ఏం చదువుకున్నావమ్మాయ్!" అంది కోటమ్మ సరోజను చూస్తూ.

"బి.ఏ. చదివాను పిన్నీ" అంటూ పక్కలో కూర్చుంది. సరిత కాఫీ ఇచ్చింది. "చదువు చెప్పించడం బుద్ధి తక్కువే నమ్మాయ్! అల్లరి పట్టడానికి మాత్రమే ఈ చదువు తోడయింది" అంది విచారంగా చూస్తూ.

"ఎవరి గ్రహచారం ఎలా ఉంటే అలా జరుగుతుందిలే పిన్నీ. చదువుకున్న వారందరూ అలాగే అవుతున్నారా?"

"కాక? ఎక్కువ మంది ఇలా తయారుకాబట్టే, కన్న తల్లిదండ్రులు ఏడ్చి చావవలసి వస్తున్నది."

సరోజ మాట్లాడలేదు. వంట కార్యక్రమంలో మునిగిన సరితకు సహాయంగా నౌకరు తెచ్చిన కూరగాయలు, కత్తిపీట ముందు వేసుకుకూర్చుంది.

"ఈరోజు శలవు పెట్టేయ్ సరోజా! అమ్మతో కలిసి మ్యాట్నీకి వెళ్దాము" అంది సరిత.

"నీవు చెబితే అడ్డు పెట్టడం మంచిది కాదుగా! తప్పకుండా వెళ్దాం" అంది సరోజ నవ్వుతూ. కూరగాయలు తరిగి వెళ్తున్నానని చెప్పి, వెళ్ళిపోయింది సరోజ.

"ఎందుకింత తెగించి వచ్చావు?" అంది కూతురి ముఖంలోకి చూస్తూ.

"ఏమో? నాకే తెలియదు. ఆరోజు సినిమాల్లోకి వెళ్ళాలనిపించింది, వచ్చాను. తీరాచూస్తే ఇందులో మురికి తప్ప ఏమీలేదు. ఆ మురికిలో నేనూ పడక తప్పలేదు. చివరకు ఒడ్డు చేరడానికి తపనపడి, పడి చేరుతూ ఉన్నాను."

"ఇంకా చేరలేదన్నమాట?"

"చేరతాననే ధైర్యం ఉంది."

"ఎందుకే ఇదంతా? ఇంటికి వెళ్దాం పద! తప్పులు అందరూ చేస్తున్నారు. అందరిలాగే నీవూ! కాకపోతే కొంత కాలం ఏదో అనుకుంటారు. జనం వాళ్ళను పట్టించుకోకుండా తిరుగుతుంటే, వాళ్ళే నోరు మూసుకుంటారు. 'గంతకు తగిన బొంత' ఎక్కడోచోట దొరకకపోదు. ఇలా జీవితం నాశనం చేసుకుంటుంటే, నీకెలా ఉంటుందోగానీ, మాకు గుండె చెరువవుతున్నది. ఉన్నది ఒక్కదానివి. కావలసినంత తినడానికి ఉండి, దిక్కూదివాణం లేకుండా ఇక్కడ పరాయి పంచల్లో పడి ఉండటమేమిటే!" అంది కళ్ళనీరు కారుస్తూ.

"నన్ను గురించి ఇక ఆలోచించకమ్మా! నేను దారి నిర్ణయించుకునే నడుస్తున్నాను. ఈ దారిలో కూడా బోల్తాపడితే, ఎక్కడోచోట కన్ను మూస్తాను హాయిగా. లేదా, ఈ దారిలో గమ్యం చేరుతాను. మీరెంత బాధపడినా నా మనస్సు మార్చుకోను" అంది ముభావంగా.

"మొదటినుండీ ఈ పెంకి మాటలతోనే నాశనమయ్యావు చివరకు!" అంది తిరస్కారంగా. రామారావు లోనికి రావడంతో సంభాషణ ఆపుచేసింది. అతనికి కాఫీ అందిస్తున్న కూతురినీ, అతన్నీ చూస్తూ కూర్చుంది.

"మీరు విశ్రాంతి తీసుకోండి అత్తయ్యా! రాత్రంతా ప్రయాణంలో నిద్ర ఉండదు. కూర్చొని చేసేదేమిటి?"

అన్నాడు కాఫీ తాగుతూ.

'అత్తయ్యా' అంటూ సంబోధిస్తున్న అతనివైపు ఆప్యాయంగా చూసింది సరిత. కలుపుతున్న వరసలను మననం చేసుకుంది.

"మీ అమ్మకు పడక వెయ్యి! కొంచెం సేపు పడుకుంటుంది" అన్నాడు కాఫీ తాగి వెళ్ళిపోతూ.

బయటకు వచ్చేసరికి మేనేజరు సిద్ధంగా ఉన్నాడు.

"కనకారావు కనిపించాడా?" అన్నాడు మేనేజరు దగ్గరగా వచ్చి.

"ఇప్పుడే సెన్సార్ ఆఫీసుకు వెళ్ళారు సార్! పదివేలు లంచం ఇస్తే సెన్సార్ సర్టిఫికెట్ అందించే ఏర్పాటు చేయిస్తానని బ్రోకర్ ఒకరు ముందుకు వచ్చారు. అతని ద్వారా సర్టిఫికెట్ సంపాదించాలని ప్రయత్నాలు చేస్తున్నట్లుంది."

"పదివేలు ఇస్తేగానీ చేయరా ?" అన్నాడు ఆలోచిస్తూ.

"అంతే సార్! అంతా లంచమే! వీళ్ళతినే గడ్డి పూర్తయితేనే సినిమా విడుదలకు అనుమతి, లేకుంటే కష్టం సార్!"

రామారావు కుర్చీలో కూర్చుని, ఫైల్స్ ముందుకు తీసుకున్నాడు.

"డిస్ట్రిబ్యూటర్స్ ముగ్గురు నలుగురు కలిశారు సార్! జిల్లాలవారీగా అమ్మితే తీసుకోగలమని అంటున్నారు.ఆ విషయం కూడా ఆలోచిస్తున్నారు కనకారావుగారు" అన్నాడు మేనేజర్.

"పిలిపిద్దాం. కనకారావు రానీ!"

సరోజ పదిగంటలకు తిరిగివచ్చింది. వంటింట్లో ఇంకా వంటపనుల్లో మునిగి ఉన్న సరితవద్దకు వెళ్ళి "అమ్మ ఎక్కడికి వెళ్ళింది?" అంది.

"పైన పడుకొని నిద్రపోతున్నది. అప్పుడే వచ్చేశావు. శలవు పెట్టి వచ్చినట్లేనా?"

"నా డ్యూటీ ఒకటినుండి ఏడుగంటల వరకు గదా! ఇప్పుడు డ్యూటీలేదు. శలవు పెట్టి వద్దామనే వెళ్ళాను. కారు కూడా వెళుతున్నది సమయానికి. నన్ను లాడ్జివద్ద దింపి వెళ్ళిపోయారు" అంది కూర్చుంటూ.

"ఆఫీసులో ఎవరూ లేరా?"

"సరిగా చూడలేదు. చిన్నాయన ఉన్నట్లుంది" అంది నవ్వుతూ.

కనకారావు పన్నెండు గంటలకు వచ్చాడు.

"కనీసం ఇరవై వేలకు తక్కువ అయితే సెన్సారు వాళ్ళు ఒప్పుకునే సూచనలు లేవు. పాతిక అంటున్నారు. పదిహేను అన్నాను నేను.ఆ ఐదు కలిపితే దిగి వస్తారేమో!" అన్నాడు.

"మన దగ్గర ఆ మొత్తం కూడా లేదురా! డబ్బు తక్కువగా ఉంది. ఆర్టిస్టులకు నిలిపి వేసినా బాగుండేది. ఎవడో ఒకడు డిస్ట్రిబ్యూటర్ దొరికిన తర్వాత వారికి ఇచ్చి ఉంటే బాగుండేది. ఇప్పుడు డబ్బులు సర్దుబాటు చేసుకోవాలంటే కష్టం! డబ్బు కావాలంటే ఇంటికి పరుగెత్తాలి. వాళ్ళు తిట్లూ, దీవెనలూ వెదజల్లి మరో పదిహేను రోజులకో, ఇరవై రోజులకో ఇస్తారు. ఆలస్యమవుతుంది" అన్నాడు రామారావు.

"ప్రస్తుతం ఎంత ఉంది?"

"పన్నెండు వేలుంది!"

"సరే! కారు అమ్మకం పెడదాం. పదిహేను వేలకు కొన్నాం. మన అవసరం కాబట్టి పదివేలయినా వెంటనే చేతిలో పడతాయి."

"ఆ విధంగా అయినా కష్టమే. ఇరవై వేలు వాళ్ళకే ఇస్తే, చేతిలో రెండు

వేలతో రెండు రోజులు కూడా నిల బడలేం."

"సరే! నేను ఇంటికి వెళ్ళి వస్తాను, తర్వాత చూద్దాం. ఇంతవరకూ తెచ్చి, ఇప్పుడు వెనుకకు తగ్గితే ఏమవుతాం? ఈ సెన్సార్ వెధవలు - డబ్బు పారేస్తే సెక్స్ సీన్స్ కూడా అనుమతిస్తారు. డబ్బు ఇవ్వకుంటే క్లాస్ పిక్చర్ కూడా కట్ చేస్తారు" అన్నాడు ఆవేశంగా కనకారావు.

రామారావు జవాబివ్వలేదు. ఇంటికి వెళ్ళి తెచ్చేటప్పటికి మరో ఇరవై రోజులు ఆలస్యం! త్వరగా డిస్ట్రిబ్యూటర్స్‌కు అప్పగిస్తే తొందరలో రిలీజ్ చేసి, పెట్టిన పెట్టుబడి దక్కిందుకుంటే మంచిదని ఆలోచిస్తున్నాడు.

సినిమా రంగంలో ఒంటెత్తుపోకడ పనికిరాదని బాగా అర్థమవుతున్నది. కాళ్ళు పట్టుకునేవాడికీ, ముండల్ని తార్చేవాడికీ, పెళ్లాల శరీరాల్ని అమ్మకం పెట్టేవాడికీ, కూతుళ్లనూ, చెల్లెళ్ళనూ తార్పుడు చేసే వారికీ ఇస్తున్న అవకాశం నిజాయితీగా ప్రవర్తించేవాడికి ఇవ్వడం లేదు. ఈ సినీ ఫీల్డులో నుండి గట్టున పడితే హాయిగా ఈ రెండు లక్షలతో ఏ వ్యాపారం పెట్టు కున్నా బతుకవచ్చు. ఈ దరిద్రపు సంస్థలో మళ్ళీ ఇరుక్కోకూడదను కున్నాడు. ఈ ఒక్కసారి గట్టునపడితే చాలని ఆలోచిస్తున్నాడు.

సరిత, కోటమ్మ, సరోజ ఒంటిగంట షోకు వెళ్లారు భోజనం చేసి. కారు అమ్మకం గురించి మాట్లాడడానికి కనకా రావు వెళ్ళాడు. రామారావు ఆలోచిసూ కూర్చున్నాడు. మరో యాభైవేల రూపా యలు చేతిలో ఉంటే గట్టున పడవచ్చు. ఇంత తక్కువ పెట్టుబడితో సినిమా కలర్‌లో తీయడమే. అందరికీ విచిత్రంగా అనిపించింది. అయినా తీశారు. అందరూ కొత్తవారు, జూనియర్స్. టెక్నీషియన్స్ అందరూ అసిస్టెంటులుగా పని చేస్తున్న వారు. కొత్తగా బాధ్యతలు తీసుకున్నారు. మొత్తం అందరికీ కలిపి ఇచ్చిన డబ్బు చూస్తే బడా హీరోకు ఒకడికి ఇచ్చినంత లేదు. అయినా ఆ మొత్తంతోనే బడా హీరో నటించిన సినిమాకంటే బాగా తీయ బడింది. ఔట్‌డోర్ సీనరీస్ అద్భుతంగా వచ్చాయి. ఇన్‌డోర్ కూడా బాగానే వచ్చింది. ఇంతా చేస్తే డిస్ట్రిబ్యూటరుగాడు హీరోయిన్‌ను తార్చమని అడుగు తున్నాడు. గడ్డితిని పెద్దలు సంపాదించిన డబ్బు తెచ్చి ఖర్చుపెట్టి సినిమా తీస్తే అంతా అయిన తరువాత పెట్టుబడి పెట్టే వెధవ హీరోయిన్‌ను తార్చమనే స్థాయికి వచ్చాడంటే నిర్మాతకు విలువేమిటి? డబ్బు పెట్టేవాడు తెలివితక్కువ దద్దమ్మ అయి ఉంటాడనుకుంటున్నారు ఈ సినీ వ్యక్తులు.

ఈ విధంగా ఈ లుచ్చాలమధ్య పడి, డబ్బు ఖర్చుపెట్టి బతిమలాడుతూ రిలీజ్ చేయించుకోవలసిన దురవస్థకంటే హాయిగా పల్లెలో కాలక్షేపం చేద్దామను కున్నాడు మరోసారి. ఆ స్థిర నిశ్చ యానికి వచ్చి గట్టిగా ఊపిరి పీల్చాడు. ఇంటికి వెళ్ళినా డబ్బులు ఇవ్వడానికి వారు కూడా మండిపడతారు. డబ్బింగ్ రూం ఊడపెరికి అమ్మితే ఐదు వేల యినా వస్తుంది. ఆఫీసు సామాను అమ్మితే మరో మూడువేలు వస్తుంది. సెన్సార్ చేయించి ఎవడో ఒకన్ని పట్టి, డిస్ట్రి బ్యూషన్ ఏర్పాటుచేసి గ్రామం వెళ్ళ డానికి ఛార్జీలకు ఉంటే సరిపోతుంది.




ఇంటిదగ్గర విసుక్కున్నా, కసురుకున్నా కూడు పెడతారు. ఇక్కడ ఉంటే అది కూడా దొరకదు అనుకున్నాడు.

తాను ఎలాగూ పోక తప్పదు. మరి సరితను ఏం చేయాలి? తానేదో పొడిచేస్తా డని సరిత తండ్రి వెంట పోకుండా నిల బడింది. ఆమె సరయిన వ్యక్తి అయితే పెళ్ళి చేసుకోవచ్చు. మరి సినీ వ్యామో హంలో పడి ఒళ్ళు నాశనం చేసుకుంది. చెడిపోయిన వ్యక్తిని తాను పెళ్ళిచేసుకుని ఆదరించగలడా? అది సాధ్యమా? నలు గురిలో అవమానకరంగా ఉండదా? ఎవరు ఏమనుకుంటే మనకేమన్న ధీమాతో తాను చేసుకోగలడా? చేసుకోలేకపోతే సరితను ఏం చేయాలి? ఉంపుడుగత్తెగా కాళ్ళ కింద పెట్టుకోవడమా? ఆ అమ్మాయి బతుకు నిరర్థకం అవుతుంది అలాగయితే! మరి ఏం చేయాలి?

అమాయకంగా తిరుగుతున్న సరితను విడిచి పెట్టడానికి మనసు ఒప్పుకోవడం లేదు. ఉంచుకొనుటకు అవకాశమూ లేదు.

ఆలోచనలోపడి కనకారావు రావడం గమనించలేదు.

"ఏమిట్రా? దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?" అన్నాడు కనకారావు కూర్చుంటూ.

అతన్ని చూసి సర్దుకుని కూర్చుని "పొద్దుపోవడానికి ఆలోచిస్తున్నాను. ఏమయింది?" అన్నాడు.

"పదివేలకు అమ్మేశాను. ఖాదర్‌కు మూడు వందలు ఇవ్వవలసి ఉంది. పోనీ గదాని మరో రెండు వందలు కలిపి ఇచ్చి పంపాను" అన్నాడు డబ్బుతీసి బల్లమీద పెడుతూ.

'తామూరడానికి సందులేదుగానీ, మెడకో డోలు' అన్నట్లుంది ఇతగాడి పని అనుకున్నాడు. ఇవ్వడం మంచిదేనని తిరిగి సమర్థించుకున్నాడు.

'బజారుకు వెళ్తే రెండువందలరూపాయలు రెండురూపాయల్లాగా ఖర్చవుతున్నాయి. వాటి వల్ల ఒక పేదవాడు బాగుపడనీ' అనుకున్నాడు.

"డబ్బింగ్ రూం అమ్మేద్దాం. ఆ సామానుకు మరో ఏడువేలయినా వస్తాయి."

"సరే! అదిఉండి ఇప్పుడు చేసేదేమిటి! అదో అడ్డమేగానీ!" అన్నాడుకనకారావు.

"మేనేజరును కూడా మాన్పించేద్దాం. అనవసరంగా ఖర్చులెందుకు? ఏదయినా రాతకోతలుంటే సరోజ చేస్తుంది గదా!"

రామారావు తల ఊపాడు. బరువు క్రమక్రమంగా తగ్గించుకోవడమే మంచిది. ఏ నిమిషంలోనయినా జెండా పీకి పోక తప్పదు. ఇవన్నీ ఎక్కడ వీపుకు కట్టు కొని తిరగాలి?

"వీలుంటే ఆఫీసు సామాను కూడా అమ్మేద్దాం. మళ్ళీ సినిమా తీయదలచి నప్పుడు ఆలోచిద్దాం" అన్నాడు కనకా రావు.

దానికికూడా తలూపాడు రామారావు.

"నేను సెన్సార్‌బోర్డ్ వాళ్ళ లంచం ఇచ్చి వెళ్తాను. రెండు రోజులు వాళ్ళ ఆఫీసు చుట్టూ తిరిగి సర్టిఫికెట్ సంపా దిస్తావా? వీలుంటే ఈలోగా డిస్ట్రిబ్యూ టర్స్‌ను సంప్రదించు. లేదా నేను వచ్చిన తరువాత ఆలోచిద్దాం. పది, పదిహేను రోజుల్లో వస్తాను. ఈ డిస్ట్రిబ్యూటర్ వెధ వలు ఒక్కడూ ముందుకు రావడంలేదు. సుబ్బయ్యగాడు వీరిందరికీ చెప్పి ఉంటాడు" అన్నాడు విసుగ్గా.

"సరే! అలాగే చేద్దాం. వెళ్ళేలోగా ఈ డబ్బింగ్ రూం సామాను, ఆఫీసు సామాను అమ్మివేసి, మేనేజరుకు ఇవ్వవల

సింది ఇచ్చి పంపి వెళ్ళు. ఎప్పుడయినా వద్దువుగానీ!" అన్నాడు రామారావు.

రాత్రి భోజనాలయిన తర్వాత సరిత పడకగదిలోకి వస్తూ అడిగింది – "కారు అమ్మేశారట కదా?"

తలూపాడు రామారావు. "అన్నీ అమ్మేయమన్నాను. డబ్బుతక్కువయింది. సినిమా ఫీల్డ్‌లో నిజాయతీగా ప్రవర్తిస్తే ఇదేగతి మరి! ఏంచేస్తాం. చివరన ఉన్నది అమ్మివేసి, ముఖం మీద బట్టవేసుకుని ఇంటికి చేరడమే! అన్నాడు నవ్వుతూ.

"ఒక పని చేయండి"

ఏమిటన్నట్లు ఆమె వైపు చూశాడు.

"నావి బంగారు నగలు ఇక్కడే ఉన్నాయి. అవి అమ్మితే పదివేలయినా వస్తాయి. అవి అమ్మేసి డబ్బు వాడుకోండి" అంది అతన్ని చూస్తూ.

"నీ డబ్బా! ఇప్పుడు చెడిపోయింది మేము. నిన్ను ఈ గుంటలో ఎందుకు ముంచాలి? వద్దులే. మేం నాశనమయినా ఫర్లేదు. నిన్ను ముంచి ఆ పాపమంతా భరించాలి"



"అదేంమాట! అవి నావికావు. మీవే అనుకోండి. నేను మీ దగ్గరున్నప్పుడు ఆ వస్తువులూ మీవేగా!"

రామారావు జవాబివ్వలేదు ఆలోచిస్తూ.

"నా కొరకు ఇంత ప్రయత్నం చేశారు. నేను మీకు ఏమీ సహాయం చేయకూడదా?"

"కూడదనికాదు. అవి తిరిగిరావని నా భయం" అన్నాడు ఆమె చెంప నిమురుతూ.

"పోనివ్వండి. నాకు కావలసింది నగలు కాదు, మీరు. అవీ చాలవంటే చెప్పండి.వారం రోజుల్లో అమ్మ వెళ్తుంది. అమ్మ వెంట వెళ్ళి నాన్నదగ్గర తెచ్చు కోవచ్చు. మీరు వెళితే తప్పకుండా ఇస్తాడు" అంది. ఆలోచిస్తూ పడుకు న్నాడు ఆమె కళ్ళలోనికి చూస్తూ.

"ఆలోచించకండి. మీరు చెడిపోతే నేనూ పోయినట్లే! నా కొరకు మా నాన్న మరో యాభైవేలు ఖర్చుపెట్టకపోడు. నేను ఇంటికి వెళ్ళగలిగితే అంతా నాదే కదా! మిమ్మల్ని ఆయన చూశాడు. నేను చెప్పాను కూడా! కాబట్టి తప్పకుండా సహకారం అందిస్తాడు. నా మాట విని మీరు వెళ్ళాలి" అంది దీర్ఘంగా కళ్ళ ల్లోనికి చూస్తూ.

"ఆలోచిద్దాం" అన్నాడు రామారావు.

"ఆలోచించేదేమీ వద్దు. ఏదో విధంగా ఈ ఊబినుండి బయటపడే ఏర్పాటు చేయండి. మళ్ళీ ఇటువంటివాటికి రాకుండా జాగ్రత్తపడితే సరిపోతుంది. లేకుంటే పుష్కలంగా డబ్బు చేతిలో పెట్టుకుని దిగితే సరిపోతుంది" అంది.

జవాబివ్వలేదు రామారావు. సరితను గుండెలకు హత్తుకున్నాడు ప్రేమతో.

చివరకు తనచేత చెరవిడిపించబడిన వ్యక్తి తనకు సహాయం చేస్తానంటోంది స్థాయి చూసినా సరితకంటే తాము గొప్ప వాళ్ళంకాము. మంచి ఆస్తిపరురాలు. ఒకేఒక్క కూతురు. ఇక్కడికి వచ్చి నీచుల్లో పడి ఉండవలసి వచ్చింది. ఈ సినీ ఫీల్డ్‌లోకి వచ్చేవారిలో తొంభైపాళ్లు హీనంగా బతకడానికి సిద్ధపడ్డవారే. మిగి లిన పది పాళ్ళూ ఉన్నత స్థాయినుండి వచ్చి హీనంగా పడిపోయి, వచ్చే ఇతరులనూ తమలాగే హీనస్థాయికి నెట్టివేసి, అందరం ఒకటేనన్న భావం ఏర్పరుస్తారు. తాను హీనంగా బతుకుతుంటే, మరొకడు ఉన్నతంగా బతకడం ఓర్వలేని వాళ్ళతో నిండి ఉన్న సంస్థ ఇది. అందరిలాగే సరిత వచ్చిపడింది. ఆ సమయానికి తాము వచ్చి ఆదుకున్నారు. తిరిగి నిలిచి బయటకు పోవడానికి మార్గాలు సిద్ధపరచు కుంటున్నది. సరిత తోడు తన జీవి తానికి సుఖం కూరుస్తుందేమో? అమాయ కంగా బతికే సరితను ఈ కుళ్లు నుండి తీసుకెళితే తాను సుఖపడి తన చుట్టూ ఉన్నవారినీ సుఖపెడుతుందనుకున్నాడు.

● ● ●

ఉదయం లేచిన వెంటనే కనకారావుని పిలిచి చెప్పాడు సరిత మాటలు. కనకా రావు విని ఆశ్చర్యపోయాడు. "ఆ అమ్మాయి ఇస్తానంటే మనం తీసుకో వడం మంచిదికాదేమో? మన అవసరానికి వాడుకుని ఆ అమ్మాయికి తిరిగి ఇవ్వలేక పోతే, తిరిగి ఆమె తండ్రి రావడం గందర గోళం, ఎందుకాబాధ?" అన్నాడు- కన్నమ్మ మీద జరిగిన దాడి గురించి ఆలోచిస్తూ.

"అదేం వుండదు. వాళ్ళ నాన్నతో కూడా కావాలంటే ఇప్పిస్తానంటున్నది.

వాళ్ళ అమ్మ వెంటవెళ్ళి, వాళ్ల నాన్న దగ్గర తెచ్చుకోమంటున్నది" అన్నాడు రామారావు. కనకారావు పలుకలేదు.

"మనమున్న పరిస్థితుల్లో ఇంటికి వెళ్ళి డబ్బు అడిగి దీవెనలు పొందడం ఎందుకు? మనకు మనమై వెళ్ళి బతిమి లాడడం లేదుకదా! తనంతకుతానే ఇస్తా నంటున్నది."

"తనంతకుతనే అమాయకంగా సినిమా వ్యామోహంతో వలలో పడిన విషయం మరచిపోకు. సినిమా వ్యామోహం ఆ అమ్మాయికి పోయింది; కానీ నీ మీద వ్యామోహం పెంచుకుంది. అందుకొరకే ఖర్చు పెడతానంటున్నది. వ్యామోహంలో నున్న వ్యక్తిని మన అవసరాలకు వాడు కుంటే, ఎవరినయితే నీతిలేని వెధవలని దూషిస్తున్నామో,ఆ సినీరంగం పెద్దలలో మనం ఒకరం అవుతాం."

కనకారావు భుజం తట్టాడు రామా రావు. "బాధపడకురా!సరిత వ్యామోహం మీద ఉందా, ప్రేమిస్తోందా అన్న విషయం నేను ఆలోచించడం లేదు. ఆ అమ్మాయిని నేను పెళ్ళి చేసుకుందామని నిర్ణయించుకున్నాను. అందువల్ల ఆ అమ్మాయి డబ్బు వాడుకోవడంలో తప్పు లేదని నా ఉద్దేశం."

కనకారావు తలెత్తి ఆశ్చర్యంగా చూశాడు.

"ఆ అమ్మాయి చరిత్ర కళ్ళతో చూశావు. మరి ఈ నిర్ణయానికి ఎందుకు వస్తున్నావు?"

"ఏం చూశాము? మనం కళ్ళతో చూసింది చెడిపోయిన సరితను. కాని బాగుపడడానికి తహతహలాడే సరిత మన కళ్లకు కన్పించడం లేదు. నా మనస్సుకు కన్పించింది. అందుకే ఆ కూపం నుండి లాగాను. చెడే వ్యక్తే అయితే ఈ మూడు నాలుగు నెలలుగా ఎందుకు చెడలేదు? కొన్ని బలహీన గుణాల వల్ల ఇలా వచ్చి పడిపోయింది మురికిలో! పడ్డ తర్వాత ఆలోచించింది ఇదంతా మురికేననీ,దీనిలో నుండి దాటి బయటపడ, తర్వాత మళ్ళీ పడకూడదనీ! ఆ విధంగానే ఇంతవరకూ ప్రవర్తించింది. ఇక ముందు కూడా ప్రవర్తిస్తుందని నా విశ్వాసం!" అందుకే పెళ్లిచేసుకోవాలనుకున్నాను. చెడింది సరితే కాదురా! ఈ లోకంలో ఏ ఆడదీ శారీరకంగానో, శారీరకంగా అవ కాశంలేకపోతే మానసికంగానో చెడిపోయే ఉంది. చెడలేదని ఎవడయినా అంటే నేను చూపించమని సవాల్‌చేయను. సంతోషి స్తాను. చెడినా తిరిగి కాళ్లలాక్కున్న సరిత మిగిలిన వారికంటే ఎందులోనూతీసిపోదని నేననుకుంటున్నాను. అందువల్లనే నేనీ నిర్ణయానికి వచ్చాను. అయినా మన సంగ తేమిటి? మనం ఎన్ని చేయలేదు గనుక"

కనకారావు మాట్లాడలేదు. తలవంచి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

జేబులోనుండి నగలుతీసి టేబుల్‌మీద పరచాడు. "వీటిని అమ్మి డబ్బుతీసుకరా! ఎవరివస్తువులో అమ్ముతున్నామన్న న్యూనత అవసరం లేదు. ఇవి నా భార్య నగలు. నేను అమ్ముకునే హక్కుంది" అన్నాడు రామారావు.

కనకారావు నోరెత్తలేదు. అతని నిర్ణ యాన్ని వ్యతిరేకించాలనీ అనుకోడంలేదు. సరిత అందమైన పిల్ల. మద్రాసు వాసనలు తగిలి కూడా షోగ్గా అలకరించుకోవాలని ఇప్పటికి ప్రవర్తించడంలేదు.ఈ మద్రాసు నగరంలో వంటచేసుకుంటూ కాలంగడుపు తున్నది. సంసారానికి అన్నివిధాల సరిపడే అమ్మాయి. రామారావు బాగుపడుతాడనే

నిర్ణయించుకున్నాడు. ఒకసారి దెబ్బతిన్న అమ్మాయి కాబట్టి, భవిష్యత్తులో జాగ్రత్తగా ప్రవర్తిస్తుంది అనుకున్నాడు.

నగలు తీసి జేబులో వేసుకున్నాడు.

"సెన్సార్ ఆఫీసు విషయాలు నీవే చూసుకో! ఇప్పుడు డబ్బు కూడా సరిపోతుందిగా! డిస్ట్రిబ్యూటర్స్‌ను ప్రయత్నిస్తాను. ఒకరిద్దరు కలిసి ఇంతకు ముందు మాట్లాడారు. వారితో తిరిగిమాట్లాడతాను. ఈ డబ్బుతోనయినా ఊరుచేరితే, తర్వాత విషయాలు ఆలోచించవచ్చు" అన్నాడు.

కనకారావు స్నానంచేసి, ఫలహారం చేసి బజారుకు వెళ్ళాడు. సరోజ ఆఫీసు ఫైల్స్‌ముందువేసుకుని చూసుకుంటున్నది. రామారావు ఆఫీసులో కూర్చుని వాల్ పోస్టర్స్ డిజైన్స్ సరిచూస్తున్నాడు. సరిత వంటపనిలో మునిగిఉంది. సరితకు ఎదురుగా కోటమ్మ కూర్చుని మాట్లాడుతూ, వంటపనిలో సహాయపడుతున్నది.

• • •

జగదీష్ డిస్ట్రిబ్యూటర్స్ కాంట్రాక్ట్ బేసిస్ మీద తీసుకొనడానికి సిద్ధపడ్డారు. రాయలసీమ నాలుగు జిల్లాలు, దక్షిణ కోస్తాంధ్ర నాలుగు జిల్లాలు, మద్రాసు వరకూ వారు తీసుకుంటామన్నారు. ఐదు సంవత్సరాలు కాంట్రాక్ట్ కాలపరిమితి. ఎగ్జిబిటర్స్ కమీషన్‌లు, టాక్సులుపోను మిగిలిన మొత్తం మీద పదిహేను పర్సెంటేజీతో వారు ఒప్పందం ఖరారు చేసుకున్నారు. రాయలసీమకు ఆరుకాపీలు,కోస్తాంధ్రకు తొమ్మిది కాపీలు, మద్రాసు ఏరియాకు ఒక కాపీ, మొత్తం పదహారు కాపీలు వారి డబ్బుతో ప్రింటింగ్ చేయించుకోవడం; ఇప్పటి నుండీ అయ్యే అడ్వర్‌టైజ్ మెంట్,వాల్‌పోస్టర్స్, కరపత్రాల ఛార్జీలు భరించుకుంటారు. ఇక ముందు పైసాకూడా నిర్మాతకు ఖర్చుండదు. కాపీకి పదివేలరూపాయల చొప్పున ముందుగానే అడ్వాన్సుఇస్తారు.ఆ తర్వాత డిస్ట్రిబ్యూటర్ ఖర్చులు తీరిన తర్వాత, ఏ నెల డబ్బు ఆ నెల ఐదు సంవత్సరాల వరకూ ఇస్తూనే ఉంటారు. ఆ తర్వాత ఇష్టమయితే కాలం పొడిగించు కోవచ్చు. లేదా మరో డిస్ట్రిబ్యూటర్‌కు అమ్ముకునే హక్కు నిర్మాతకు ఉంటుంది.

ఉత్తర కోస్తాంధ్రలోని ఐదు జిల్లాలకు, ఒరిస్సాకు మరో డిస్ట్రిబ్యూటర్; నైజాం, బెంగుళూరు ఏరియాలకు మరో డిస్ట్రిబ్యూటర్‌తో ఒప్పందం ఖరారయింది. ఒక్కో కాపీకి పదివేల రూపాయల చొప్పున మొత్తం ముప్పై ఎనిమిది కాపీలు...మూడులక్షలా ఎనభైవేల రూపాయలు ముందుగానే ఇవ్వబడింది. పెట్టిన పెట్టుబడికి మరో లక్షా ఇరవైవేల లోటు ఏర్పడింది. వస్తుందనే ధైర్యమూ ఉంది ముప్పై ఎనిమిది సెంటర్లు పదిరోజులు దెబ్బతినకుండా ఆడితే అన్ని ఖర్చులూ పూడ్చుకోవచ్చని ఆశించారు. ఆ తర్వాత వచ్చే డబ్బు మిగిలింపుగానే వస్తుంది. ఎంత చెత్త సినిమా అయినా పదిరోజులు ఆడుతుందనే ధైర్యం ఉంది.

ఊరికి వెళ్ళాడు కనకారావు. సరోజ లాడ్జికి వెళ్ళింది. ఇంట్లో కోటమ్మ పడుకుని నిద్రపోతున్నది. అన్నం తింటూ చెప్పాడు రామారావు.

"మరో పది రోజుల్లో మా ఊరు వెళుతున్నాం" అన్నాడు.

సంతోషంగా చూసింది అతడివైపు "ఇక్కడ ఉండేది లేదా?"

"ఇక అవసరంలేదుకదా! కనకారావు వచ్చిన తర్వాత నీ నగలు తిరిగితెస్తాడు. నీవు ఏ ఊరికి వెళ్లాలనుకుంటున్నావు?"

అన్నాడు ఆమె ముఖంలోకి చూస్తూ.

"అర్థం కాలేదా?" అన్నాడు నవ్వుతూ. "ఇంతవరకూ అందరం ఇక్కడ కలిసి ఉన్నాము. పనులు అయిపోయాయికదా! ఎవరితోవ వాళ్లు చూసుకోవాలి ఇక! ఇంతవరకూ ఇక్కడ ఉన్నందుకు నీకు కూడా కొంత ఇప్పిస్తానులే డబ్బు రూపంగా. తర్వాత మీ నాన్న దగ్గరకు వెళ్తున్నావా?"

జలజల కళ్లనుండి నీళ్ళు కార్చింది. జవాబివ్వలేదు.

భోజనం పూర్తిచేసి, లేచి చెయ్యి తుడుచుకుంటూ ఆమెవద్ద నిలబడ్డాడు. "ఛే! విడిపోయేటప్పుడు ఏడవకూడదు. సంతోషంగా విడిపోవాలి" అన్నాడు

"ఎందుకు సరితా ఏడుస్తున్నావ్? నీ మనస్సులో మాట చెప్పడానికి బదులు ఏడిస్తే ఎవరు పలుకరిస్తారు? చెప్పవిందాం" అన్నాడు ముఖం తనవైపు తిప్పుకుంటూ.

"నీ మనస్సులో మాట చెప్పవూ! నా దగ్గిరే ఉంటావా?"

తల ఊపింది నిదానంగా ఆలోచిస్తూ.

"నీవుండటానికి అభ్యంతరం లేదు, కానీ పెళ్లి చేసుకోవడం సాధ్యంకాదు" అన్నాడు కళ్లల్లోనికి గుచ్చి చూస్తూ.

"పోనీ! రేపు నేను ఎవర్నో ఒకరిని పెళ్లి చేసుకోక తప్పదుకదా! అప్పుడు నీ గతి ఏమిటి? నిన్ను ఉంచుదామన్నా వచ్చే వ్యక్తి ఒప్పుకోదుకదా!"

"అది మీ బాధ్యత! మిమ్మల్ని నమ్ముకున్న ఆడదాన్ని ముంచేస్తానంటే నేను ఏం చేయగలను? ఏడవడం తప్ప నేనేమీ చేయలేను. మిమ్మల్ని నమ్ముకున్నాను. మీ నీడన ఉందామనుకున్నాను" అంది వెక్కుతూ.

"ఆలోచిద్దాం" అన్నాడు లేచి వెళ్తూ వెళ్తున్న అతన్ని చూస్తూ లేవకుండా పడుకుంది.

రాత్రి ఏడు గంటలకు సరోజ ఇంటి కొచ్చింది. ఎటో శూన్యంలో చూస్తూ, ఉబ్బిపోయిన ముఖంతో, ఎర్రపడిన కళ్లతో ఉన్న సరితను చూసి "ఏం అట్లా వున్నావు?" అంది సరోజ.

సరిత నవ్వడానికి ప్రయత్నం చెసి "బాగానే ఉన్నాను, నాకేం!" అంది బొంగురుపోయిన గొంతుతో.

"ఏం కాలేదేమిటి? నీ గొంతు, రూపం అన్నీ మార్పు వచ్చాయి. నన్ను నమ్మిస్తున్నావేమిటి ఏటోదాచి? నిజంచెప్పవూ!" అంది తల నిమిరి. ఏడుస్తూ రామారావు తనతో మాట్లాడిన మాటలు చెప్పింది సరిత.

అంతావిని సరోజ గలగల నవ్వి ఆమె గడ్డం పట్టి పైకెత్తి "పిచ్చిదానా! నిన్ను ఏడ్పించడానికి అలా అని ఉంటాడు. నిన్ను పెళ్ళి చేసుకోవాలని నిర్ణయం కూడా అయింది. రేపో మాపో పెళ్ళి అనే స్థితిలో ఉంటే, పెళ్ళికూతురివి ఇలా ఏడవవచ్చా?" అంది నవ్వుతూ.

సరిత ఆశ్చర్యంగా చూసింది. "పెళ్లా? నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడా? నిజమా?" అంది నమ్మలేక.

"ఏం? నేను చెప్పేదంతా నిజమే! నీ గత చరిత్ర విడిచి, నీవు ఈ మూడు నెలల నుండి ఏ విధంగా తిరిగావో చూసిన తర్వాతనే నిర్ణయించుకున్నాడట. కనకారావు చెప్పాడు. నిన్ను తప్పకుండా పెళ్ళి చేసుకుంటాడు" అంది హామీ ఇస్తూ.

"ఇదే నిజమయితే నీ నోటిలో చక్కెర

పోస్తాను సరోజా!" అంది ఆనందంగా చూస్తూ.

"వద్దులే! అసలే ధర మండిపోతోంది. పైగా షుగర్ వ్యాధి రావచ్చు. నీవు సుఖంగా ఉండు చాలు" అంది.

"నీ విషయమేమయింది?" అంది సరోజ కళ్ళల్లోకి చూస్తూ.

"అయ్యేదేమిటి? నేనూ నీతోపాటే వస్తాను. చీరాలలో కాన్వెంటు ఏర్పాటు చేయడానికి వెళ్ళాడుగా! వచ్చిన తర్వాత ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తాను. మీ బావగారు కూడా చీరాలలో ఏదైనా వ్యాపారం పెడతాడట. ఇద్దరం అక్కడే ఉంటాం. కానీ, నీకూ నాకూ తేడా ఏమిటంటే నిన్ను రామారావు పెళ్ళి చేసుకుంటున్నాడు. నాకా అదృష్టం లేదు. ఆయన మరొకరిని పెళ్ళి చేసుకుంటానని ముందుగానే చెప్పాడు. అందుకు ఇష్టపడే ఆయన వెంట ఉండటానికి నిర్ణయించుకున్నాను. ఇప్పటికే ఎన్నో బాధలు పడ్డాను. 'నా' అనేవారు కూడా లేకుండా కరువయ్యారు. ఎండలో నడిచే బాటసారికి చల్లటి చెట్టునీడ కావాలి. అలాగే నాకు కూడా ఈ బాధల నుండి విముక్తి అయి మంచి నీడన తలదాచుకోవాలనుకున్నాను. పెళ్ళి చేసుకోకున్నా ఆయన మనస్సు నాకు బాగా తెలుసు. నేను సుఖపడగలననే ధైర్యం ఉంది. పైగా ముందు ముందు ఎలా ఉంటుందో పరిస్థితి. నా పేరుతో పదివేలు ఫిక్సెడ్ డిపాజిట్ వేస్తున్నాడు. కాన్వెంట్ ఎలాగూ నడుపుతాను. తిండికి బాధ ఉండదు. ఆశ్రయానికి కొదువ ఉండదు. అందుకే ఆయన వెంట వెళ్ళడానికి నిర్ణయించుకున్నాను.నీ మొగుడు కూడా చీరాలలోనే కాపురం పెడతాడటగా!ఇద్దరం కలుస్తూనే ఉంటాము" అంది సరిత బుగ్గలు నిముర్తూ.

"సరోజా!తెలివితక్కువగా అన్నీ చెప్పేశావు. ఈవిడగారు ఈ రాత్రి అంతా ఏడుస్తూ ఉంటే ముఖం శనగ పప్పులా ఊరిఉండేది'' అన్నాడు రామారావు అప్పుడే లోనికి వస్తూ.

సరిత సిగ్గుతో ముడుచుకుపోయింది.

"సరిత అమాయకపు పిల్ల!మీరు బాధ పెట్టకండి. సరిత చేతిలో మీ జీవితం హాయిగా గడిచిపోతుంది'' అంది బయటకు వెళ్తూ.

"నిజంగా నీ చేతిలో నా జీవితం హాయిగా గడుస్తుందా? నా చేతిలో నీ జీవితం హాయిగా గడుస్తుందా సరితా?'' అన్నాడు దగ్గరకు తీసుకుంటూ.

"నేను లేకున్నా మీరు బాగుపడతారు. మీరులేకుంటే నేను బాగుపడేదాన్ని కాదు. కాబట్టి మీచేతిలోనే నేను సుఖపడతాను'' అంది అతని బాహువుల్లో ముడుచుకుంటూ.

"ఈ మాట మా అమ్మ వింటే ఎంత పొంగిపోతుందో!'' అంది అతని ముఖంలోకి చూస్తూ.

"మీ అమ్మకే కాదు అందరికీ తెలియక తప్పదుగదా!''

"సరోజ అంటున్నది మనం కూడా చీరాలలోనే ఉంటామని. నిజమా?''

"సరోజ చెప్పింది అంతా విన్నానులే. అన్నీ నిజమే! ఇన్ని రోజులూ కలిసి ఉండి స్నేహితురాల్ని విడిచి పెడతావా?''

తలవంచుకుంది సరిత ఆలోచిస్తూ!

'ఈ జన్మకు ఈ సుఖం చాలు' అనుకుంది తృప్తిగా అతని రొమ్ముపై తల మోపుతూ.



# పొదుపు

విశాల తన పెళ్ళంటూ పెళ్ళి కార్డు తెచ్చి చ్చింది కమలకు. తెలియని ఊర్లో మొట్ట మొదట ఆత్మీయంగా పలకరించిన మనిషి విశాల. ఆమెను తను తరచుగా కల్సుకోక పోయినా, కల్సినప్పుడు సరదాగా కబుర్లు చెప్పుకుంటారు టైము మర్చిపోయి. అటువంటి విశాల పెళ్ళికి ఏమి ప్రజెంటే షన్ ఇవ్వాలా అని కమల ఆలోచిస్తోంది. భర్త నవీన్‌ని అడిగింది. ఏదో ఒకటి ఇద్దూ అంటూ విసుక్కున్నాడు. ఇంట్లోకి వెళ్ళి తన పెళ్ళికి వచ్చిన ప్రజెంటేషన్ల పెట్టె తెరిచింది.

"ఏమండోయ్, ఇలా రండి" అని పిలిచి, "వీటిలో ఏమివ్వమంటారు? ఇవేమి ఇంతవరకు నేను బయటకు తియ్యలేదు. ఎలా ఇచ్చినవి అలానే ఉన్నాయి" అంటూ అన్నీ పరిచింది.

నవీన్ దృష్టి టాయ్‌లెట్ బాక్సు మీద పడింది. అది చూసి, "ఇది నా ఫ్రెండు విమ్మి పంపించింది పోస్టులో పెళ్ళి రోజున. తను రాలేదు. పనికి వచ్చేదే పంపించింది అనుకున్నాను. కాని, ఆరోజే మీరు 'లక్మే' టాయ్‌లెట్ బాక్సు నాకు ప్రెజెంట్ చేసారు. విమల పంపించింది అని చెప్దామనుకొని, మీరే మనుకుంటారో, నిరుత్సాహ పడిపోతారేమోనని విమ్మిది అలాగే ఉంచేసి మీరు ప్రేమతో ఇచ్చింది వాడుతున్నాను" అంది.

నవీన్ తన ప్రెజెంటేషన్ని కమల ప్రేమగా వాడుతున్నాననేసరికి పొంగి పోయాడు. ఆ హుషారులో, "అయితే ఒక పని చెయ్యి ఇప్పుడు. ఆ అమ్మాయికి,





# చతుర

విమల ఇచ్చిన బాక్సు ప్రజెంట్ చెయ్యి. వాళ్ళాయనకి ముందే చెప్పమను" అన్నాడు నవ్వుతూ.

ప్రజెంటేషన్ సమస్య తేలికగా పరి ష్కారమైనందుకు కమల ఆనందానికి



అవధులు లేవు. ఇలా ప్రతిదానికి కమల హైరానా పడిపోవటం వింతగా అనిపించింది నవీన్‌కి. అదే అడిగాడు ఆమెని. దానికి కమల గంభీరంగా మొహం పెట్టి "చూడండి! ముందు ముందు మనకు పిల్లలు పుడతారు. ఇప్పట్నించే మనము పొదుపుగా ఉండకపోతే ఎట్లా? ఎలాగో మనకు ఇది ఎక్స్‌ట్రానే. అది ఇలా పెట్టెలో పడి ఉండాల్సిందే. ఇలా ఉంచే బదులు మనము వేరే ప్రజెంటేషను కొన క్కర్లేకుండా ఇదే ఇస్తే బాగుంటుందిగా" అంది.

కమల మాటల్లో నిజముందనిపించింది నవీన్‌కి. అయినా పొదుపు, పొదుపు అంటూ కమల హనీమూన్‌కి వెళ్ళకుండా

## కతల్య

చేసింది. ఆ డబ్బుతో కొన్న దేపు రికార్డు, గ్రైండర్ చూసినప్పుడల్లా కసిగా తిట్టుకుంటాడు.

విశాల పెళ్ళికి ప్రజెంటేషన్ని చక్కగా ప్యాక్ చేయించి ప్రజెంట్



చేసింది. విశాల మొహమాటంగా తీసుకుంది.

పెళ్ళి హడావిడి అంతా అయిపోయిన తర్వాత తీరిగ్గా ప్రజెంటేషన్లు అన్నీ చూసుకుంటోంది విశాల. కమల ఇచ్చిన టాయ్‌లెట్ బాక్సు ఎంతో నచ్చింది. ఎన్నాళ్ళ నుంచో కొనాలని కోరిక. కమలది ఎంత చక్కటి అయిడియా. తన మనస్సు తెలుసుకొని ఇచ్చినట్టుంది అనుకుంది. ప్రతీ భరిణె విప్పి చూస్తోంది ఆనందంగా. పెద్దగా ఉన్న భరిణెలో ఒక చిన్న కాగితం, ట్రైను టిక్కెట్లు ఉండటం చూసి ఒక్క క్షణం అర్థం కాలేదు విశాలకి. కాగితం మడత విప్పింది. అందులో ...

"హలో కమలీ!"

నీ వివాహ సందర్భంగా నేను ఈ టాయ్‌లెట్ బాక్సుతో సహా ఇచ్చే కానుక ఏమిటో తెల్సా! కాశ్మీర్‌కు నీ భర్తతో హనీమూన్ వెళ్ళడం కోసం ట్రైను టిక్కెట్లు. ఫస్టుక్లాసులో రిజర్వ్ చేయించాను. కాశ్మీర్ ట్రిప్ బాగా ఎంజాయ్ చెయ్యి. ఆ కొద్దిరోజులు నీ పొదుపును తీసి గట్టు మీద పెట్టు. లేకపోతే ఒట్టే.

నీ విమ్మీ

పోయిన సంవత్సరము తారీఖున్న ఆ ఉత్తరం చూసి, 'పాపం కమల' అనుకుంది విశాల.

—హేమమాలిని

## రెండు రెళ్లు

కోదండరామం గారికి కోటి విద్యలు తెలుసు. అందుకే తుప్పలపాలెం బ్రిడ్జి కాంట్రాక్టు సంపాదించగలిగారు. అమెరికా చదువు చదివి వచ్చిన కొడుక్కి దాని నిర్మాణం అప్పగించి, ఆయన మరో కాంట్రాక్టు వేటలో పడిపోయారు!

భాస్కరం అడవి మధ్యలో వున్న తుప్పలపాలెం చేరుకున్నాడు. సిమెంటు, మెటల్ చేరుకున్నది. లేబర్ కావాలి. పట్నం నుంచి తీసుకుపోతే బోలెడు ఖర్చు. ఏం చెయ్యాలాని మీమాంస పడిపోయాడు!

"మీరు లేబరు కోసం సూత్తన్నారంట ఎంతమంది కావాలి. చవగ్గా ఏయిస్తే" గరిటయ్య అనే శాల్తీ వచ్చి అడిగింది.

"నూటయాభై మంది."

గరిటయ్య చుట్టుపక్కల గిరిజన ప్రాంతం నుంచి నూటయాభై మందినీ లాక్కువచ్చాడు. భాస్కరానికి వారి

మాట భాష అర్థం కాలేదు. మేస్త్రీలతో పేచీపడే వాడు.

గరిటయ్యకి కోపం [illegible] వచ్చేది.

"అన్నికి నేనే ఉంటానబాబూ!"

గరిటయ్యని వెంటే నాలుగు వందల జీతం మీద పెట్టుకున్నాడు. కోదండ రామయ్యగారు ఓ రోజున వర్క్‌స్పాట్‌కి వచ్చారు! గరిటయ్యని చూశారు.

"వాడే పని చేస్తున్నట్టులేదు. బీడీలు మాత్రం కాలేస్తున్నాడు."

భాస్కరం వాణ్ణి ఎందుకు పెట్టిందీ చెప్పాడు. దానికి కో.రా.గారు "అలా



బెదిరిస్తారు. ఇటువంటి వారికి నాలుగు వందలు అక్కర్లేదు. వందచాలు తగ్గించేయ్. లేకపోతే తీసేయ్ ఇలాగయితే మనకి మిగిలినట్లే, ఇక్కడికే బోలెడు వాటాలు." అని చెప్పి వెళ్ళిపోయారు.

నీ అవసరం లేదన్నట్లు గరిటయ్యకి దగ్గర తేల్చాడు. అంతే మధ్యాహ్నం లేబర్ రాలేదు. మేస్త్రీలు, ఇంజనీర్లు భాస్కరం మీద కోప్పడిపోయారు. "వచ్చేది వర్షాకాలం, పిల్లర్స్ లేచిపోవాలి. లేకపోతే కష్టం. పని సాగదు"

భాస్కరంకేం పాలుపోలేదు. గరిటయ్యని వుంచితే తండ్రికి కోపం. తనకి చేతకాదనుకుంటాడు. తీసేస్తే ఇక్కడ గోల. ఏమిటి చెయ్యడం?

భాస్కరం తెలుగు దినపత్రిక చదువుతుండగా జ్ఞానోదయమైంది. గరిటయ్యని పిలిచి "ఇక నీకు వంద రూపాయిలే జీతం. మామూలుగా పనిచెయ్యి..." చెబుతున్నాడు.

"అదేమిటిబాబూ! నాలుగు వందలకి తక్కువ పని చెయ్యను."

"కంగారుపడకు. జీతం వందే. రోజుకి పది రూపాయలు బేటా ఇస్తాను. వెళ్ళే ముందు నన్ను అడిగి పట్టుకుపో."

గరిటయ్యకి అభ్యంతరం లేకపోయింది.

నాలుగు వందలు పడాలి, అంతే.

తిరిగి బ్రిడ్జిపని చకచక సాగిపోతోంది. కోదండరామంగారు గరిటయ్యకి వంద జీతం ఇస్తున్నందుకు సంతోషించారు. గరిటయ్య నాలుగు వందలూ ముడుతున్నందుకు సంతోషించాడు. భాస్కరం చదివిన వార్త. "మంత్రి పదవులు దొరకని వారికి అధ్యక్ష పదవులు వగైరా ఇవ్వబడును, అవీ మంత్రి పదవితో సమానమైనవే!"

— చెల్లూరి సీతా రాజేశ్వరరావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402



Pri
Eena